# BHARATHIYA PAVITHRA PUNYA KSHETRALU

*By*
**Dr. Sesham Ramanujacharyulu**

T.T.D. Religious Publications Series No. 1362


*First Edition : 2019*

*Copies :* 3000

*Published by :*
**Sri ANIL KUMAR SINGHAL**, I.A.S.,
Executive Officer,
Tirumala Tirupati Devasthanams,
Tirupati.

***D.T.P:***
Publications Division,
T.T.D, Tirupati.

*Printed at :*
**Tirumala Tirupati Devasthanams Press,**
Tirupati.

## ముందుమాట

సనాతన ధర్మాన్ని, భారతీయ సంస్కృతిని పరిరక్షించడమేగాక, వాటిని పరంపరాగతంగా తర్వాతి తరాలకు అందించడంలో పుణ్యక్షేత్రాలు, దేవాలయాలు ఎనలేని ప్రాముఖ్యాన్ని సంతరించుకున్నాయి.

భాషలు వేరైనా, ఆచారపు అలవాట్లు వేరైనా, కట్టుబాట్లు వేరైనా, ఆసేతు హిమాచలం ప్రజలందరినీ ఒకేతాటిపై నడిపిస్తూ సంఘటిత పరుస్తున్న పుణ్యక్షేత్రాలు, దివ్య ఆలయాలు విశాలభారతదేశం అంతటా నెలకొని ఉన్నాయి.

ఈ ఆలయాల్లో కొన్ని వైష్ణవక్షేత్రాలు, మరికొన్ని శైవక్షేత్రాలు, ఇంకొన్ని శక్తిక్షేత్రాలు.... ఇలా దేశమంతటా వ్యాపించి వున్నాయి. వీటిల్లో కొన్ని స్వయంవ్యక్త క్షేత్రాలుగా ఉన్నాయి. మరికొన్ని దేవతలచేత ప్రతిష్ఠింపబడిన క్షేత్రాలుగా వెలసివున్నాయి. ఇంకొన్ని ఆర్షేయ క్షేత్రాలుగా ప్రతిష్ఠింపబడినాయి. మరికొన్ని దైవికంగా ప్రాకృతికంగా ఏర్పడ్డ క్షేత్రాలుగా దర్శనమిస్తాయి. ఈ క్షేత్రాల్లో దేని మహిమ దానిదే, దేని గొప్పదనం దానిదే. ఒక దానికొకటి ఏ మాత్రం తీసిపోవు. దేని ప్రాధాన్యం దానిదే.

ఇలాంటి అద్భుతమైన దివ్యక్షేత్రాలన్నింటిలో రచయిత శ్రీశేషం రామానుజాచార్యులు **వారణాసి, నైమిశారణ్యం, బదరీనాథక్షేత్రం, శ్రీవైష్ణోదేవి ఆలయం, అయోధ్య, పూరీ, ఉజ్జయిని, శ్రీసోమనాథ్, కాంచీపురం, తిరుమల శ్రీరంగం, మధురమీనాక్షి ఆలయం, చిదంబరం, రామేశ్వరం** ఇత్యాదిగా సుమారు 39 క్షేత్రాల చరిత్రలను, స్థలపురాణాలను సంక్షిప్తంగా తెలియజేశారు.

తి.తి.దేవస్థానం ఈ పుస్తకాన్ని **“భారతీయ పవిత్ర పుణ్యక్షేత్రాలు”** అనే పేరుతో అందిస్తున్నది. భక్తులు ఈ ధార్మిక ప్రచురణను సద్వినియోగం చేసుకోగలరని ఆకాంక్షిస్తున్నాను.

*సదా శ్రీవారి సేవలో....*



**కార్యనిర్వహణాధికారి**
తిరుమల తిరుపతి దేవస్థానములు
తిరుపతి.

# ప్రవేశిక

ఇది “భారతీయ పవిత్ర పుణ్యక్షేత్రాలు” అనే గ్రంథ రచనకు ప్రవేశిక మాత్రమే. విషయం భారతదేశమంత విశాలమైనది. సముద్రమంత గంభీరం. గగనమంతవైశాల్యం గలది. సముద్రాన్ని దోసిట్లో పట్టలేం కదా. కేవలం ఆకాశాన్ని అద్దంలో చూపడం వంటిదే కాని యీ క్షేత్రం గొప్పది, యీ క్షేత్రం గొప్పది కాదని చెప్పలేం. భారతదేశంలో ఉత్తర, దక్షిణ, తూర్పు, పడమర ప్రాంతాలలో ప్రవహించే పుణ్యనదులు, క్షేత్రరాజాలు, తీర్థరాజాలు అసంఖ్యాకంగా వున్నాయి. వీటన్నిటినీ ఒక్క గుప్పిట్లో చూపలేము.

తిరుపతి దేవస్థానం వారు గతంలో శ్రీవారి వైభవాలగురించి, శ్రీవారి మాహాత్మ్యం గురించి భక్తుల కథలు, కైంకర్య వివరాల గురించి ఎన్నో గ్రంథాలను ప్రచురించారు. అవి అందరికీ పరిచయమే.

ఈసారి భారతీయ పవిత్రపుణ్యక్షేత్రాల గురించి వ్రాయుమని నన్ను ఆదేశించారు. దేశం నాలుగు మూలలలో అక్కడక్కడ పేరుగాంచిన, క్షేత్రాల గురించివ్రాశాను. వ్రాసిన వాటికంటే, వ్రాయనివే ఎక్కువగా ఉన్నాయి. ఇది కేవలం స్థాలీపులాకన్యాయంగా మాత్రమే. తి.తి.దేవారు నా కీ అవకాశమిచ్చినందులకు, శతథా సహస్రథా కృతజ్ఞుడను.

భగవత్ శ్రీపాదరేణువు
**శేషం రామానుజాచార్యులు**

# విషయసూచిక


| | | |
|---|---|---|
| 1. | వారణాసి | 1 |
| 2. | గయాక్షేత్రం | 7 |
| 3. | ద్వారక | 11 |
| 4. | ప్రయాగ | 16 |
| 5. | నైమిశారణ్యం | 19 |
| 6. | హింగుళాదేవి | 24 |
| 7. | బుద్ధగయ | 26 |
| 8. | కైలాసమానససరోవరం | 29 |
| 9. | బదరీనాథక్షేత్రం | 33 |
| 10. | శ్రీవైష్ణోదేవి | 37 |
| 11. | బాసరక్షేత్రం | 39 |
| 12. | అయోధ్యానగరం | 41 |
| 13. | మథుర | 47 |
| 14. | పూరీ | 52 |
| 15. | కోణార్క | 57 |
| 16. | ఉజ్జయిని (అవంతి) | 60 |
| 17. | శ్రీసోమనాథక్షేత్రం | 66 |
| 18. | కాంచీపురం | 69 |
| 19. | అలంపురం | 76 |
| 20. | శ్రీరంగం | 79 |
| 21. | తిరుపతి | 86 |
| 22. | ఉడుపి | 90 |
| 23. | శ్రీవిల్లిపుత్తూరు | 92 |
| 24. | ఆళ్వార్ తిరునగరి | 95 |

| | | |
|---|---|---|
| 25. | శ్రీతిర్కుకోట్టియూర్ | 98 |
| 26. | శ్రీకాణిపాక గణపతి | 100 |
| 27. | మధుర శ్రీమీనాక్షీ సుందరేశ్వరస్వామి | 104 |
| 28. | చిదంబరం | 108 |
| 29. | హంపీ విరూపాక్షస్వామి | 112 |
| 30. | ధర్మపురి | 116 |
| 31. | శ్రీరామేశ్వరం | 119 |
| 32. | ధర్మస్థలి | 122 |
| 33. | గోకర్ణం | 124 |
| 34. | ద్రాక్షారామం | 127 |
| 35. | కురుక్షేత్రం | 131 |
| 36. | యాదగిరిగుట్ట శ్రీ లక్ష్మీనరసింహస్వామి క్షేత్రం | 135 |
| 37. | శ్రీకాళహస్తీశ్వర క్షేత్రం | 140 |
| 38. | కొల్హాపురం శ్రీమహాలక్ష్మి | 143 |
| 39. | శ్రీశైలక్షేత్రం | 147 |




# 1. వారణాసి (కాశీ)

ఇది ఉత్తరప్రదేశ్‌లో ప్రసిద్ధ పవిత్ర పుణ్యక్షేత్రం కాశీ. భారతీయులందరికి యిష్టమైన విశిష్ట ఆలయం. ఈ పట్టణం పౌరాణికంగా చారిత్రకంగా ఎంతో ఖ్యాతి పొందింది. ఇది సర్వ దేవతలకు నిలయం. ఈ దేవాలయ అధినేత విశ్వేశ్వరుడు, అమ్మవారిపేరు 'అన్నపూర్ణాదేవి'. సాక్షాత్తు పార్వతీపరమేశ్వరులు నివసించిన స్థలం. ఈ ప్రాంతానికి వారణాసి, వారాణసి, వారణసి, కాశీ అని వ్యవహారనామాలు, ఆంగ్లేయులు వారణాసిని బెనారస్ అని అన్నారు. ఇక్కడ ప్రసిద్ధమైన సంస్కృత విశ్వవిద్యాలయం వుంది. దానినే బెనారస్ యూనివర్సిటీ అని పేరు ప్రపంచంలో ఎక్కడా దొరకని సంస్కృత, హిందీ గ్రంథాలు యిక్కడ లభిస్తాయి.

వరుణ – అసి అని రెండు నదులు ప్రవహించి నందువల్ల ఈ క్షేత్రం వారణాసి అయిందని చెబుతారు. మనుచరిత్రలో పెద్దనగారు రాసిన "వరుణా ద్వీపవతీ తటాంచలమునన్'' అనుటలో ఇదే వరుణానది శ్రీనాథ కవిసార్వభౌముడు కావచ్చని కొందరంటారు. ఈ క్షేత్రం గురించి ఎక్కువగా, విపులంగా రాసినవాడు. ఈయన కాశీఖండ కావ్యంలో కాశీవర్ణన, ఓంకారేశ్వర వర్ణన, విశ్వేశ్వరుడు, అన్నపూర్ణాదేవి కాశీతీర్థ మాహాత్మ్యంతోపాటు కాశీపట్టణ పరిసరక్షేత్రాల గురించి కూడా రాశాడు. గంగానది పవిత్రతను చక్కగా వివరించాడు.

**కాశికాపట్టణము శంకరుని నెలవు**
**కలిప్రవేశింప దానందకాననమున**
**శ్రీనివాసంబు వారాణసీపురంబు**
**ముక్తి సంధాయకంబవి ముక్తకంబు**

శంకరుని నివాసమైన వారణాసి ఎంత పుణ్యక్షేత్రమంటే, అక్కడికి కలికూడ ప్రవేశింపలేని ముక్తి దాయకమైన క్షేత్రమని శ్రీనాథుడు వ్రాశాడు.

చతుర్విధ పురుషార్థములకు పుట్టినిల్లయిన కాశీ నగరంలో ప్రతి వాయు, జల, మృత్కణికలన్నీ పవిత్రములే. ఇది ఎంతో పవిత్రమైన క్షేత్ర తీర్థము. గాయత్రిని మించిన మంత్రం లేదు. కాశీని మించిన క్షేత్రం లేదని ప్రచారం. చాలా శక్తివంతమైన నగరం, ఎందుకంటే ఇది శివుని త్రిశూలంపై నిర్మింపబడిందని పురాణాల్లో వుంది. ఇంకా ఈ నగరంలో చూడ తగినవి డుంఠి వినాయకుడు, వీరభద్రేశ్వరస్వామి ఆలయాలు. పాపాలను నిర్మూలించే గంగా జలాన్ని, స్మరణమాత్రంచేత ముక్తి దాయకమై వర్ధిల్లుచున్న కాశీగనారాన్ని పురాణాలు ప్రశంసించాయి. మహాపురాణాలు, ఉపపురాణాలు కాశీఖండాన్ని పాప సంహార క్షేత్రంగా అభివర్ణించాయి. స్కాందపురాణ సారం కూడా యిదే. శివపార్వతుల క్రీడాభిరామమైన ఈ క్షేత్రానికి 'ఆనందకాననం' అని కూడా పేరుంది. ఇక్కడ గిరిజాదేవి, ఆకలిని తీర్చే అన్నపూర్ణగా కొలువు తీరివుంది.

ఈ కాశీ నగరంలో ధర్మం మూడు పాదాలుగా వుంటుందని అంటారు. ఇది యాత్రికులకు స్వర్గధామం – పూర్వం కాశికి వెళ్లిన వాడు కాటికి వెళ్లినట్లేయని భావించేవారు. ఇప్పుడలా కాదు. దేశం మొత్తం నుంచి, అన్ని ప్రధాన నగరాలనుండి రైలు సౌకర్యం, విమాన సౌకర్యం వుండడంచేత లక్షలాది భక్తులు స్వామిని సేవించి, గంగాస్నాన విశేష పుణ్యఫలాన్ని పొంది తిరిగి వస్తున్నారు. కాశీ నగరం గొప్ప యింతా అంతా కాదు. ఇదొక ఆధ్యాత్మశిఖరం – దైవభక్తికి కేంద్రం. పాప సంఘాతికి నిలయం.

**"కాశి కల్యాణములకాది కారణంబు**
**కాశి యణిమాది సిద్ధుల కాటపట్టు**
**కాశి జనలోక సంకల్ప కల్పకంబు**
**కలుష పిశితంబు మెసవు రాకాసి కాశి"**

సకల కల్యాణములు చేకూర్చే – అణి మాది అష్టసిద్ధులకు నెలవైన కాశి భక్తలోక కల్పవృక్షంగా భాసింస్తుందని, పురాణాలు, కావ్యాలు



ప్రశంసిస్తున్నాయి. కాశీ విశ్వేశ్వరుడు రుద్రాక్ష భద్రమూర్తి. రుద్రాక్షలను పూజించినా, చూచినా, స్పర్శించిన మోక్షదాయకమని భక్తులవిశ్వాసం, కుంకుమాది లేపనమునలంకలరించి, రుద్రాక్షలతో పూజిస్తారు – దివ్యహారతులు, నక్షత్రహారతులు, భూరిహారతులు ఇస్తారు స్వామి ప్రసాదంగా భస్మాన్ని స్వీకరిస్తారు. లయకారుడైన మహేశ్వరుడు భస్మాంగరాగుడు.

ఈ నగరం అతిప్రాచీనవైనదని 3000 సంవత్సరాలక్రితం నిర్మింపబడిందని పురాణలు చెప్తున్నాయి. ఇక్కడ కాశీజాతివారు నివసించడం చేత "కాశి"గామారిందని ఒక వాదన – ఈ నగరంపై తుర్కుషులు దాడి చేసి ధ్వంసం చేశారు. క్రీ.శ.1464లో, 1505లో ముస్లిం ప్రభువుల దాడివల్ల ధ్వంసమయిన తర్వాత, సుమారు 70 సంవత్సరాల కాలం పాటు విశ్వేశ్వరునికి పూజలు జరుగలేదు. తత్ఫలితంగా కరువు కాటకాలు సంభవించాయి. కొన్నాళ్ల తరువాత, హిందువులు, ముస్లిములు కలిసి గుడిని కట్టించారు. ఎన్ని గోడలు, ఎర్రని శిఖరాలతో విరాజిల్లుతుంది. ఈ గుడిని ఆనుకొని, మసీదుని నిర్మించారు. ముస్లిం రాజులు, కాలక్రమంగా, ద్వేషాలు తొలగిపూయి, అందరూ విశ్వేశ్వరుని పూజిస్తున్నారు. ప్రసిద్ధ హిందూ స్థాని షెహనాయ్ విద్వాంసుడు ఉస్తాద్ బిస్మిల్లాఖాన్ ప్రతిరోజు స్వామి ఎదుట ఓ గంట సేపు షెహనాయ్ వాద్యంతో నాదారాధన చేసేవాడట. ఇక్కడ శివుణ్ణి అన్ని మతాలవారు ఆరాధిస్తారు. విశ్వేశ్వరుని గుడికి సరిగ్గా ఎదురుగా 'అన్నపూర్ణాదేవి ఆలయం వుంది. ప్రక్కనే డుంఠివినాయకుడు క్షేత్ర పాలనాధికారిగా కాలభైరవుడు న్యాయాధికారిగా వుంటాడని చెబుతారు. భక్తులు తప్పకుండా మొట్టమొదట వినాయకుని సందర్శించి, ఆయన అనుమతితో విశ్వేశ్వరుని దర్శిస్తారు. అక్కడకి సమీపంలో విశాలాక్షి దేవాలయం వుంది. కాశీలో నివసించిన ఒక మహాత్ముడు 'నారాయణభట్టు ఇప్పటి దేవాలయం నిర్మించగా తదుపరి కాలంలో 1783లో రాణి అహల్యాబాయి, ఆ తర్వాత రాజా రంజిత్‌సింగ్ ఈ విశ్వేశ్వరస్వామికి అన్ని

హంగులతో – వెండి, బంగారు గోపురాలు, ఆభరణాలతో సర్వాంగభూషితుణ్ణి చేశారు. తెల్లవారు ఝామున 3 గంటలనుండి రాత్రి 11 గంటలవరకు దర్శన సౌభాగ్యం కలుగుతుంది. అన్నపూర్ణా దేవికి నిత్యకుంకుమార్చన, విశ్వేశ్వరస్వామికి నిత్యాభిషేకాలు జరుగుతుంటాయి. అన్నపూర్ణాదేవి రెండున్నర అడుగుల ఎత్తుబంగారు తొడుగుతో అలంకరిపంబడి వుంటుంది.

**కాశీలోమరణం :** దేశదేశాలు తిరిగి చివరకు కాశీలో మరణిస్తే సాక్షాత్తు కైలాసం చేరుకుంటారని భక్తులు విశ్వసిస్తారు. నిరంతరం హరిశ్చంద్ర ఘట్టంలో శవాల దహనం జరగడంవల్ల దీనిని మహాస్మశానమని కూడా అంటారు. ఇక్కడ అన్నీ భస్మసింహసనాలే. ఇక్కడ ప్రసిద్ధమైన స్నానఘట్టాలున్నాయి. అందులో మణికర్ణిక, హరిశ్చంద్రఘట్టాలు ప్రముఖమైనవి. ఒకప్పుడు హరిశ్చంద్రుడు మహాచక్రవర్తిగా కాశీరాజ్యాన్ని పాలించాడు. ఇక్ష్వాకువంశతిలకుడైన శ్రీరామ చంద్రమూర్తివలె యితను గూడ, ధర్మమూర్తి సత్య నిష్ఠాగరిష్ఠుడు. జీవితంలో అబద్ధం ఆడనని ప్రతిజ్ఞ చేశాడు. దేవతలు "నక్షత్రకుని" మూలాన, విశ్వామిత్రునికి రాజ్యం ధారాదత్తం చేసి, కష్టాల పాలైనాడు. భార్యను అమ్ముకున్నాడు. శ్మశానంలో కాటికాపరి ఉద్యోగం చేశాడు. కొడుకును పోగొట్టుకున్నాడు. భార్యచంద్రమతి శీలవతి. వీరిరువురి సత్యశీలతకు శివుడు, బ్రహ్మ ప్రత్యక్షమై – ముక్తిని ప్రసాదించాడు. అటువంటి ధర్మక్షేత్రం ఈ శివక్షేత్రం.

**దర్శనీయ స్థలాలు :** కాశీక్షేత్రం మొత్తం అణువణువునా పుణ్యస్థలమే కాలభైరవ దేవాలయం, సంకట విమోచన దేవాలయం విశాలాక్షీమందిరం, వారాహీమాత మందిరం, దుర్గామాత, భారతమాత మందిరాలు, తులసీ మానస మందిరం యింకా ఎన్నో చిన్నా చితకా మందిరాలున్నాయి. 100 స్నానఘట్టాలున్నాయి. కొన్ని ప్రైవేటు వారి ఆస్తులు. కొన్ని మరాఠీపాలకులు కట్టించినవి. గంగకు వేగం ఎక్కువ. అక్కడ కట్టిన గొలుసులను పట్టుకొని గంగలో స్నానం చేయాలి. అక్కడ పిండప్రదానాలు ఎక్కువగా జరుగుతుంటాయి. ఇక్కడి బ్రాహ్మణులను పండాలంటారు.



**ఇదొక బౌద్ధక్షేత్రం :** ఒకప్పుడు ఇది గొప్ప బౌద్ధక్షేత్రం. బౌద్ధులు ఎక్కువసంఖ్యలో వచ్చేవారట ఇక్కడికి సమీపంలో సారనాథ్‌స్తూపం వుంది. వారణాసి, కుశీనగరం, బోధగయ, లుంబిని – ఇవి బౌద్ధుల యాత్రాస్థలాలు. శాక్తేయులకు శక్తిస్థలం, శైవులకు శివక్షేత్రం, బౌద్ధులకు బౌద్ధక్షేత్రంగా అన్ని మతాల ఆదరణ పొందిన పుణ్యస్థలి యీ కాశీస్థలి. ఇది ద్వాదశ జ్యోతిర్లింగాలలో అత్యంత ప్రధానమైనది. బౌద్ధ – జైన – శాక్తేయులకు ఆదినాథుడు యీ పరమేశ్వరుడు.

**ఆదిశంకరుల నివాసం :** జగద్గురువు ఆదిశంకరాచార్యులు కాశీలో కొంతకాలం నివాసముంటూ స్వామిని ముప్పూటలా సేవించేవారట. గంగాస్నానం – శివదర్శనం ఎంతో ముఖ్యమైనదని ఆదిశంకరులు చెప్పారు. వారు యిక్కడనే "భజగోవిందస్తోత్రం, బ్రహ్మసూత్రభాష్యాన్ని రచించారట. ఆదిశంకరులకు ప్రియమైన క్షేత్రం.

ద్వాదశ జ్యోతిర్లింగాలలో ప్రముఖమైన యీ క్షేత్రంలో శివుడు లింగాకారంలో దర్శనమిస్తాడు. ఎక్కడెక్కడినుండో యాత్రికులు వచ్చి శివదర్శనం, అన్నపూర్ణాదేవి అనుగ్రహం పొంది, యిక్కడి భగత్ప్రసాదం తీసికొని మధురానుభూతులతో తిరిగి వెళ్తారు. యాత్రా చరిత్రలో ఏనుగుల వీరాస్వామి, కాశీయాత్ర చరిత్ర, శ్రీనాథమహాకవి కాశీఖండము – స్కాందపురాణంలోని కాశీఖండము ప్రధానమైనవి. ఇక్కడ దుర్గామందిరం, తులసీమానస మందిరం ముఖ్యమైనవి. పాలరాతితో నిర్మించబడిన యీ దేవాలయంలో తులసీ దాసు రామాయణం రాయబడింది. దుర్గామందిరం చుట్టూ కోతులుండడం వల్ల కోతులగుడి అని కూడా అంటారు. నాగపంచమి ఉత్సవాలు బాగా జరుగుతాయి. ఆధునిక శైలిలో నిర్మాణమైన మందిరాలలో, బెనారస్ విశ్వవిద్యాలయంలోని బిర్లామందిరం చూపరులను ఆకర్షిస్తుంది. సర్వాంగ సుందరమైన అనేక మందిరాల, అనేక పుణ్యదేవాలయాల మూర్తుల నిలయం కాశీనగరం. కాశీని స్మరించినా, దర్శించినా, ఆ క్షేత్రాన్ని గూర్చి పఠించినా మోక్షఫలం లభిస్తుంది.

**గృహము వారాణసీసీమ గృహిణి గౌరి**
**విశ్వనాథుడు గృహమేధి శాశ్వతుండు**
**పరమకారుణ్య మూర్తులు దంపతులు వారు**
**మునికి నప్పుడు సిద్ధించు మోక్ష భిక్ష ॥** అన్నాడు.

శ్రీనాథకవి కనుక ఆ దంపతులను యిష్టపూర్తిగా పూజిస్తే ఆ అష్టమూర్తి మోక్షాన్ని ప్రసాదిస్తాడు. కనుక, జీవితంలో ఒక్కసారైనా "వారణాసీ క్షేత్రంలో శివమూర్తిని విశాలాక్షీ, అన్నపూర్ణా, అమ్మవారుల కృపాకటాక్ష శ్రీలను పొంది తరింతురు గాక–

**ఇతి శివమ్**



# 2. గయాక్షేత్రము

'గయ' హిందువులకు, బౌద్ధులకు పవిత్రక్షేత్రం. ఇది బీహారు రాష్ట్రంలో 'గయ' – జిల్లాలో వుంది – గయలో ముఖ్యంగా పితరులకు పిండప్రదానాలు జరుగుతాయి. ఇది ముక్తిక్షేత్రం. 'గయాసురుడు' అనే రాక్షసుని వల్ల యీ నగరానికి 'గయ' అని పేరు వచ్చిందంటారు. గయకు సమీపంలో బుద్ధగయవుంది. ఇదే బుద్ధదేవునికి జ్ఞానోదయం కలిగిన పుణ్యస్థలం. గయ గురించిన కథలు చాలావున్నాయి. పౌరాణికంగా చారిత్రకంగానూ రెండూ ప్రసిద్ధమైనవే.

**గయుడు రాక్షసుడు :** జన్మతః గయుడు రాక్షసుడైనప్పటికి విష్ణుభక్తుడు. బ్రహ్మను గురించి తపస్సు చేసి అనేక వరాలు పొందాడు. ఇతనిలో క్రూరకర్మలు, హింసా వాదాలు లేవు. తనను తాకిన వారికి మోక్షం రావాలంటాడు. ఇదే అతని కోరిక, అనేక వేలసంవత్సరాలు శ్రీమహావిష్ణువు గూర్చి తపస్సు చేశాడు. విష్ణువు ప్రత్యక్షమై ఏం కావాలని అడిగాడు. నా శరీరం పరమ పావనమైన తీర్థాలకన్నా పవిత్రంగా వుండాలని వరం కోరుకున్నాడు. విష్ణువు ఆ కోరికను మన్నించగా అతని శరీరం పవిత్రమైపోయింది. చివరకు గాలిలో తిరిగే క్రిమికీటకాదులు, పక్షులు, ఏవి తాకినా అవి మోక్షానికి పోయేవి. పంచమహాపాతకాలైన, బ్రహ్మహత్య; సురాపాన, చోర స్వర్ణస్తేయ, గురుతల్పములంటినవారు కూడ, యితని శరీరాన్ని తాకితే పాపాలు పటాపంచలైపోతుండేవి. గయుడు చేసిన యీ ఉపకారం వల్ల జీవులన్నీ వైకుంఠలోకానికే పోతున్నాయి. పైగా యితడు చేసిన యజ్ఞాలవల్ల 'ఇంద్రునికి' ఇంద్రపదవి పోయింది. అందరూ పుణ్యలోకాలకు పోవడంవల్ల యమధర్మరాజుకు పని లేకుండాపోయింది. ఇంకా ఆందోళన మొదలైంది. ఇంద్రుడు తన పదవి పోయిందని చెప్పి, బ్రహ్మగురించి తపస్సు చేశాడు. బ్రహ్మను ప్రసన్నం చేసుకున్నాడు.

యమధర్మరాజు బ్రహ్మతో మొరపెట్టుకున్నాడు. తనలోకం ఖాళీగా వుందని. బ్రహ్మ ఓ గొప్పయాగాన్ని తలపెట్టానని, గయుణ్ణి, దానికి తగిన పరమపవిత్రమైన విశాలమైన స్థలాన్ని యిమ్మని అడిగాడు. గయాసురుడు 100 మైళ్ల కొలది పొడవు, వెడల్పుగల తన భారీ శరీరాన్ని అర్పించాడు గయాసురుడు. బ్రహ్మయాగం మొదలుపెట్టాడు గయుణ్ణి శరీరంమీద – కొంతకాలానికి గయుని తల అటు యిటు కదిలిందట – పెద్ద పెద్ద శిలలను గయుని తలపై పెట్టాడట బ్రహ్మ – అయినా కదులుతుందట. ఎంత చేసినా ఫలించక, విష్ణుమూర్తిని వేడుకున్నాడు బ్రహ్మ. గండశిలలు జారితొలగి కొద్ది దూరంలో రామపర్వతం, ప్రేత పర్వతంగా మారిపోయాయట చివరకు 'మరీచి' శాపంవల్ల శిలారూపంగా మారిన మహాపతివ్రత "దేవవ్రత" శిలను తెచ్చి తలపై పెట్టాడు బ్రహ్మ. పతివ్రతను కాదనలేక, కదలకుండా వున్నాడట – అయినా తర్వాత తిరిగి కదలిందట. తల అప్పుడు విష్ణువే గదాధరుడైవచ్చి 'గయుని" శిరస్సుపై తన కాలును పెట్టి తొక్కిపట్టాడు.

అపుడు గయుడు సంతోషించి, స్వామీ! బ్రహ్మగారు నా శరీరంపై యాగం చేయడం, దేవవ్రతయైన మహాపతివ్రతను నా తలపై పెట్టడం. సకల భువన రక్షోదక్షులైన, మీరు మీ పాదాన్ని తలపై అదిమి పెట్టగా, యిన్ని పుణ్యకార్యాలవల్ల నా శరీరం పవిత్రమైంది. ఈ క్షేత్రం దర్శించేవారు. పితరులకు పిండప్రదానాలు చేసి, నా శరీరాన్ని అంటే యీ పృథ్విని' తాకడంచేత పవిత్రులుగా మారాలని నాకు వరం యివ్వండని వేడుకోగా, అలాగేయని గదాధరుడు వరమిచ్చాడు. ఇదే తర్వాత తర్వాత గదాధరక్షేత్రం అయిందని హిందువుల విశ్వాసం. ఈ విధంగా, గయాసురుని పేరవెలసిన "గయ" పవిత్రస్థలంగా హిందువులు భావించి, తప్పకుండా దర్శనం చేసుకుంటారు.

**చారిత్రక 'గయ' :** బీహార్ రాష్ట్రరాజధాని పాట్నా (పాటలీపుత్రం)కు 100 కి.మీ. దూరంలో ఉంది. గయ చారిత్రక మగధ సామ్రాజ్యంలో ఒక నగరం,



ఒక క్షేత్రం. బుద్ధుని అవతారం తర్వాత 'గయకు' ప్రాధాన్యత పెరిగింది. గయకు 11 కి.మీ దూరంలో బుద్ధునికి జ్ఞానోదయం కలిగిన బోధగయ – వటవృక్షం వుంది – గయ పవిత్ర గంగానది ఒడ్డున వెలసిన పుణ్యస్థలం. రాయగిర్, నలందా, తక్షశిల, పాటలీపుత్ర వంటి చారిత్రక నగరాలు గయకు సమీపంలోనే వున్నాయి. నలందా, తక్షశిలా విద్యాలయాలు జ్ఞానభాండాగారాలు. వేదాల కాలంలోనే యీ గయకు ప్రాముఖ్యం పెరిగింది. ఇక్కడి, సంస్కృతి, నాగరికత వేదకాలం నాటిది. బుద్ధుని బోధలు విస్తరించిన నేల. అహింసా సిద్ధాంతాన్ని బోధించిన విద్యాలయాలు. ఇది మగధను పాలించిన మౌర్య చక్రవర్తుల అధీనంలో సుభిక్షంగా వెలసిన దివ్యస్థలాలు సంగమం. రాజకీయంగా కూడా యీ ప్రాంతం ఎంతో ప్రముఖమైనది – ప్రఖ్యాత జాతీయవాది బీహార్ విభూతి డాక్టర్ అనుగ్రహ నారాయణసింహ జన్మస్థలమిది. ఈయన మొదట బీహార్ ఉపముఖ్యమంత్రిగా పనిచేశారు. మగధ చివరిరాజు టెకురీ, బీహార్ రైతునాయకుడు స్వామి గుహజానంద సరస్వతీ యిక్కడివారే. మరోరైతు నాయకుడు యదునందన్‌శర్మతోపాటు ఎందరో జాతీయ నాయకులకు ఇది కేంద్రభూమి. చిత్తరంజన్ దాస్, ప్రఖ్యాత సంఘసేవకుడు శ్రీఈశ్వర్ చౌదరి, జగ్‌జీవన్‌రామ్ వంటి బలమైన నాయకులకు జన్మభూమి అయిన బీహార్ రాష్ట్రం లోని 'గయ' పౌరాణిక ప్రాధాన్యతతోపాటు చారిత్రక నేపథ్యం కూడా కలిగివుంది.

పితరులకు పిండ ప్రదానం చేస్తే – వారికి మోక్షం లభిస్తుందని హిందువుల నమ్మకం. ఇక్ష్వాకు వంశతిలకుడైన శ్రీరాముడు, తన దేవేరి సీత, సోదరుడు లక్ష్మణునితో కలిసి గంగాతీరం వద్దకు చేరి, 'గయా' క్షేత్రంలో పిండప్రదానం చేసినట్లు పురాణాలలో కనబడుతుంది. పిండ ప్రదానానికి ముందు స్నానం చేయడానికి రాముడు వెళ్ళిన సమయంలో, మహారాజైన దశరథుని హస్తాలు రెండు సీతకుముందు చాపి తాను చాలా ఆకలిగా ఉన్నానని, పిండప్రదానం చేయమని అడిగాడట. సీత అలాగే దశరథుని

చేతిలో రెండు పిండాలను ఉంచిందని చెబుతారు. స్నానానంతరము యథావిధిగా పిండములు తయారు చేసి అర్పింపగా, తండ్రి దశరథుడు స్వీకరింపకపోయినప్పుడు శ్రీరాముడు ఆశ్చర్యపడినాడట. సీతాదేవి తర్వాత జరిగిన కథ చెప్పింది. సీతాదేవి అక్కడగల ఆవును, రావిచెట్టును దీవించిందట. రావి చెట్టు ఎప్పుడూ చిగురాకులతో గలగలలాడుతూ ఉంటుందని వరమిచ్చిదంట. అందుకే రావిచెట్టుకు చలపత్రవృక్షమని పేరు. ఇలాంటి అనేక కథలతో ముడిపడిన, పితరులకు మోక్షం ప్రసాదించే పుణ్యక్షేత్రం 'గయ'ను చూచినా, గయ గురించి విన్నా, చదివినా ముక్తి కలుగుతుందని హిందువుల విశ్వాసం.



# 3. ద్వారక

లోక రక్షణార్థము, భూలోకంలో పరతత్త్వ రూపమైన శ్రీకృష్ణపరమాత్ముడు నివసించి, వారిపాద స్పర్శచేత పునీతమైన దివ్యక్షేత్రాలలో అతి పవిత్రమైనది ద్వారక, అయోధ్య, మధురా, మాయా, అవంతి, కాశీనగరం, కాంచీపట్టణాలు చూచిన తర్వాత తప్పక ద్వారకానగరాన్ని దర్శించి తరించవలసిందే దీనికి మోక్షపురి అనే పేరు సార్థకం. శ్రీకృష్ణుడు యిక్కడ రాజ్యాధికారము నిర్వహించాడు. ఇది చాలా పెద్ద నగరం. దీని వైశాల్యం 12 యోజనాల పొడవు – 12 యోజనాల వెడల్పు గల నగరం నిరంతరం ప్రజలచేత కిటకిటలాడేదట ఈ నగరం గురించి యింకా పరిశోధనలు చేస్తున్నారు శాస్త్రజ్ఞులు.

**మహానగర నిర్మాణం :** చాలాకాలం శ్రీకృష్ణుడు మధురలోనే వుండేవాడు. బాల్యమంతా అక్కడే జరిగింది. మధుర, బృందావనం, గోవర్ధనగిరి ఆయనకు క్రీడాస్థలాలు. శ్రీకృష్ణుడు తన పాదస్పర్శచేత ఆ ప్రదేశాలను పునీతం చేశాడు. రాజ్యం సుభిక్షంగా, సురక్షితంగా వుంది. అయితే ఈ నగరాన్ని ఎలాగైనా ధ్వంసం చేయాలని ఒకవైపు జరాసంధుడు మరోవైపు కాలయవనుడు లక్షలాది సైన్యసమేతంగా తరచు దాడి చేసేవారు. ఎంతమంది దుర్మార్గులనైనా బలరామకృష్ణులు గడ్డిపోచలాగ అణచివేసేవారు. యమునానది ఒడ్డున గల యీ నగరాన్ని జరాసంధుడు దాడిచేసి, పౌరులను, యువతులను, సైన్యాన్ని బంధించి కారాగారంలో వేశాడు. కంసునితో పోరాటం సరేసరి. అది తప్పనిదే. శ్రీకృష్ణుడు, భీమునితో కలిసి వ్యూహాత్మకంగా, జరాసంధునిపై ఎదురు తిరిగి వధించి, బంధితులను విడుదల చేశాడు. ఇక రాజ్యం ఎప్పుడూ శత్రుదాడులతో తలపడకుండా, ప్రజలందర్నీ సురక్షిత ప్రాంతాలకు తరలించాలనే ఆలోచన చేశాడు శ్రీకృష్ణుడు. పడమటి దేశం వద్దగల నేటి సౌరాష్ట్రం ప్రాంతంలోగల సముద్రుడిని శ్రీకృష్ణుడు రాజధాని నిర్మాణానికి స్థలం అడిగాడు. సరేనని సముద్రమధ్యంలో ఓ ఎత్తైన పీఠభూమిని

చూపించాడు. వెంటనే శ్రీకృష్ణుడు విశ్వకర్మమయుని పిలిపించి సర్వజనులు ఆశ్చర్యపడేవిధంగా, సుందరమైన భవనాలతో ఒకనగరాన్ని నిర్మించమని కోరాడు. ద్వారకాధీశుని ఆజ్ఞప్రకారం అనుకున్న సమయంలో మహాద్వారకను నిర్మించి యిచ్చాడు – నగరవైశాల్యం 12 యోజనాలపొడవు అంతే యోజనాల వెడల్పుగల నగరంలో అనేక రాచవీధులు – రథాలు, గుర్రాలు, సైన్యం తిరిగేలా విశాలమైన వీధులు నిర్మించాడు. అందులో ఆకాశాన్నంటే ఎత్తైన మేడలు, కిటికీలు, తలుపులు, గోడలు అన్నీ బంగారమే. రత్నఖచితమైన సింహాసనాలు. 16 వేల గదులు, పానీయశాలలు, పాకశాలలు, వీధి అరుగులు, చతుశ్శాల భవనాలు, నడుమ నడుమ తోటలు, అందులో విరజిమ్మే జలయంత్రాలు, సుగంధ భరిత పూలతోటలు. ఇలా ఎన్నో నిర్మించిన నగరం అది కిటకిటలాడే ఆనాటి ద్వారకానగరానికి అన్నివైపులా ద్వారాలు ఉండడం వలన 'ద్వారక' అయిందని అంటారు. మహానగరానికి విశాలమైన ఎత్తైన ప్రాకారాలు, చుట్టు అగడ్తలు, ఊరినిండా ఆవులు, గుర్రాలు, పాడి పశువులు. విపణి వీధులు, క్రయవిక్రయాలతో ద్వారకానగరం జనసమ్మర్ధ నగరం. ఆ గ్రామవాసులు అసత్యాలు మాట్లాడరు. బ్రాహ్మణులు వేదాధ్యయన సంపన్నులు. క్షత్రియులు బలవంతులు – వైశ్యులు అపర కుబేరులు. నాలగవజాతివారు వ్యవసాయం, ఇతరులు వృత్తి కర్మచారులు. ధర్మం మూడుపాదాలు నడిచే ద్వారకకు మోక్షద్వారమని కూడా పేరుంది. ఆనాటి ద్వారకావాసులు ప్రతినిత్యం శ్రీకృష్ణ పాదసేవానురక్తులై వారిని దర్శించుకునే వారట. మధురానగరవాసులందరినీ, ద్వారకానగరంలో ప్రవేశింప చేశాడు ద్వారకాధీశుడు. కాలగమనంలో, ద్వాపరయుగాంతంలో ముసలం ద్వారా యాదవనాశనం జరిగింది. తదుపరి శ్రీకృష్ణనిర్యాణంతో, సముద్రం ఉప్పొంగి ద్వారకను తన బడిలోకి తీసుకుంది – అప్పటి నుండి ప్రాచీన ద్వారకను, చూచినవారు లేరు.

**ఆధునిక ద్వారక :** ద్వారకాధీశునికి ఆలయం నిర్మించారు గుజరాత్‌లోని జామ్‌నగర్ జిల్లాలో భారతదేశంలోని నాలుగు మూలలోని నాలుగు



ధామాలలో ద్వారకాధామం ఒకటి. మిగతావి పూరీ, రామేశ్వరం, బదరీ ధామాలు ఇవన్నీ కూడ మోక్ష ధామాలే.

ఈ ఆధునిక నగరం అక్షాంశరేఖ 22.23కాగా 68.97 రేఖాంశంమీద వుంటుంది. పదోశతాబ్దంలో ఈ కొత్త పట్టణాన్ని కట్టినట్లు చారిత్రక ఆధారాలు లభించాయి. తర్వాతి, రోజులు క్షేత్ర అభివృద్ధిని, చేసి ప్రశస్తిని పెంచారు. మొట్టమొదట శ్రీకృష్ణుని మనుమడైన వజ్రనాభుడు. ద్వారకాధీశునికి ఓ అందమైన గుడి కట్టించాడట తర్వాత 16వ శతాబ్దంలో 5 అంతస్థుల గోపురం నిర్మించాడట. ఆలయ గోపురం మీద జండాను రోజుకు అయిదుసార్లు ఎగురవేస్తారట. ఈ ఆలయానికి రెండు ద్వారాలున్నాయి. ఒకటి స్వర్గద్వారం – రెండవది మోక్ష ద్వారం. భక్తులు స్వర్గ ద్వారం నుండి వెళ్లి మోక్షద్వారం గుండా బయటికి వస్తారు. ఇక్కడ గోమతీనది సముద్రంలో కలిసే చోటు ఒక గొప్ప సుందర దృశ్యం. దీనిని చూడవలసిందే. ఇక్కడే, వసుదేవ, దేవకి, బలరామ, రేవతి సుభద్ర – రుక్మిణీ దేవి, జాంబవతీ దేవి, యింకా సత్యభామాదేవి ఆలయాలు ఉన్నాయి. ద్వారకాలయానికి బయలుదేరే దారిలో రుక్మిణీదేవి ఆలయంవుంది. దీనిని పడవలో వెళ్లి చూడవచ్చు. ద్వారకాపురికి సమీపంలో జ్యోతిర్లింగాలలో ఒకటైన 'నాగేశ్వర' లింగం వుంది – ద్వారకలో శంకరాచార్యులు ఒక పీఠాన్ని ఏర్పాటు చేశాడు. అదే 'ద్వారకాపీఠం'. ఇక్కడ ద్వారకాధీశుడు క్షత్రియరాకుమారుడు వివాహఅలంకరణలో దర్శనమిస్తాడు. ఈ శ్రీకృష్ణదేవాలయాన్ని దర్శించిన మహానుభావులలో కృష్ణభక్తి మాధుర్యాన్ని పంచిపెట్టిన శ్రీవల్లభాచార్యులు యిక్కడ పుష్టిమార్గాన్ని ప్రచారం చేశాడు. స్వామికి ఆ యా పూజలవేళలకు తగినట్లుగా వస్త్రధారణ చేస్తారు. నిత్యపూజలు, సేవలు, అర్చనలు నిరంతరం జరుగుతాయి.

**ద్వారకాసామ్రాజ్యం :** ద్వారకానగరం రాజధానిగా చేసికొని 'శ్రీకృష్ణుడు ధర్మపరిపాలన చేశాడు. ప్రతిరోజు 'గంట మ్రోగించి, ప్రజల ఫిర్యాదులను

స్వీకరించేవారు. ప్రజలకష్టనష్టాలు తెలిసికొనే వ్యవస్థ ఉండేదని, ద్వారకానగరాన్ని పటిష్ఠంగా నిర్మింపచేశాడనీ పలుపురాణాలు పేర్కొన్నాయి. ముఖ్యంగా, వ్యాసభాగవతం, వ్యాసభారతం, స్కాందపురాణం, విష్ణుపురాణం, హరివంశం మొదలగు గ్రంథాలలో శ్రీకృష్ణ పరిపాలన గురించి వుంది. శ్రీకృష్ణ జరాసంధుల మధ్య 17 సార్లు యుద్ధం జరిగిందట. ఇతనికి కూడ 18 అక్షౌహిణులసైన్యం వుండేదట. 18వ సారి, మధురానగర ప్రజలందరిని ద్వారకకు తరలించి సురక్షితం చేశాడు. మధురలో కంస వధానంతరం, కంసుడి తండ్రి ఉగ్రసేనుడిని రాజును చేశాడు. జరాసంధుడు క్రీస్తు పూర్వం 800 నుండి 1000 సంవత్సరాల మధ్య జీవించాడు. అలాగే భీష్మాచార్యులు కూడా క్రీస్తు పూర్వం 800 నుండి 1000 సం॥ మధ్య జీవించారట ఈ మహానగరాన్ని ద్వారావతి, ద్వారవతి, ద్వారక అని కూడా పిలుస్తారు.

ఈ ద్వారకానగరం గురించి శాస్త్రీయ పరిశోధనలు పదేళ్ల క్రితం తిరిగి ప్రారంభమైనాయి. పూర్వ కేంద్రమంత్రి డా॥మురళీమనోహర్ జోషీ పర్యవేక్షణలో జరిగిన భూగర్భజల పరిశోధనలలో అనేక చారిత్రక ఆధారాలు లభించాయి. పడవలకు, ఓడలకు గట్టిగా బిగించే రాతి లంగరులు దొరికాయి. ఎంత ఓడనైనా కదలకుండా చేసే ఇనుప పగ్గాలు ఉన్నాయట. రాగి, ఇనుము, వెండి, బంగారంతో చేసిన వస్తువులు, కత్తులపడులు, వంటలకుపయోగించే పాత్రలు, కుండలు, రోళ్లు, నాణాలు లభించాయి. వీటిని కాలనిర్ణయంకోసం లండన్ మ్యూజియంలో భద్రపరచారు. 2001లో మళ్లీ కొన్ని క్రొత్తక్రొత్త పరికరాలు త్రవ్వకాలలో దొరికాయి. సముద్ర గర్భంలో మునిగిన ద్వారకానగర భవనాలు, వీధుల ఫోటోలు తీసి భద్రపరచారు. గుజరాతు ప్రభుత్వంలోని పర్యాటకరంగం ఎక్కువ శ్రద్ధతీసికొని ద్వారకను చూపించే ప్రయత్నాలు చేస్తున్నది. సముద్రగర్భ నిక్షేపాలను కనిపెట్టి ప్రదర్శిస్తే. మొట్టమొదటి సముద్రగర్భ వస్తు ప్రదర్శనశాల అవుతుంది. ద్వారకను చూడాలనే ఆసక్తివుంది. “అదిగో ద్వారక, ఆలమంద లవిగో – అందందు గోరాడు నయ్యదియే కోట; అదే యగడ్త – వారలే యాదవుల్ – యదుసింహుడు వసించుమేడ అదిగో – అంటూ చూసే అవకాశం రావాలని కోరుకుందాం.



ఈ నగరంలో 16108 భవనాలున్నాయట. శ్రీకృష్ణుని 16వేల 108 భార్యలకోసం కట్టించిన భవనాలు గల నగరం ఎంత విశాలంగా వుందో ఊహించడానికే వీలులేదు.

అర్జునుడు, ధర్మరాజు, భీమ, నకుల సహదేవులు యీ నగరానికి వచ్చారు. నగరం సముద్రంలో మునిగిపోగా మిగిలిన శ్రీకృష్ణబలరాములు కూడ కాలగర్భంలో కలిసిపోగా, అర్జునుడు వారికి అంత్యక్రియలు యిక్కడే నిర్వహించాడని భారత కథనం.

సముద్రంలో మునిగి పోకుండా, యాదవులను దాటించారు. అలా దాటించిన మరుక్షణంలో ఒక్కొక్క భవనం కూలి నీళ్లల్లో కలిసిపోయింది. శ్రీకృష్ణుడే లేనప్పుడు నగరశోభ ఎందుకని, సముద్రుడు ఆ సుందర నగరాన్ని తనలోకి లాక్కున్నాడు.

ఇప్పటికీ ద్వారకాపురి యాత్రికులకు, సముద్రంలో మునిగిపోయిన చోటును చూపిస్తారు. అల్లంత దూరాన రుక్మిణీ దేవాలయం నీళ్లలో కనిపిస్తుంది.

జగద్రక్షణార్థము విభవావతారపురుషుడై లీలలు చూపుతూ మధుర, బృందావనం, యమునాతట, గోవర్ధనగిరి ప్రాంతాలను పునీతం చేసి ద్వారకలో, ద్వారకాధీశుడై, మోక్షద్వారాధీశుడై ద్వాపరలో అవతరించి, భగవద్గీతను వివరించి మోక్షమార్గాన్ని సుగమం చేసిన ‘శ్రీకృష్ణపరమాత్ముని ఒకసారి మనసా దర్శించుకొని తరిద్దాం.

**సర్వం శ్రీకృష్ణార్పణమస్తు**

## 4. ప్రయాగ - అలహాబాద్

గయక్షేత్రం చూసింతర్వాత, యింకో దర్శనీయస్థలం అలహాబాద్. ఇది త్రివేణీ సంగమక్షేత్రంగా ప్రసిద్ధి. గంగా, యమున, సరస్వతీ నదులు కలిసిన చోటిది. గంగా, యమునా నదుల రంగునీరు విడివిడిగా ప్రవహించి కలిసిపోతాయి. మూడవదైన సరస్వతీనది అంతర్వాహిని కనుక కనిపించదు. ఇది ఉత్తరప్రదేశ్‌రాష్ట్రంలో వారణాసికి 135 మైళ్ల దూరంలో వుంది. ఢిల్లీ – వారణాసి నగరాల నుంచి రైలుమార్గంలో చేరుకోవచ్చు.

ప్రయాగలో గతంలో ఎన్నో కుంభమేళా ఉత్సవాలు జరిగాయి. దీని ప్రశస్తి భారత, రామాయణ కావ్యాలలో చెప్పబడింది. శ్రీరామచంద్రుడు, సీతా, లక్ష్మణ సమేతంగా వచ్చి యీ పవిత్ర నదీ సంగమంలో పితృదేవతలకు తర్పణములు విడిచినట్లు రామాయణంలో వుంది. గయ, ప్రయాగలో రెండు ప్రదేశాలను దర్శించారు. బ్రహ్మ ఒకప్పుడు యిక్కడ యాగం చేసినట్లు చెబుతారు. ప్రజాపతి యాగస్థలం కనుక ప్రయాగగా పురాణ ప్రసిద్ధమైంది. దీనినే ప్రక్షితయజ్ఞ స్థలమని కూడా పిలుస్తారు. పాండవులు కూడా యీ పవిత్రస్థలంలో స్నానమాచరించినట్లు భారతోక్తి – ప్రయాగలో శిరోముండనం చేసుకోవాలని చెబుతున్నారు. "గయాపిండం, ప్రయాగముండనం" – అని ప్రచారంవుంది. బ్రహ్మ సృష్టి చేసిన తర్వాత మొదటిసారి యాగం చేసిన స్థలమట – ఇక్కడ పుణ్యస్నానాలు తమకొరకు గాక, తల్లిదండ్రులు, సోదరులు, బంధువుల కొరకు కూడ చేయవచ్చు.

ప్రయాగకు సమీపంలో భరద్వాజమహర్షి యొక్క ఆశ్రమం వుండేది. వనవాసయాత్రలో భాగంగా శ్రీరాముడు చిత్రకూటం తర్వాత భరద్వాజ మున్యాశ్రమం చేరి, ఆ ఋషిపుంగవుని చేత ఆతిధ్యం స్వీకరించాడు. భరద్వాజుడు తన తపశ్శక్తిచేత, ఇంద్రుని, కుబేరుని తన యాశ్రమంలో శ్రీరామచంద్రునికి అతిథి మర్యాదులు చేయమని ఆజ్ఞాపించాడు. వెంటనే,



20 వేల మంది అప్సరసలు, పనివారలు, వంటవాళ్లు, వేలాది మందికి ఇత్తడి, బంగారం, వెండి పాత్రలలో వివిధ పదార్థాలు, పానీయాలు, త్రివిధ మద్యాలు వడ్డించారట. శ్రీరామ భరతాదులను ఎంతో ప్రేమేతో గౌరవించిన భరద్వాజ మహర్షి ఆజ్ఞచేత, ప్రయాగలో పితృదేవతలకు తర్పణాలు వదలవలసిందిగా కోరాడట, శ్రీసీతారామలక్ష్మణులు, భరతునితో సహా ప్రయాగలో తిలోదకాలు సమర్పించినట్లు రామాయణంలో వుంది–

ప్రయాగ మూడునదులకలయిక. ప్రళయకాలంలో సముద్రజలం భూమినంతా ముంచివేసినా ప్రయాగ మునిగిపోలేదట – ఇది సాక్షాత్తు విష్ణుక్షేత్రం. ప్రయాగలో కట్టిన దేవాలయంలో శ్రీమహావిష్ణువు వటపత్రశాయి రూపంలో దర్శనమిస్తాడు. దీనికి 'మాధవ' క్షేత్రమనిపేరు. పరమేశ్వరుడు, తారకాపుర సంహారానంతరం, బ్రహ్మహత్యాపాతక నివారణ కోసం నారదుని ప్రేరణచేత, ప్రయాగలో స్నానం చేసి మాధవస్వామిని దర్శించుకొని పాపవిముక్తుడయ్యాడని భవిష్యోత్తర పురాణంలో కథవుంది. శివుడు అక్షయవటవృక్షరూపంలో, విష్ణువు వేణీ మాధవ రూపంలో ఉండడం వల్ల యిది 'శివవైష్ణవ క్షేత్రంగా వర్ధిల్లుతుంది. ప్రయాగలో కేశఖండనం, గయలో పిండప్రదానం, కాశీలో శరీరత్యాగం చేయాలని భావిస్తారు. బుద్ధుడు బోధించిన స్థలం, అక్బరుకోట ప్రక్కనగల అక్షయవటవృక్షాన్ని దర్శించతగిన స్థలం. అక్బరు కోటప్రక్కనగల భూగర్భదేవాలయం కూడ చూడతగినదే. ఇక్కడ అనేక దేవతారూపాలు దర్శనమిస్తాయి.

**మాధవేశ్వరీ ఆలయం :** ఈ కోటకు కొంచెం దూరంలో రోడ్డుకు ఎడమవైపు 'మాధవేశ్వరీ ఆలయం వుంది – ఇదికూడ శక్తి పీఠాలలో ఒకటి, ఈ ఆలయానికి అతి సమీపంలో 20 అడుగుల ఎత్తైన హనుమంతుని విగ్రహం వుంది. పూర్తిగా సింధూరం పూయబడిన యీ విగ్రహాన్ని అందరూ దర్శించుకుంటారు. ఇక్కడే కంచికామకోటి పీఠంవుంది. ఇది మూడంతస్థుల భవనం దక్షిణాది శిల్పగరిమతో అత్యంతాకర్షణీయమైన యీ భవనం

గర్భగుడిలో కంచికామాక్షి, మధ్య అంతస్థులో శ్రీ తిరుపతి వేంకటేశ్వరుడు, చివరి అంతస్థులో 'సహస్రలింగాకృతిగా శివుణ్ణి ప్రతిష్ఠ చేశారు. తప్పక సందర్శించవలసిన భవనం ఇక్కడి శ్రీకంచికామకోటి పీఠం. ఇక ఈ అలహాబాద్‌లో చూడ తగినవి మరికొన్ని స్వరాజ్ భవన్, ఆనందభవన్ – రెండు చాలా పెద్దభవనాలు. స్వరాజ్ భవన్, మోతీలాల్ నెహ్రూగారి నివాసభవనం. ఆనందభవన్ జవహర్‌లాల్ నెహ్రూగారి నివాసభవనం. ఇక్కడో మ్యూజియం వుంది. ప్రాచీన కాలంనాటి అవశేషాలు, నాణాలు, కళాఖండాలు ఇందులో వున్నాయి. ఇక ఆనందభవన్‌కు అటు కొంచెం దూరంలో రోడ్డు దాటిన తర్వాత భరద్వాజ ఆశ్రమం వుంది. అక్కడో ఆలయం వుంది. ఇందులో శ్రీసీతారామ లక్ష్మణుల విగ్రహాలున్నాయి.

శ్రీరామచంద్రులవారికి భరద్వాజమహర్షి అతిథ్యమిచ్చిన స్థలం. ఇక్కడ కొంతకాలం గడిపిన తర్వాత, భరద్వాజుని సూచన ప్రకారం, శ్రీరాముడు చిత్రకూట పర్వతంపైన కొంతకాలం గడిపాడు. రామునికిష్టమైన ప్రదేశం చిత్రకూటం సీతారాముల విహారస్థలం. ప్రకృతి రామణీయకత ఉట్టిపడే చిత్రకూటం కూడా తప్పక చూడవలసిందే.

గయా, ప్రయాగ, మధురా, యీ యా దేశంబననేల, చూచితి సమస్తాశావకాశంబులన్ అని ప్రవరుడు మనుచరిత్రలో చెప్పినట్లు ఇవన్నీ జీవితంలో ఒకసారి చూడతగిన స్థలాలు.



## 5. నైమిశారణ్యం

ఇది ఉత్తరప్రదేశ్ రాష్ట్రంలో లక్నో పట్టణానికి 100 కి.మీ దూరంలో వుంది. ఇది "సీతాపూర్"జిల్లాలో ప్రసిద్ధ గంగానదికి ఉపనదిగా పేరు పొందిన "గోమతీ" నదీ తీరంలో వున్న పరమపవిత్రస్థలం. భారతదేశంలో వున్న అరణ్యప్రదేశాలలో యిది ఎనిమిదవది. ఇది భూలోక వైకుంఠము. దీనికి అష్టమ వైకుంఠమని పేరు.

**పవిత్రక్షేత్రం :** 33 కోట్ల దేవతలకు, మూడున్నరకోట్ల మహర్షులకు, 88 వేల సాధువులకు, కోటి యజ్ఞాలకు నిలయమైన యీ క్షేత్రం నిరంతరం వేదమంత్ర ధ్వనులతో నిండి అమరధామంగా పేరుపొందింది. సూతుడు, శౌనకునకు భాగవతాది పురాణాలు వినిపించాడట. వ్యాసమహర్షి ఈ ఆశ్రమంలో 4 వేదాలు, 18 పురాణాలు, 6 శాస్త్రాలు, ఉపపురాణాలు వ్రాశాడట. చివరకు "భాగవత పురాణ శిరోమణిని యిక్కడే పూర్తి చేశాడు. అష్టాదశపురాణాలు, యితిహాసాలలో జరిగిన, యుద్ధాలు, మరణాలు, రక్తపాతాలకు చలించిన వ్యాసుడు హృదయ వేదన అనుభవించలేక, నారదమహర్షికి తన బాధను వివరించాడట. అప్పుడు నారదుడు "పరమవిశిష్టమైన, పరతత్త్వరూపియైన శ్రీమన్నారాయణుని దివ్యచరిత్రను భగవత్ చరిత్రను" 'భాగవతం'గా 'వ్రాసి హృదయవేదనను తొలగించుకో' అన్నాడట. అదే విధంగా 'వ్యాసమహర్షి' శ్రీమద్భాగవతాన్ని వ్రాశాడు. పరమపుణ్యదాయకమూ, మోక్షప్రదాయకమైన పురాణ శిరోమణి భాగవతాన్ని రచించి పునీతుడయ్యాడు. ఇక్కడ వ్యాస గద్దె వుంది. దానిని తప్పక దర్శించాలి.

**నైమిశారణ్యం అంటే :** ఇది శ్రీమన్నారాయణుని పాదముద్రల చేత పవిత్రమైన క్షేత్రం. సూతుడు శౌనకాదులకు భారత, భాగవతాలను వినిపించిన క్షేత్రం. మహాభారతకాలంలో పాండవులు వనవాసం ప్రవేశించిన అరణ్యప్రాంతం

"అనిమిశ" – విష్ణుసహస్ర నామాల్లో ఒకటి. కౌరవ, పాండవులు కురుక్షేత్రం గురించి చర్చించుకున్న ప్రదేశం 'నైమిశే అనిమిశక్షేత్రే' అని భాగవతంలో వుంది. 'అనిమిశ అంటే ఎప్పుడూ చురుగ్గా – తెలివిగా, విజ్ఞానిగా వుండేవాడని అర్థం. నిమిశులు అంటే కనుల రెప్పలు కొట్టేవారు. దేవతలు 'అనిమిశులు' విజ్ఞానియైన భగవంతుడు స్వయంభువుగా వెలసిన క్షేత్రమని యర్థం.

**"గురుః గురూత్తమా ధామ సత్యం సత్యపరాక్రమః**
**నిమిషోఽ నిమిషః స్రగ్వీవాచస్పతిరుదారధీః**

దీనిని 'నేమిశారణ్యం' అనికూడా అంటారు.

నేమి అంటే 'చక్రం – అదే సుదర్శన చక్రం యొక్క బహుతేజస్వంతమైన ఆవరణము – కాంతి వంతమైన చక్రం యొక్క ధాటి నిరుపమానము – అలాంటి "నేమి" వలన ఈ ప్రాంతమంతా విజ్ఞాన జ్యోతి కాంతులను ప్రసారమౌతాయి.

ఒకసారి దేవతలంతా బ్రహ్మను యిలా అడిగారట! కమలభవా! యీ ప్రపంచంలో తపస్సుకు జ్ఞానసిద్ధికి, శాంతికి తగిన స్థలమేదో చూపగలరా! అని అడుగగా. ఇదిగో నేనొక మనోమయ చక్రాన్ని సృష్టించి వదలిపెడతాను. అది ప్రచండ వేగంతో ముల్లోకాలు తిరిగి తిరిగి ఎక్కడ పడిపోతుందో అదే మీరడిగిన సిద్ధి క్షేత్రంగా వర్ధిల్లు తుందని చెప్పాడు. అదే చక్రము యొక్క 'నేమి' బయటకాంతులు విరజిమ్ముతూ యీ నైమిశారణ్యంలో పడిపోయింది. అది పడిన చోట ప్రళయ ధ్వనులతో భూమి పగిలి ఉధృతమైన జలప్రవాహంతో ఒక తటాకంగా ఏర్పడిందట. అది కూడ అంతులేని లోతుగల బ్రహ్మకుండం, లేదా చక్ర కుండంగా పేరు పొందింది. ఈ తీర్థం అతి పవిత్రం దీనికే చక్రతీర్థమనిపేరు – ఏ యాత్రికుడైనా యీ చక్రతీర్థం స్నానం చేసినంత మాత్రాన ముక్తి పొందుతారని విశ్వాసం. ఈ తీర్థం



గురించి 'భారతం, భాగవతం, రామాయణాది ఇతిహాసాలలో, వుంది. కాశీఖండ కావ్యంలో శ్రీనాథ మహాకవి యిలా వర్ణించాడు.

**"అది మనోమయంబను నొక్క చక్రంబును**
**కల్పించె బ్రహ్మ జగద్ధితముగ**
**కల్పించి యా బండికలు దొల్చె సత్యలో**
**కంబున నుండి యా కమలగర్భు**
**డది దొల్లగిలి విష్టపాంతరములు దొలగి**
**క్రమముతో భూమి చక్రమున వ్రాలి**
**వ్రాలి రంహస్స్ఫూర్తి వచ్చి వచ్చి ధరిత్రి**
**నిమ్నోన్నతుల శీర్ణ నేమి యయ్యె**

**నేమి విరిసిన కతన నన్నేల నెలమి**
**నైమిశంబయ్యె నదియె తా నైమిశంబు**
**దన్మహాపుణ్యవనమున ద్వాదశాబ్ది**
**సత్త్రయాగంబు గావించె శౌనకుండు**

బ్రహ్మ సృష్టించిన మనోమయ చక్రము, పదునాల్గు భువనాలు తిరిగి తిరిగి కాంతులు వెదజల్లుతూ భూచక్రంమీద ఒకచోట పడిపోయింది. 'నేమి' కాంతులు వెదజల్లుట వలన నైమిశమయిందని నిర్వచనం చెప్పాడు శ్రీనాథుడు. శ్రీరామచంద్రుని కుమారులైన లవకుశులకు వాల్మీకి ముని యిక్కడే రామాయణకథా గానం నేర్పాడట.

గయాసురుడు శ్రీమహావిష్ణువును ప్రార్థించి, సాక్షాత్కారం పొంది, హరిచేత మరణం కావాలని కోరుకున్నాడట. హరికూడ భక్తుని కోరిక ప్రకారం, తన చక్రం చేత వాడి శరీరాన్ని మూడు భాగాలు చేసి విసిరాడట. పాదాలు పాదగయవద్ద, కపాలం బదరిలో పడిపోగా, నడుము (నాభి) భాగం నైమిశంలో పడి యిది విష్ణుక్షేత్రంగా మారింది. ఈ గయుని సంహారం

ఒక్క నిమిషంకంటే ముందుగానే జరగడంవల్ల 'అనిమిష' అన్నపదం హరికి సార్థకమైంది. అలా ప్రసిద్ధి పొందిందీ క్షేత్రం. ఈ నైమిశారణ్య పరిక్రమం 16కి.మీ వైశాల్యం. ఇది పూర్తిగా పవిత్ర స్థలం. ఉత్తరప్రదేశంలోని యీ నైమిషము, మొత్తం భూమికే కేంద్రబిందువట. అంతటి భౌగోళిక, నైసర్గిక ప్రాముఖ్యం గలస్థలం. ఇది భూమి పుట్టినప్పటి నుండి, సాధువులకు, మునులకు, ప్రార్థనాస్థలం. సత్యయుగం నుండి యీ పుణ్యతీర్థక్షేత్రమని పురాణాలు చెబుతున్నాయి. సూత, శౌనక దాల్భ్య, వసిష్ట, వాల్మీకి, గౌతమ, నారదాది మునులు సందర్శించిన స్థలం.

ఇది పరిపూర్ణ మాహాత్మ్యస్థలం కనుక, దర్శించిన యాత్రీకులు మహాజ్ఞానులౌతారు – సిద్ధి పొందుతారు – ఇది జ్ఞానసిద్ధి క్షేత్రం కనుక. తులసీదాసు రామచరిత మానస్ యిక్కడనే వ్రాసి శ్రీరామానుగ్రహానికి పాత్రుడయ్యాడు. స్వయంభువ మనువు – శ్రీమహావిష్ణువు తనకు కొడుకుగా పుట్టాలని 23 వేల సంవత్సరాలు పూజలు, చేసి, యాగాలు నిర్వహించాడు. ఇదే స్థలంలో – రావణవధానంతరం, శ్రీరాముడు అశ్వమేధయాగాన్ని తలపెట్టి, యాగాశ్వాన్ని వదలిపెట్టిన స్థలం, నైమిశారణ్యం. శ్రీరామునికి, లవకుశులకు యుద్ధం జరిగిన స్థలము శ్రీరామునితో లవకుశలు కలిసి, తండ్రీ తనయులను, కలిపిన అపూర్వపుణ్యస్థలం యిదేనని రామాయణం యుద్ధకాండలో వివరింపబడింది.

ఏ పురాణం విన్నా, ఏ వ్రతం చేసుకొన్నా... ఇలా అన్నీ నైమిశారణ్యంలో సూతమహర్షి శౌనాకాది మహర్షులకు వివరించినట్లుగానే వింటాం, చదువుతాం. అంటే మనభారత సంస్కృతీసాహిత్యాల్లో నైమిశారణ్యక్షేత్ర ప్రాశస్త్యం ఎనలేనిది అని అర్థమవుతుంది.

**లలితాదేవి :** ఇక్కడే లలితాదేవి మందిరం వుంది. మనోమయ చక్రం ద్వారా ఏర్పడిన "భూప్రళయాన్ని ఆపగలిగే శక్తిరూపిణీ దేవి లలితాదేవిని బ్రహ్మ సృష్టించి పంపాడు. ఆమె యీ ప్రాంతానికి అధిదేవత. ప్రజలకు



మనశ్శాంతిని, సిద్ధిని ప్రసాదించే వరదాయిని లలితాదేవి. ఆశ్రిత కల్ప తరువైన లలితను స్మరించినా, దర్శించినా ముక్తి దాయకమని భక్తుల విశ్వాసం.

**ఫలశ్రుతి :** ఈ లలితాదేవి క్షేత్రంలో 108 సార్లు ప్రదక్షిణం చేస్తే చాలు. ముక్తి సిద్ధిస్తుంది – కరుణామయమైన దేవతలు తిరిగే స్థలంలో ఒకసారి చక్రతీర్థంలోస్నానం చేస్తే చాలు, గత పదితరాలలో జన్మించిన వారికి ముక్తి లభిస్తుంది. నైమిశారణ్యంలో పాదం మోపినా, గోమతీనదిలో పిండప్రదానాలు, చక్రతీర్థంలో స్నానం, హనుమాన్ సందర్శనం చేసినా ముక్తి కలుగుతుంది.

**దర్శనీయస్థలాలు :** తులసీదాస్ మందిరం, హనుమాన్ మందిరం, పాండవ ఖిల్లా, నరసింగ్ భగవాన్ మందిరం, వ్యాస గద్దె – గోమతీ తీరం. వాల్మీకి, వసిష్ఠుల, వ్యాసుల మందిరాలు, చూడతగినవి – ఇక్కడే వ్యాస భాగవతం వ్రాయబడింది కనుక, ప్రతియేటా యిక్కడ భాగవతోత్సవాలు "భాగవతసప్తాహం" జరుగుతుంది. శ్రీవైష్ణవులకు రామానుజకూటంలో అన్నదాన వితరణ ఉంటుంది. ఇతరులు స్వయంగా, పాక వ్యవస్థను ఏర్పాటు చేసుకోవాలి. ఇది ఒకరోజు పర్యటన. పెద్దగా హోటళ్లు లేవు. దర్శనానంతరం, సమీప పట్టణాలకు వెళ్లాలి. లక్నో నుంచి, సీతాపూర్ నుంచి రైళ్లు, బస్సుల సౌకర్యం వుంది.

నైమిశం చూడాలి – అనే సంకల్పం మనసులో వస్తేనే మోక్షం సిద్ధిస్తుందట!

# 6. హింగుళాదేవి

**కేదారేశు భజించితిన్ శిరమునన్ గీలించితిన్**

**హింగుళాపాదాంభోరుహముల్"** – అని మనుచరిత్రలో ప్రవరుని హిమాలయ యాత్రాప్రదేశాల గురించి చెప్పే పద్యంలో "హింగుళా" కనిపిస్తుంది. ఈ ప్రాంతం బెలూచిస్తాన్ ప్రాంతంలో వుందట – హిమాలయాల సానువులు అక్కడిదాకా వ్యాపించియున్నాయన్న మాట.

దక్షధ్వంస కాలంలో సతీదేవిని శివుడు (పార్వతిని) మోసినట్లు చెబుతారు. సతీశవాన్ని భుజాన వేసికొని వుండడంవల్ల సృష్టి, స్థితి, లయ కార్యాలు ఆగిపోయాయని దేవతలు విష్ణువును కోరగా, విష్ణువు తన చక్రంతో సతీశరీరాన్ని ముక్కలుగా చేసి పారవేయగా అందులో యాభైరెండవ శకలం యిక్కడ పడిందని, అదే శక్తిపీఠగా వెలసిందని పురాణవచనం. హింగుళా పీఠం ప్రస్తుతపాకిస్తాన్ దేశంలోని బెలూచిస్థాన్ ప్రాంతంలో వుందని నేటికీ అక్కడ పూజలు జరుగుతాయని చెబుతారు. 'హింగుళా' దేవి అగ్ని రూపిణి. పూరీ జగన్నాథ రథానికి, ఇక్కడి హింగుళాయాత్రకు పోలికలున్నాయి. హింగుళాదేవి వున్న గోపాల్‌పురి దేవికి పూజాస్థలి. ఇక్కడ పూజారులు 'అగ్ని' రూపాన వున్న దేవిని స్తోత్రం చేస్తారు. చైత్ర శుక్ల చతుర్దశినాడు పూజలు, హోమాలు జరుగుతాయి. ఆ రోజు ప్రజ్వలంగా మండుతూ, జ్వాలా రూపంలో దర్శనమిస్తుంది దేవి. ఈమె వంటింటి అగ్ని దేవతగా వర్ధిల్లడానికి ఓ కథ వుంది.

పూర్వం పూరీ జగన్నాథ క్షేత్రంలో మహానసం(వంటగది)లో వంటకు అగ్ని కావలసి వచ్చింది. ఇక్కడ పూజాస్థలం "గోపాల్ ప్రసాద్‌వద్ద – పూజరీలో శ్రీమందిర్ వద్ద శక్తి స్థల్ వుంది. సతీదేహ ఖండం బెలూచిస్తాన్‌లో పడి "శక్తిపీఠంగా వెలసింది – అప్పటి నుండి' హింగుళాదేవి పేరుమీద అర్చనలు, పూజలు జరుగుతున్నాయి – వేలాది మంది భక్తులకు 'అగ్ని రూపిణిగా కనిపిస్తుంది.



పూరీలో రాజు జగన్నాథ దేవాలయంలో పెద్ద యెత్తున అన్నదానం తలపెట్టాడు. అప్పుడు విదర్భదేశపు పాలకుడైన 'నలమహారాజును అర్థించి, హింగుళాదేవిని తన దేశానికి పిలిపించ మనికోరాడట. అప్పుడు నలరాజు "హింగుళా" దేవి (బెలూచిస్తాన్) ఆలయానికి వెళ్లి, ప్రార్థించి పూరీ మహారాజు కోరికను మన్నించి రావలసిందిగా కోరాడు. అలాగేయని 'హింగుళాదేవి' అగ్నిరూపంగా 'జగన్నాథుని ఆలయంలో" వంట చేసేచోట గుండ్రంగా అగ్నిగుండం ఏర్పడిందట – ఆ విధంగా ప్రతిరోజు పూరీ ఆలయంలో వేలాది మంది 'అన్నదాయిగా హింగుళా పూజలందు కుంటుంది. రాజుగారి కలలో కనిపించి తానెప్పుడూ గోపాల్‌పూర్‌లో పూజాస్థలంలో వుంటానని చెప్పింది హింగుళామాత. క్రీ.శ.1575లో హింగుళాదేవికి పెద్ద గుడి ప్రాకారాలు కట్టించారట అప్పటి ప్రభువులు – ఇది తల్చార్‌కు సమీపంలో వుంది. అక్కడ ప్రభువు బిర్వర్ హరిచందన్ ప్రతిసంవత్సరం చైత్ర శుక్ల చతుర్దశి ఉత్సవాలను ఘనంగా నిర్వహించాడట. చతుర్దశి కంటె 3 రోజుల ముందు పూజారికి కలలో కనిపించి, తాను ఎక్కడ జ్వాలగా కనిపిస్తానో, ఆ చోటు గురించి తెలుపుతుందట. వేలాది మంది భక్తులు రాజా తల్చార్‌తో సహావచ్చి అగ్ని దేవతకు పూజలు చేస్తారట.

ప్రతిశక్తి పీఠంలో ఏదో ఒక రూపంలో దర్శనమిస్తుంది. పార్వతీదేవి. ఇక్కడ అగ్ని రూపిణిగా వెలసింది. రావణ వధానంతరం శ్రీరాముడు బ్రహ్మహత్యా దోషనివారణకోసం, యిక్కడికి చేరి హింగుళాదేవిని సేవించాడని రామాయణకథ.

హింగుళాదేవిని యీ మంత్రంతో జపిస్తారు.

**"ఓం హింగులే పరమ హింగులే**
**అమృత రూపిణీ తనూశక్తీ**
**మనః శ్రీ శివే శ్రీహింగుళాయ నమః స్వాహా"**

# 7. బుద్ధగయ

బీహార్ రాష్ట్రం, గయకు దక్షిణంగా సుమారు 12 కి.మీ. దూరంలో బుద్ధగయ అనే ప్రాంతం ఉంది. ఇది విడిగా మరొక ఊరు. సిద్ధార్థుడు ఇక్కడే గౌతమబుద్ధునిగా పరివర్తన చెందాడు. గౌతమ బుద్ధునికి జ్ఞానోదయం కలిగిన స్థలం కావడం చేత ఇది బుద్ధ గయగా పిలవబడింది. బుద్ధగయలో అన్నిటి కన్నా అతి ముఖ్యమైనది, అత్యంత పవిత్రమైనదీ బోధి వృక్షమూ, అది ఉన్న ఆలయము. బోధి వృక్షము ఉన్న ఆలయాన్ని మహాబోధి ఆలయం అంటారు. ఈ ఆలయం దాటిన తరువాత సుమారు రెండు కి.మీ. దూరం వరకు ఇతర దేశాలవారు కట్టించిన బౌద్ధ ఆలయాలు ఉన్నాయి.

పెద్ద బుద్ధ విగ్రహాన్ని ఆనుకొని రోడ్డుకు రెండువైపులా ఒకవైపు మూడు మరోవైపు మూడు ఆలయాలు ఉన్నాయి. ఇందులో జపాను వారివి మూడు, టిబెట్టు వారివి రెండు, సిక్కిం వారివి ఒకటి ఉన్నాయి. ఈ దేవాలయాలన్నీ చూడటానికి ఒకే మాదిరిగా ఉన్నా అలంకరణలోనూ, చిత్రాలలోనూ తేడా గమనించవచ్చు. అంతేగాక బుద్ధుని విగ్రహ ఆకృతి కూడా ఆ యా దేశపు సంప్రదాయాన్ని అనుసరించి ఉంటుంది.

థాయ్‌లాండ్ వారి ఆలయము, ఎడమవైపున చైనా వారి ఆలయము, దాని తరువాత టిబెట్టులోని మహాయానశాఖవారి ఆలయమూ ఉన్నాయి. ఇందులో థాయ్‌లాండ్ వారి ఆలయం ఒక అద్భుత నిలయం. బుద్ధునికి సంబంధించినంతవరకు భారతదేశంలోనే గాక ప్రపంచంలోనే మొట్టమొదటగా నిర్మించిన ఆలయం ఈ మహాబోధి ఆలయం అని తెలియుచున్నది. ఈ మహాబోధి ఆలయంలో ఉన్న బోధివృక్షం (రావిచెట్టు) క్రింద కూర్చుని తపస్సు చేస్తూ ఉండగా, సిద్ధార్థునికి జ్ఞానోదయం అయింది. అంటే బౌద్ధమతం పుట్టుక ఈ వృక్షం క్రిందనే జరిగింది.

మహాబోధి ఆలయం మొత్తము విశాలమైన ఒకే ఆవరణలో ఉంది. ముందుభాగంలో ఒక ఎత్తైన ఆలయం, దాని వెనుక బోధివృక్షమూ ఉన్నాయి.



మొట్టమొదట ఇక్కడ బోధివృక్షం మాత్రం ఉండేది. కొంతకాలానికి ఈ చెట్టు మొదట్లో, అశోకుడు ఒక ఆసనం కట్టించాడు. దీనిని 'వజ్రాసనం' అంటారు. క్రీ.పూ. 2వ శతాబ్దంలో ఈ బోధివృక్షం చుట్టూ, ప్రాంగణం చుట్టూ రాతిపలకలతో చెక్కిన ప్రాకారం నిర్మించబడింది. ఆ తరువాత ఆలయం నిర్మించబడింది. ప్రస్తుతం ఉన్న ఈ ఆలయం క్రీ.శ. 640లో నిర్మించబడింది. 1956లో బుద్ధుని 2500వ జన్మదినం సందర్భంగా భారత ప్రభుత్వం వారు ఈ ఆలయం మొత్తాన్ని బాగుచేయించి మరింత అందంగా తీర్చిదిద్దారు. ఆలయ ప్రాంగణ ప్రవేశ ద్వారం అంటే రాతితో చెక్కిన ఆర్చి (తోరణం) అశోకుడు నిర్మించినది. అక్కడే అరటన్ను బరువుగల ఒక పెద్ద గంట ఉంది. దీనిని జపాను వారు ఇచ్చారు. ఆలయానికి కుడివైపున ఉన్న కొలనులో బుద్ధుడు ప్రతిరోజు స్నానం చేసేవాడట. బోధివృక్షం చుట్టూ ఉన్న రాతి ప్రాకారంతో బాటుగా ఉన్న ఇత్తడి ప్రాకారం క్రీ.శ. 1991లో అప్పటి శ్రీలంక అధ్యక్షుడు ప్రేమదాస నిర్మించి ఇచ్చారు. ఇక ఆలయంలో ఉన్న బుద్ధ విగ్రహమూర్తి ఒక అద్భుత కళాఖండం. బుద్ధగయలోని ఆలయాలన్నీ ఉదయం 7.గం.ల నుండి మధ్యాహ్నం 12.వరకు తిరిగి 2.గం.ల నుండి సాయంత్రం 6 లేక 7 వరకూ తెరచి ఉంచుతారు.

**సుజాత ఆలయం :** బీహార్ రాష్ట్రం, బుద్ధగయకు 2 కి.మీ. దూరాన ఫల్గునది ఒడ్డున మరో చిన్నగుడి ఉన్నది. ఈ గుడి సుజాత అనబడే స్త్రీమూర్తి పేరుతో పిలవబడుతుంది. ఈవిడ బుద్ధునికి పాలను ఇచ్చినట్లు తెలియుచున్నది. బుద్ధుడు బాగా ఆకలితో ఉన్నపుడు ఆయన సుజాత అనబడే ఈ స్త్రీమూర్తి ఇచ్చిన పాలను తాగేందుకు అంగీకరించాడని చెబుతారు. ఈ ప్రాంతానికి బౌద్ధ సన్యాసులు ధ్యానం చేయడానికి తప్పనిసరిగా వస్తారు.

**సూర్యదేవాలయం :** బీహార్ రాష్ట్రం, పాట్నాజిల్లా, పాట్నా నుండి సుమారు 75 కి.మీ దూరంలో సూర్యదేవాలయం ఉంది. ఇక్కడ ఉన్న కొండపైన ఒక కోనేరు ఉంది. ఈ కోనేరుకు పడమటి వైపున ఉన్న ఆలయంలో

నాలుగు భుజములు కలిగిన సూర్యభగవానుని విగ్రహం ఉన్నది. ఈ కొండమీది నుండి సుందరమైన గయ పట్టణాన్ని భక్తులు వీక్షిస్తారు. 13వ శతాబ్దంలో కాకతీయ చక్రవర్తి అయిన ప్రతాపరుద్రుడు ఇచ్చట ఆలయాన్ని కట్టించినట్లు తెలియుచున్నది. ఇచ్చట గల సూర్యదేవాలయం ముందు సూర్యకుండమనే పుష్కరిణి ఒడ్డున శ్రాద్ధకర్మలు నిర్వహిస్తారు.

ఈ ఆలయంలోని సూర్యుని విగ్రహం, ఆహార్యం కొంత విచిత్రంగా ఉంటుంది. ఒక కోటు తొడుగుకొని, నడుముకట్టు, పొడుగాటి బూట్లు వేసుకొని సూర్యుడు కనిపిస్తాడు. ఈ రూపం మధ్య ఆసియా నుండి వచ్చిన రూపముగా చెబుతారు. ఆనాడు మగధలో సూర్యారాధన బాగా ప్రచారంలో ఉండేది. అందుకే ఈ ప్రాంతంలో ఎన్నో రకాల సూర్య ప్రతిమలు కనిపిస్తుంటాయి.

ఫల్గుణీ నది ఒడ్డున మరో దేవాలయం ఉంది. అదే గదాధరుని దేవాలయం ఇది చాలా పురాతనమైన ఆలయం. ఇక్కడ స్వామివారు చతుర్భుజములు కలిగి ఉంటారు.



## 8. కైలాస మానస సరోవరం

ఇది భారతీయులకు, చైనా, టిబెట్ ప్రాంతీయులకు ప్రాతః స్మరణీయ క్షేత్రం. హిమాలయ పర్వతశిఖరాలలో కైలాసశిఖరం అతి పెద్దది సముద్రమట్టానికి 15వేల ఎడుడగుల ఎత్తులో యీ పవిత్ర సరస్సు వుంది. హిమాలయపర్వతం ఎంత ప్రాచీనమో ఈ సరస్సు గూడ అంతే ప్రాచీనమైనది. ఇది బ్రహ్మయొక్క మనోసృష్టి – బ్రహ్మమానస సరోవరమని ప్రసిద్ధి చెందిన సరస్సు వైశాల్యం సుమారు 50 కి.మీల వైశాల్యం. దీని ప్రశస్తి పురాణాలల్లోను, ప్రాచీన కావ్యాలలో విశేషంగా వ్రాయబడింది. ఇది పార్వతీ పరమేశ్వరుల నివాసభూమి. విహారభూమి. శివభక్తుడైన రావణుడు యిక్కడే స్తోత్రం చేసి కైలాస శిఖరాన్ని కదిలించి, శివుని అనుగ్రహాన్ని పొందింది అంటారు. శివపురాణం, పద్మపురాణం, విష్ణుపురాణాలలో కైలాసశిఖర ప్రసక్తివుంది. మహాకవి కాళిదాసు కుమార సంభవ కావ్యంలో శివుని యొక్క విలాస వైభవాలను, హిమవన్నగశోభను విపులంగా వర్ణించాడు. శివుని వాహనమైన వృషభము కాలిగిట్టలచేత మంచు ఖండాలను తవ్వినపుడు పర్వతములో నివసించే, సింహ, శరభ, శార్దూల, మత్త గజాలు భయపడి పారిపోయాయట. ఈ కొండపైన అత్యంత భక్తి శ్రద్ధలతో గౌరీదేవి శివుణ్ణి అర్చించింది. ఆయనకు తపోభంగం కలుగకుండా స్తోత్రములచేత కీర్తించి సేవించింది.

**"అనర్ఘ్యమర్ఘేణ తమద్రినాథః**
**స్వర్గౌకసామర్చిత మర్చయిత్వాః**
**ఆరాధనా యాస్యసఖీసమేతాః**
**సమాధి దేశప్రయతాం తనూజామ్" –**

దేవతలచేత పూజింపబడే యీశ్వరుని సేవించడానికి హిమవంతుడు చెలికత్తెలనిచ్చి పార్వతీదేవిని నియమించాడు. ఆమె అతి భక్తితో సేవిస్తూ

వుండేది. ఇక్కడి కైలాసవాసి మొదట ఒంటరివాడే – పార్వతీపరిణయంతో ఇంటి వాడయ్యాడు. ఈయన నివాసమే యీ శిఖరం – బంగారం, వెండి, కంచు, రాగి, వజ్రకాంతులతో ఎప్పుడూ మెరుస్తూ కాంతులీనుతుంటుంది. ఈ కైలాసశిఖరం సముద్రమట్టానికి 22వేల అడుగుల ఎత్తుగా వుండడం, పర్వతారోహకులకు కష్టమైనపని. అసలే యిక్కడ ఆక్సిజన్ దొరకదు. ఇంకా పర్వతాలపైకి వెళ్లడం అది కైలాసం శివుని ఆవాస స్థానం కావున ఎవరూకూడ సాహసం చేయరు. ఒక వేళ ఎక్కినా కొంత దూరం వెళ్లిన తర్వాత అదృశ్యమౌతారట. ప్రతినిత్యము పార్వతీదేవి వివిధ పుష్పాలను సమర్పించి ఈశ్వరోపాసన చేసే స్థలం కనుక యిది సాక్షాత్పరమేశ్వరుని ఆవాసము – పార్వతి శివునికి శుశ్రూష చేసిన స్థలంగా చెప్పుకుంటారు.

**“అపరిచిత బలిపుష్పావేది సన్మార్గ దక్షా**
**నియమవిధి జలానాం బర్హిషాంచోపనేత్రీ**
**గిరిశముపచచార ప్రత్యహం సాసుకేశీ**
**నియమిత పరిఖేదా వచ్ఛిరశ్చంద్రపాదైః**

ఆమె యొక్క పూజాశ్రమను తొలగించడానికి శివుని జటాజూటంలోని చంద్రుడు తన చల్లని కిరణాలచేత చల్లబరుస్తాడని కాళిదాస కవి చెప్పాడు. పార్వతీదేవి తపస్సుకు మెచ్చడం, పరిచయం, క్రమంగా పరిణయం జరగడం ఈ కొండలపైననే – పర్వతరాజు చేసిన యీ పెండ్లికి శ్రీమహావిష్ణువు – ఇంద్రాది దేవతలు విచ్చేశారట – ఇక్కడి హిమవత్పర్వతము ఔషధీమయం. నిర్మలమైన గంగానదీలో యాత్రికులు సుస్నాతులై పరమేశ్వరానుగ్రహాన్ని పొందుతారు. హిమాలయోనామ నగాధి రాజః అని హిమాద్రికి పేరు. అతిచల్లగా కనిష్ఠ ఉష్ణోగ్రత కంటె 14 డిగ్రీలు తక్కువగా ఉండడం వల్ల యాత్రికులు వణకిపోతారు.

కైలాసశిఖర పరిక్రమం 82 కి.మీ. ఎవరూ కూడ సాహసం చేయరు. మానస సరోవరం చలికాలం గడ్డ కదుతుంది. మిగతాకాలం, అంటే వేసవిలో



కరిగియుంటుంది. అప్పుడే ప్రయాణాలకు అనుకూలం. ఇప్పుడు భారత – చైనాటిబెట్లు సహకారంతో హెలికాప్టర్లు వెళుతున్నాయి. భారత పర్యాటకశాఖ యాత్రికులకోసం విస్తృత ఏర్పాట్లు చేస్తుంది. నేపాల్ నుంచి ప్రయాణం సులభం – హెలికాప్టర్లలో నేపాల్ నుంచే వెళ్లాలి.

ఈ క్షేత్రాన్ని సందర్శించిన వారిలో ప్రముఖులు జగద్గురువు ఆదిశంకరాచార్యులు తపస్సు చేయగా, సాక్షాత్పరమేశ్వరుడే ప్రత్యక్షమై నాలుగు శివలింగాలను ప్రసాదించాడు. జగద్గురువు ఆ లింగములలో ఒకదానిని తూర్పుసముద్రతీరాన పూరీలో, పడమట ద్వారకలో, ఉత్తరాన బదరీక్షేత్రంలో, దక్షిణాన శృంగేరీలో ప్రతిష్ఠించారు. దేశంలోని 52 శక్తి పీఠాలలో ఇది అత్యంత ప్రసిద్ధమైనది. ఇక్కడ యాత్రికులు ప్రత్యేకంగా పూజలు అభిషేకాలు చేయరు. కేవలము మానసికంగా జపించడమే. ఇది బౌద్ధులకు, జైనులకు కూడ పుణ్యస్థలం. దేశంలో స్థాపించిన యీ నాలుగు శైవపీఠాలను, యోగులు మునులు సందర్శించారు. శ్రీగణపతి సచ్చిదానందస్వామీజీ, శ్రీపూరీశంకరాచార్యస్వామి, శ్రీద్వారకా పీఠాధిపతులు, శ్రీత్రిదండి చినజీయర్‌స్వామివారలు కైలాస మానస సరోవరాన్ని సందర్శించారు.

కైలాసపర్వత పరిక్రమం చాలా కష్టమని చెబుతారు. కొండ వెండి కొండలా మెరిసిపోతుంది. కొండకు ఈ చివరి నుండి ఆ చివరివరకు తెల్లగా మెరిసే మూడు రేఖలను చూడవచ్చు. వాటినే శివుని ఫాలభాగాన మెరిసే విభూతి రేఖలంటారు. దర్శనానంతరం యాత్రికులు నేపాల్ వచ్చి పశుపతినాథుని దేవాలయాన్ని దర్శిస్తారు యాత్రికులు.

**మానస సరోవరము :** ఇది బ్రహ్మ సృష్టి. 352 చదరపు అడుగుల వైశాల్యం 300 అడుగుల లోతువుంటుందని చుట్టుకొలత 82 మైళ్లు. సరస్సును చుట్టి తిరిగి రావడం కష్టం. అతిచలి, భరించడం కష్టం. ఈ సరస్సులో

దేవతలు తేజోరూపాల్లో వచ్చి స్నానం చేసి పోతారట. సాక్షాత్తు శివుడు తెల్లవారు జామున పవిత్రజలాల్లో స్నానమాడతారట! ఈ నీరు స్వచ్ఛంగా, తియ్యగా ఉంటుంది. సాక్షాత్తు దేవగంగ. ఇంద్రాది దేవతలు తిరుగాడు చోటు. సరస్సులో నీరు క్షణక్షణం రంగులు మారుతుంటుంది. ఇక్కడ స్థానికులు యీ సరస్సును "వపాంసు" అని పిలిస్తారట. సూర్యోదయ, సూర్యాస్తమయ దృశ్యాలు మనోహరంగా వుంటాయి.

## కైలాసగిరికి ఎన్నో పేర్లున్నాయి

హేమాద్రి, రజతాద్రి, సుషుమ్న కనకాచలము, దేవపర్వతము, అమరాద్రి, సుమేరు అనే పేర్లతో విరాజిల్లుతుంది – ఈ పర్వత రాజము పురాణప్రసిద్ధము. పరమశివుడు యీ వెండి కొండపై వేంచేసి త్రిలోకాలను రక్షిస్తున్నాడు. జగదాంబ, పార్వతీదేవి, సర్వమంగళగా సర్వజగత్తును తన మహిమోన్నతమైన శక్తి చేత కాపాడుతుంది. ఈ పర్వతానికి "శ్రీచక్ర"మని కూడా అంటారు. ఇది జ్ఞానానికి, మోక్షానికి గుర్తుగా భావిస్తారు. జైనులు ఈ కొండకు ఆదినాథ క్షేత్రమని పేరుపెట్టారు.

ఇది శివుని తాండవలీలాప్రదేశం – ఈ కొండ వింతవింతలుగా, వెండి, బంగారు కాంతులతో ప్రకాశిస్తుంటుంది. నటరాజు యొక్క నాట్యలీలావిలాస కేంద్రం అంటూ మునులు ఋషులు కీర్తిస్తారు. ఎంతో ప్రయాసలకు లోనై యీ ప్రయాణం చేయాల్సి వుంటుంది. ఆర్థిక భారంతోపాటు శారీరక బాధలెక్కువ – ఆరోగ్యంగా వున్న వారే ప్రయాణం చేయాలి. మానస సరోవరంలో స్నానం ఆత్మానందం కలిగిస్తుంది. ఆత్మ శుద్ధికి దోహదపడుతుంది.

జీవితంలో ఒకసారైనా మానససరోవరం దర్శించి పరమేశ్వరుని అపార అవ్యాజ కరుణాకటాక్షాలు పొందాలని ప్రార్థించుదాం.

**ఓం నమశ్శివాయ**



# 9. బద్రీనాథ్ క్షేత్రం

చార్‌ధామ్ అనబడే క్షేత్రాలన్నిటిలోకి బదరీక్షేత్రానికి వెళ్లిరావడం చాలా సులభం. హరిద్వార్ – హృషీకేశ్ రెండింటిలోకి ఎక్కడి నుండి బయలుదేరినా బదరీ ఆలయాన్ని చేరుకోవచ్చు. ఈ ఆలయానికి అక్కడ ఉన్న వంతెన దాటి, సుమారు 25, 30 మెట్లు ఎక్కి వెళ్ళాలి. మెట్లు ఎక్కడానికి ముందే కుడివైపున 'తప్తకుండ్' అనే వేడి నీటి కుండం ఉన్నది.

ఇక్కడ ఆలయంలోని బదరీనాథుని పూజించు అవకాశం వైశాఖమాసం నుండి కార్తీకమాసం వరకు భక్తులకు ఉంటుంది. మార్గశిరం నుండి చైత్రమాసం చివరి వరకూ నారదుడు పూజిస్తాడని పురాణ ప్రశస్తి. ఇచ్చట తలుపులు మూసివేసినప్పటినుంచి నారదమహర్షి స్వామికి పూజచేయునవి భక్తుల నమ్మకం.

తప్తకుండం పక్కనుండి ఒక యాభై అడుగుల ఎత్తులో ఉన్న ఆలయానికి మెట్లదారి ఉంది. ఆ మెట్లదారిలో మెట్లకు ఆనుకొని కుడివైపున ఒక చిన్న ఆలయం ఉన్నది. దీనినే బదరీనాథ్ ఆలయం అంటారు. ఈ స్వామిని దర్శించి మరో 20 మెట్లెక్కి పైకి వెళితే 45 అడుగుల ఎత్తు ఉన్న సింహద్వారం కనిపిస్తుంది. ఆ సింహద్వారం దాటి లోపలికి ప్రవేశించగానే చదరంగా ఉన్న ఒక పెద్ద ప్రాంగణం, ఆ ప్రాంగణం ముందు 20 అడుగుల చతురస్రపు ముఖమండపమూ, దాని వెనుక గర్భాలయం ఉన్నాయి. ఈ గర్భాలయంలోనే శ్రీబదరీనారాయణుడు భక్తులకు దర్శనమిస్తాడు. ఈ స్వామి విగ్రహంలో నాభి వద్ద ఎరుపురంగులో మంచి గంధపు బొట్టు గుండ్రంగా కనబడుతుంది. నొసట్లో తిలకపు బొట్టు విశాలమైన వక్షఃస్థలంలో శ్రీవత్స మరియు భృగులతల చిహ్నములను చూడవచ్చు. కంఠంలో వజ్రముల హారం, అంతకన్నా వేలరెట్లు అధికంగా ప్రకాశిస్తున్న పద్మం వంటి ఆ స్వామివారి ముఖాకృతి తనివితీరా దర్శించవచ్చు. ఈ స్వామివారికి ఎడమ వైపున నారదమహర్షి విగ్రహం కనిపిస్తుంది.

ఈ ఆలయం కొండ మొదట్లో ఉంటుంది. కొండ క్రిందుగా అలకనంద నది ప్రవహిస్తూ ఉంటుంది. ఈ కొండకు నారాయణ పర్వతమనీ, ఊరికి అవతలవైపు ఉన్న కొండకు నర పర్వతమని పేరు. బదరి అంటే రేగు చెట్టు అని అర్థం. రేగుచెట్టు శ్రీమహాలక్ష్మి నివాసస్థలం. కనుక నారాయణుడు తన ప్రియమైన ఆ చెట్టు నీడలోనే తపమాచరించాడు. అందుకే ఈ క్షేత్రానికి బదరీక్షేత్రమని పేరు వచ్చింది. నారదముని ఈ క్షేత్రంలోనే ప్రధాన అర్చకత్వం చేసారని, కావున ఈ క్షేత్రాన్ని నారదక్షేత్రమని కూడా అంటారని చెప్తారు. బద్రీనాథ్ పరిసర ప్రాంతాలలోని కొండలు, భారతంలో వర్ణించబడ్డాయి. శ్రీకృష్ణ నిర్యాణానాంతరం, పాండవులు తమ జీవితాలను చాలించదలచి స్వర్గారోహణ చేసిన పర్వతాలు ఇవేనని స్థలపురాణం ద్వారా తెలుస్తుంది.

బద్రీనాథ్ గుడిలో కొండచరియలు విరిగి పడిన కారణంగా అనేకమార్లు నిర్మాణ పునరుద్ధరణ కార్యక్రమాలు నిర్వహించారు. 17వ శతాబ్దంలో గర్వాలా రాజు చేత ఈ గుడి విస్తరించబడింది. 1803లో హిమాలయాలలో సంభవించిన భూకంపంలో ఆలయం పూర్తిగా శిథిలం కావడంలో జయపూర్ రాజు ఈ ఆలయాన్ని పునర్నిర్మించారు. గర్భాలయంలో ఉన్న ఉత్సవమూర్తితో పాటు స్వామి ఎడమవైపున నరనారాయణులు, శ్రీదేవి, భూదేవి, నారదుడు, కుడివైపున కుబేరుడు, గరుత్మంతుడు ఉన్నారు. ఈ బదరీ ఆలయంలోకి ప్రవేశించగానే మొదట ద్వారపాలకుడుగా ఉన్న ఘంటాకర్ణుని దర్శనం చేసుకోవాలని, ఆ తరువాతనే స్వామివారిని దర్శనం చేసుకోవాలని స్థలపురాణం చెపుతుంది.

ఆలయంలో ఉదయం ఆరు గంటల నుండి మధ్యాహ్నం 1.00 వరకు, సా.4.00 నుండి రా.9.00 వరకు దర్శనం ఉంటుంది. స్వామివారి ఎడమవైపున ఒక దీపారాధన కుందిలో ఒక జ్యోతి వెలుగుతూ ఉంటుంది. దీనిని అఖండజ్యోతి అంటారు. ఇది శాంతించడం అంటూ ఎప్పుడూ జరగదు. చలికాలంలో ఆలయాన్ని మూసివేసే రోజున, భక్తులు సమర్పించిన



నేతిని ఈ జ్యోతి ఉన్న కుందిలో వేసి ఆలయం మూసివేస్తారు. 6 నెలల తరువాత ఆలయం తిరిగి తెరచినపుడు ఈ జ్యోతి అలానే వెలుగుతూ ఉంటుంది. దీనిని చూడడానికి ఆ రోజు భక్తులు ఎందరో వస్తారు. ఈ ఆలయంలో ప్రసాదరూపంలో లడ్డూలు ఇస్తారు. ఇది స్వామివారికి స్వయంగా లక్ష్మీదేవియే తయారుచేసిన ప్రసాదమని చెబుతారు. బదరీయాత్ర చేసి ప్రసాదం స్వీకరించని వారికి ఎలాంటి ఫలితం దక్కకపోగా నరకప్రాప్తి కలుగునని, బదరీ నారాయణుని ప్రసాదం అందరికీ పంచిన వారికి స్వర్గలోక ప్రాప్తి కలుగునని నమ్మకం. బదరీనాథ్ చుట్టు పక్కల చూడవలసిన ప్రదేశాలు – బ్రహ్మ కపాలం, స్వర్గారోహణ పర్వతం, పంచతీర్థాలు, తోలింగమఠ్ ఆలయం, చరణపాదుకలు, లక్ష్మీవనం, చక్రతీర్థం మొ॥వి.

అన్నిటిలోకి, ముఖ్యంగా ఛార్‌ధామ్ అను నాలుగు క్షేత్రాలలో ఒకటైన కేదార్‌నాథ్ యాత్ర ఎంతో ఆనందంగా ఉంటుంది. ఇది హిందువుల ముఖ్య పుణ్యక్షేత్రాలలో ఒకటి. సముద్ర మట్టానికి 3,584 మీ. ఎత్తులో గర్వాల్ హిమాలయాల్లో మందాకినీ నది పైభాగంలో మంచు కప్పిన కొండల మధ్య నెలకొని ఉంది. ఇక్కడికి వాహనాలు వెళ్ళవు. గౌరీకుండ్ నుండి నడిచిగాని, గుర్రాలమీదగాని వెళ్ళాలి. గౌరీకుండ్ నుండి కేదార్‌నాథ్ 14 కి.మీ.దూరం, గుర్రాలమీద వెళ్తే సుమారు నాలుగు గంటలు, పల్లకీలో వెళితే 5 గంటలు కావున కేదార్‌లో రాత్రి బస తప్పనిసరి. ఎందుకంటే ఆలయం మధ్యాహ్నం ఒంటిగంటకు మూసి, సాయంత్రం నాలుగు, ఐదు గంటలకు తెరుస్తారు.

కేదారీనాథ్‌లో ఉన్న ఆలయం శివాలయం. ఇది అత్యున్నతమైన ద్వాదశ జ్యోతిర్లింగాలలో మొట్టమొదటిది. ఈ ఆలయం శ్రీ ఆదిశంకరాచార్యులవారిచే 8వ శతాబ్దంలో నిర్మించబడినది. ఈ ఆలయం మేష సంక్రమణ రోజున అంటే సూర్యుడు మేషరాశిలో ప్రవేశించిన రోజున తెరుస్తారు తిరిగి సూర్యుడు వృశ్చికా నక్షత్రంలో ప్రవేశించే రోజున మూసివేస్తారు. ఆలయం మూసివేయగానే స్వామివారి ఉత్సవ విగ్రహాన్ని కేదార్‌కు 52 కి.మీ దూరంలో

ఉన్న ఉఖీమఠ్‌కు ఊరేగింపుగా తరలించి, అక్కడి సింహాసనం మీద ప్రతిష్ఠించి నిత్యం పూజా కార్యక్రమాలు నిర్వహిస్తారు. ఆ ఆలయ ప్రాంగణంలో ఉన్న నందివిగ్రహం సజీవ ఆకృతిని కలిగి ఉంటుంది.

గర్భాలయానికి మధ్యలో సుమారు 8 అడుగుల చదరంగా ఉన్న పానవట్టంలో కేదారేశ్వరుని లింగమూర్తి ఉన్నది. వృషభంయొక్క మూపురం వలె స్వయంభువుగా లింగరూపంలో కేదారేశ్వరుడిగా పూజింపబడుతున్నాడు. అనంతకాలచక్రంలో మంచుకొండల్లో ఉన్న బదరీ, కేదారక్షేత్రాలు ఎన్నోమార్లు ఎన్నో ఒడిదుడుకులకు లోనైనా, ఎప్పటికప్పుడు నవోనవోన్మేషంగా ప్రకాశిస్తూ భక్తజన సందోహాలను ఆనందపరస్తూ ఆధ్యాత్మిక తత్త్వబోధను చేస్తూనే ఉన్నాయి.

జన్మలో ఒక్కసారైనా దర్శింపజెయ్యాలని బదరీనారాయణున్ని, కేదారేశ్వరుణ్ణి భజిద్దాం! స్మరిద్దాం! ప్రార్థిద్దాం!!



## 10. శ్రీవైష్ణోదేవి ఆలయం

ఇది ఎత్తైన హిమాలయ పర్వత పంక్తులలో పశ్చిమ ఉత్తరభాగాన గల జమ్మూ - కాశ్మీర్ రాష్ట్రంలో, జమ్మూకు సుమారు 483.మీ దూరంలో, త్రికూట పర్వత అగ్రభాగాన కాట్రా, (ఖత్రా) అనే చోట శ్రీవైష్ణోదేవి ఆలయం వుంది. జమ్మూకు రైలులో వెళ్లి అక్కడ నుండి కొండ పాంత్రం యిరుకైన దారులలో ఇటూ - అటూ లోయలగుండా వెళ్లాలి - ఎక్కలేనివారు, డోలీలు, గుర్రాలమీద వెళతారు. చుట్టూ హిమగిరులుండడం వలన, మంచు దారులలో పడి రహదారులు మంచుతో కప్పబడివుంటాయి. హిమాలయాలలో అతి క్లిష్టమైన ప్రయాణం. దూరభారంవ్యయప్రయాసలతో పాటు శారీరక బాధలు కూడ వర్ణనాతీతం. అయినా భక్తులు వేలకొలది యాత్రికులు, బృందాలుగా ఏర్పడి వైష్ణో దేవిని దర్శించుకొని వస్తారు. దేవి వుండే ఆలయాన్ని భవన్ అంటారు. గుడిలోకి ప్రవేశించేముందు ఒక చీటీ తీసికొని, ఆరు గంటలలోపు వెళ్లి దర్శనం చేసికోవాలి. ఆలస్యమైతే మరో బ్యాచ్ నెంబరుతో వెళ్లవలసి వుంటుంది. ఏది ఏమైనా అక్కడి దేవాలయప్రవేశానికి అనుమతులను పొందాల్సిందే. భక్తులు ముక్త కంఠంతో జై మాతాజీ, నినాదాలతో కొండ లెక్కుతారు. ఆ మాతాస్మరణలో దైహిక బాధలు మరచిపోతారు.

త్రేతాయుగంలోని శ్రీరామచంద్రుని కాలంనాటి కథ ఒకటి ప్రచారంలో వుంది. భూలోకంలో ధర్మము స్థాపించి, ప్రజలకు శాంతి కలిగించాలని విష్ణుమూర్తి తలచాడు. శ్రీమహాలక్ష్మీ, శ్రీమహాకాళీ, శ్రీమహాసరస్వతీ, మూడు రూపాలు, మూడు శక్తులుగల ఒక దివ్యశక్తిని సృష్టించి భూమి మీదకు పంపాడు. ఆమె దక్షిణ దేశంలోని రామేశ్వరం వద్ద రత్నాకరసాగరుడనే వాని యింట బాలికగా జన్మించింది. పెరిగి పెద్దదయింది. ఆధ్యాత్మిక శక్తి కూడ పెరిగింది. ఎలాగైనా విష్ణువును పరిణయమాడాలని నిశ్చయించింది. ఆ రోజుల్లో శ్రీరామ దర్శనం చేసుకుంది రామేశ్వరంలో. అపుడు రాముణ్ణి

అడిగిందట. నీవు విష్ణుమూర్తి యొక్క అవతారమే కదా. నిన్ను పరిణయమాడుతానని బాలిక చెప్పగా, ఇతి త్రేతాయుగం కుదరదు. కల్కి అవతారం వస్తుంది. అప్పుడు నేను కల్కిగా అవతరిస్తాను. అప్పుడు చూద్దాం అని దాటవేశాడు. ఉత్తరభారత దేశంలోని హిమాలయపర్వత ప్రాంతంలో నీవు ఒక గుహలో వుంటూ, అందరికీ దేవతారూపంలో దర్శనం యిచ్చి భక్తులను దీవించు అని రాముడు చెప్పాడట. వైష్ణవికి శ్రీమహావిష్ణువులో లీనమయడం అనే కోరిక రామావతారంలో తీరలేదు. కలిదాక ఆగమని, హిమాలయాలలోని త్రికూట పర్వత ప్రాంతంలో వేచి వుండమని చెప్పాడు. అలాగే త్రికూట పర్వతప్రాంత గుహలోవుండి పూజలందుకుంటుంది. ఆ పర్వతం క్రింద ఒక ఊరుంది. అక్కడ శ్రీధరుడనే బ్రాహ్మణ భక్తునికి బాలికా రూపంలో కనిపించింది. ఒకరోజు ఊరివారందరికీ విందు చేయమని శ్రీధరునికి చెప్పింది. అలాగే అందరినీ పిలిచాడు. అంత చిన్నయింట్లో ఊరి జనమంతా యిబ్బంది లేకుండా నిండిపోయారు. ఒక స్త్రీ రూపంలో వచ్చి శ్రీధరునియింట్లో బ్రహ్మాండగా షడ్రసోపేత భోజనాలు సమర్పించింది. ఈ వచ్చిన వారిలో భైరవనాథుడనేవాడూ వచ్చాడు. ఈమె అందానికి మోహితుడై వెంటబడ్డాడు. పర్వతాలు, అడవులు తిప్పి త్రిప్పి వైష్ణవీదేవి ఉన్న త్రికూట పర్వత గుహలోకి ఆమె వెళ్లిపోయింది. అక్కడిదాకా వెంటపడుతూ వచ్చిన భైరవనాథుణ్ణి చంపివేసింది. త్రికూట పర్వతంలో భైరవనాథుని తలతెగినచోటును కూడా దర్శిస్తారు.

త్రికూట పర్వతాగ్రాన ఉన్న శ్రీవైష్ణోదేవి ఆలయంలో లక్ష్మీ, సరస్వతి, కాళిమున్నగు రూపాల్లో మూడు సాలగ్రామాలుగా ఉంటు అర్చనలందు కొంటుంది. ఆ తర్వాత కొంతకాలానికి అష్టభుజాలతో వివిధ ఆయుధాలను ధరించి వున్న శ్రీవైష్ణవి అమ్మవారిని వ్యాఘ్రవాహనగా అద్భుతమైన పాలరాతి విగ్రహాన్ని ప్రతిష్ఠించారు.



## 11. బాసర క్షేత్రం

చదువుల తల్లి, జ్ఞాన ప్రదాయినీ అయిన సరస్వతీదేవి ప్రాచీన దేవాలయాలు భారతదేశంలో రెండు లేదా మూడు కనపడతాయి. ఒకటి కాశ్మీరులోను, రెండవది బాసరలోను, మూడవది శ్రీశైలపర్వతసానువుల్లో "కొలనుభారతి" క్షేత్రంలోను ఇలా ఇప్పటికి సరస్వతీదేవి కొలువుదీరి ఉన్న క్షేత్రాలు ఇవి.

బాసర ఆదిలాబాదు జిల్లా నిర్మల్‌కు సుమారు 70 కి.మీ. దూరంలో గోదావరి నది ఒడ్డున ఉన్న పురాతన పుణ్యక్షేత్రము. ఇక్కడి ఆలయం చాళుక్యుల కాలంలో నిర్మింపబడింది. ఇక్కడి అమ్మవారి విగ్రహాన్ని వ్యాసమహర్షి ప్రతిష్ఠించినట్లు ప్రతీతి. ఆయన కురుక్షేత్ర యుద్ధంలో జరిగిన ప్రాణనష్టాన్ని చూసి వికల మనస్కుడై ఇక్కడికి వచ్చి తపస్సు చేసాడు. ప్రతిరోజూ ఉదయం గోదావరిలో స్నానం చేసి మూడు పిడికిళ్ళ ఇసుక తెచ్చి మూడు కుప్పలుగా పోసి పూజించాడు. ఈ మూడు కుప్పలే సరస్వతి, లక్ష్మి, కాళిక ప్రతిమలుగా రూపొందాయని భావిస్తారు. వ్యాసుని సమాధి, ఆయన తపస్సు చేసిన గుహలు నేటికీ నిలిచి ఉన్నాయి.

బాసర సరస్వతీ ఆలయంలో బాలబాలికలకు అక్షరాభ్యాసం చేయడానికి వారి తల్లిదండ్రులు అత్యంత ప్రాధాన్యత ఇస్తారు. ఇక్కడ ఉన్న త్రిదేవి మూర్తులు వ్యాస ప్రతిష్ఠితం కనుక ఇచ్చట అక్షరాభ్యాసానికి ఎంతో ప్రాధాన్యత. ఆలయ ప్రాంగణంలోని ప్రత్యేక మందిరంలో అక్షరాభ్యాసం జరిపిస్తారు. ఇక్కడ అక్షరాభ్యాసం చేయించి దేవికి పలక, బలపము, పుస్తకము, కలము వంటి కానుకలు సమర్పించే ఆచారము వున్నది. ఆలయ ప్రాంగణంలోని జ్ఞానప్రసూనాంబ చేతిలో ఉన్న అఖండ జ్యోతికి నూనెను భక్తులు ఆసక్తిగా సమర్పిస్తారు.

ఈ ఆలయం ఉత్తరముఖంగా ఉంది. గర్భాలయంలో సరస్వతీ దేవి భక్తులకు దర్శనమీయగా, ఆమెకు ఎదురుగా లక్ష్మీదేవి, పశ్చిమదిశగా ఒక

మిట్టమీద కాళీదేవి దర్శనమిస్తారు. ఈ ఆలయానికి ఆగ్నేయంగా "పాపహరిణి" అనుకొలను, ఆ కొలనుకు దక్షిణంగా వ్యాసమహర్షి గుడి కలదు. ఇందులో వ్యాస భగవానుని విగ్రహం, వ్యాసలింగం ఉన్నాయి. ప్రధాన దేవాలయానికి తూర్పు భాగాన ఔదుంబర వృక్షఛాయలో దత్త మందిరం, దత్త పాదుకలు ఉన్నాయి. మందిరానికి దగ్గర్లో ఒక గుహ ఉంది. ఇది నరహరి మాలుకుడు తపస్సు చేసిన స్థలమంటారు. అక్కడ 'వేదవతి' (ధనపుగుండు) అనే శిలపై తడితే ఒకో ప్రక్క ఒకో శబ్దం వస్తుంది. అందులో సీతమ్మవారి నగలున్నాయంటారు. ఇక్కడికి దగ్గర్లో 8 పుష్కరిణిలున్నాయి. వాటిపేర్లు ఇంద్రతీర్థం, సూర్యతీర్థం, వ్యాసతీర్థం, వాల్మీకితీర్థం, విష్ణుతీర్థం, గణేశతీర్థం, పుత్రతీర్థం, శివతీర్థం. వ్యాసుడు సరస్వతీదేవి మూర్తిని ఇక్కడ ఉన్న సరస్వతీ తీర్థం దగ్గర ప్రతిష్ఠించాడని పురాణాలు చెప్తున్నాయి. సుమారు 200 సం॥ల క్రితం విధ్వంసకాండకు పాల్పడుతున్న కొందరు దుండగులను పారద్రోలి మక్కాజీ పటేల్ అనే వ్యక్తి కొందరి సహాయంతో ఈ ఆలయాన్ని రక్షించి, ఆలయం పునర్నిర్మాణంలో ప్రముఖ పాత్ర వహించాడని తెలుస్తోంది.

మహాశివరాత్రి, వసంతపంచమి, అక్షరాభ్యాసం, దేవీనవరాత్రులు, వ్యాసపూర్ణిమ ఉత్సవాలు ఇక్కడ విశేషంగా జరుపబడుతాయి. ఇక్కడ మాధుకరము అనే ఒక ముఖ్యమైన సంప్రదాయం ఉంది. మధుకర వృత్తి అంటే యాచించడం ద్వారా లభించే భిక్షకు మధుకరము అని పేరు. శ్రీదేవి అనుగ్రహం కోరేవారు నియమనిష్ఠలతో 11 లేదా, 21 లేదా, 41 రోజులు దీక్షతో గురోపదేశంతో దీక్ష పొందుతారు. ఆ కాలంలో వారు మధ్యాహ్నం ఊరిలోకి పోయి భిక్షను స్వీకరించి, సరస్వతీ దేవికి నమస్కరించి, ఆ భిక్షను భుజిస్తారు.



## 12. అయోధ్య - శ్రీరామజన్మస్థలం

భారతదేశంలోని 7 పవిత్రక్షేత్రాలలో మొట్టమొదటిది అయోధ్య. "అయోధ్యా – మధురా – మాయా – కాశీ – కాంచీ – అవంతికా – పూరీ ద్వారవతీచైవ – సప్తైతే మోక్షదాయికా! అని ప్రసిద్ధి. భౌగోళికంగా ఇది ఉత్తరప్రదేశ్ ఫైజాబాద్ (Fizabad) జిల్లాకేంద్రానికి 6 కి.మీ. దూరాన వుంది. వారణాసి – ఫైజాబాద్ రైలుమార్గంలో 'అయోధ్య' రైల్వే స్టేషనులో దిగి వెళ్లాలి. పవిత్ర 'సరయూ'నది ఒడ్డున గల యీ నగరం, ఎంతో ప్రాచీనమైనది. చారిత్రకమైనది. ఎంతో మంది సూర్యవంశపు రాజులు పాలించిన నగరం. దిలీప చక్రవర్తి, రఘుమహారాజు, ఆజ మహారాజు, దశరథమహారాజులు పాలనలో సుభిక్షంగా వుండేది. కరువులు కాటకాలు ఎరుగని రాజ్యమని ప్రజలు సుఖించిన దేశమని ఐతిహాసకులు పేర్కొన్నారు. సూర్యవంశంలో త్రేతాయుగంనాటి శ్రీరామచంద్రుడు అవతరించిన నేల, గాలి, అయోధ్యనగరం పవిత్రమైనది. ఎంతో కాలంగా సంతానం లేని దశరథ మహారాజు పుత్రకామేష్టి యాగం చేయగా, అగ్ని దేవుడు ప్రత్యక్షమై బంగారు గిన్నెలో పాయసం యిచ్చి, తన ముగ్గురు భార్యలైన, కౌసల్య, కైకేయిసుమిత్రలకు పంచి యివ్వుమన్నాడు. అలాగే చేశాడు దశరథుడు. కొద్ది రోజులకు ఆ ముగ్గురు రాణులు గర్భములు దాల్చి, రామ, లక్ష్మణ, భరత, శత్రుఘ్నులను కన్నారు. నలుగురిలో పెద్దవాడు రాముడు 'జ్యేష్ఠః శ్రేష్ఠః' అని పేరు. శ్రీరామచంద్రుడు గుణవంతుడు ధీశాలి. ధనుర్విద్యాపారంగతుడు, రూపు దాల్చిన ధర్మమూర్తి, అలాంటి ప్రజానురంజకుడైన పాలకుని రాజ్యమే రామరాజ్యమయింది. అలాంటి పుణ్యస్థలం యీ అయోధ్య. వీరి వంశం ఇక్ష్వాకువంశం పూర్వం ప్రజాపతి బ్రహ్మయొక్క కుమారుడు మనువు అయోధ్యా నగరాన్ని నిర్మించి, రాజధానిగా చేసికొని కొంతకాలం పరిపాలించాడు. ఆయన తన తొమ్మిదిమంది కుమారులకు తొమ్మిది భాగాలు చేసియివ్వగా, పెద్దకొడుకైన 'ఇక్ష్వాకునకు'

అయోధ్య భాగంగా వచ్చింది. అప్పటి నుండి అయోధ్య పరిపాలకులు, ఇక్ష్వాకువంశ ప్రభువులే – అందుచేత అదే వంశానికి చెందిన శ్రీరామునకు ఇక్ష్వాకువంశ తిలకుడను బిరుదు వచ్చింది. ఇదే వంశంలో 'వికుక్షి' అనే రాజుకు, ఇంద్రునితో స్నేహం చేయవలసి వచ్చింది. దేవతలకు – రాక్షసులకు జరిగే యుద్ధంలో ఇంద్రుడు వికుక్షి సహాయాన్ని అర్థించాడు. దేవతలను విజయం వరించింది. వికుక్షి తర్వాతితరంవారిని 'కాకుత్సులు' అని పిలిచేవారు. అయోధ్యను పాలించిన వారిలో ఇక్ష్వాకులు, కాకుత్సులు కాగా వీరి వంశంలోని మాంధాత, సగరుడు, అంబరీషుడు, హరిశ్చంద్రుడు గొప్ప పరిపాలకులుగా, చక్రవర్తులుగా కీర్తి పొందారు. అలాగే దిలీపచక్రవర్తికి మంచిపేరు వుంది. యుద్ధాలలో ఆరితేరిన రఘుమహారాజు సత్యధర్మనిష్ఠగలరాజు రాముడు కూడా రఘువువలె గొప్ప వాడై రఘువంశకులాంబుధి చంద్రుడని పేరు తెచ్చుకున్నాడు.

శ్రీరామచంద్రునికి "రామో విగ్రహవాన్ ధర్మః" అని పేరు. ధర్మమూర్తి, సత్యశీలుడు, తండ్రిమాట జవదాటని తనయుడిగా కీర్తిపొందాడు. ఇతని తమ్ములు, భరత, లక్ష్మణ, శతృఘ్నులు కూడా మంచి పరాక్రమ వంతులు, ధర్మ మూర్తులు. అన్నగారి మాటను తు చ తప్పకుండా పాటించే సోదరులు. – సీమ్మ "పతివ్రతా మహాభాగా, ఛాయ యాను గతాసదా" – నిరంతరం నీడవలె సంచరించే అనుయాయి సీతాదేవి పతివ్రతగా పేరు పొందింది. ఇట్టి ఆదర్శ దంపతులు, ఆశేష జనవాహిని అభిమానం పొందిన ఇక్ష్వాకు వంశమణులు. రామచంద్రుడు 11వేల సంవత్సరాలు జీవించి, పరిపాలించాడని రామాయణం చెబుతుంది. అట్టి పావనమూర్తి పుట్టి పెరిగిన స్థలమే శ్రీరామజన్మ భూమి అయోధ్య.

మొట్టమొదట శ్రీరామజన్మభూమిని గుర్తించి, విక్రమాదిత్య చక్రవర్తి స్ఫటిక శిలలతో ఒక దివ్యమైన మందిరం కట్టించాడట. తర్వాతి కాలంలో కనోజ్ ప్రభువు జయచంద్రుడు. దానిని విస్తరించి ఆధునాతన మందిరాలు,



మందిర సౌందర్య నిర్మాణాలు చేసి ప్రజలకు శ్రీరామచంద్రమూర్తి అనుగ్రహాన్ని కలిగించాడు. ఇదిలా వుండగా క్రీ.శ.1526లో ఢిల్లీ పాదుషాబాబర్ చక్రవర్తి యీ ప్రాంతంలో రామమందిరం పడగొట్టి – అవేస్తంభాల మీద మసీదుకట్టాడని చెబుతారు. భారతరిపబ్లిక్ అనంతరం, కట్టుదిట్టమైన భద్రతా సిబ్బంది మధ్య చిన్నరామమందిరం కట్టారు. హిందూ ముస్లింల ఘర్షణలు కలుగకుండా నిరంతరం మిలిటరీ కాపలా వుంటుంది. అక్కడే ఓ గుడారం వేసి శ్రీ సీతారామలక్ష్మణుల విగ్రహాలు పెట్టించారు. తగిన సమయాలలో వెళ్లి పూజారులు, పూజలు నిర్వహిస్తారు – భక్తులు బయటినుంచే దర్శించుకొని వెళతారు.

**మందిరాలనగరం :** దివ్యమైన ఎత్తైన విశాలమైన మందిరాలు ఎన్నోవున్నాయి. ఇవన్నీ దర్శనీయ స్థలాలే – ముందుగా హనుమాన్ గుడికి వెళ్తారు. రావణ వధానంతరం శ్రీరాముడు పుష్పకవిమానంలో వచ్చి ముందుగా భరతుడిని కలిసాడు. ఈ స్థలాన్ని 'భరత్‌మిలావ్' అంటారు. అక్కడికి సమీపంలో ఒక మందిరంలో శ్రీరాముని పాదుకలుంచి, పూజించేవాడట. సమీపంలోని నందిగ్రామ్‌లో వుంటూ పాదుకల సాక్షిగా పరిపాలించిన నిస్వార్థుడు. హనుమాన్ గుడి చాలా విశాలమైనది. అక్కడే వుంటానని హనుమ ఏర్పాటు చేసుకున్న స్థలం. సరిగ్గా దానికి ఎదురుగా ఓ పెద్ద విశాలమైన రాజభవనం వుంది. అదే శ్రీరామచంద్రుడు పాలించిన రత్న సింహాసనం గల చోటు – ఈ రామభవనాన్ని ఏడాదిలో ఒక రోజు మాత్రమే తెరుస్తారు – మిగతా రోజులు మూసి వుంటుంది. అందులో సీతారామ లక్ష్మణుల బంగారు విగ్రహాలు, రత్నఖచిత సింహాసంన, ఎన్నో విలువైన ఆభరణాలు, రాజోచిత ఆభరణాలు వున్నాయి.

శ్రీరామ భవనానికి కొంచెం దూరంలో కనక భవనం వుంది. దీనినే కైకేయీ భవనం అంటారు. సీతకు బహుమానంగా యివ్వడం వలన దీనిని సీతా భవనం అనికూడా అంటారు. కైకేయీ భవనం బంగారు, వెండి రేకులతో తలుపులు కిటికీలు తాపబడ్డాయి.

**ఇంకా చూడతగినవి :** చక్రవర్తి దశరథ మహారాజు మందిరం అద్భుత నిర్మాణ కౌశలం కలది. ఆ ప్రక్కనే కౌసల్యా భవన్, సుమిత్రా భవన్, కైకేయీ భవన్, లక్ష్మణ్ మందిరం, భరత్, శతృఘ్నుల మందిరాలున్నాయి. దశరథుని మందిరంలో దశరథుని సింహాసనం వుంది. ఈ భవనంలోనే వేలాది మంది శ్రీరాముని పట్టాభిషేకాన్ని చూచి ఆనందించారు. శ్రీమద్రామాయణం అయోధ్యాకాండలో 'అయోధ్యా నగర వర్ణన, నగర పౌరుల అలవాట్లు – వృత్తి విద్యా కౌశలురైన పనివారి జీవితాల గురించి వుంది. శ్రీరామ పట్టాభిషేకానికి వచ్చిన జనులు ఉదయమే యింఢ్లల్లో – వీధుల్లో దీపాలు వెలిగించి వెళ్లారట. ఉత్సవం అయ్యేవరకు ఏ రాత్రి అవుతుందో అని. వీధులన్నీ అరటిస్తంభాలతో – మామిడి తోరణాలతో అలంకరించారట. ఆనాటి ఆ వీధులను మనం చూడవచ్చు.

దశరథుడు సరయూనదిఒడ్డున పుత్రకామేష్టి చేసిన "మఖస్థలం" కూడ వుంది. దానిని యాత్రికులు చూడవచ్చు. శ్రీరాముడు రాజ్యమేలిన రాజగద్దె, శ్రీరామ భరత లక్ష్మణ శతృఘ్నులు ఆడుకున్న బాల్యక్రీడల ఆనందభవన్ పాదుకామందిరం. ఇలా ఎన్నో చూడవచ్చు. ఇవిగాక సరయూనది వద్ద, గల రాజఘాట్, రామఘాట్, జానకీఘాట్, గుప్తార్ ఘాట్లు వున్నాయి. చివరకు రామావతారం చాలించిన 'స్వర్గద్వార్' సరయూనది ఒడ్డున వుంది. అది తప్పక చూడవలసిందే.

భారతీయ సాహిత్యాలకెల్ల మణివంటి శ్రీమద్రామాయణం వ్రాసిన వాల్మీకి ఆదికవి యొక్క మందిరం, రామాయణ వ్యాఖ్యాత గోవిందరాజు మందిరాలను కూడ చూడవచ్చు.

**కూజంతం రామ రామేతి**
**మధురం మధు రాక్షరమ్**
**ఆరుహ్యా కవితా శాఖాం**
**వందే వాల్మీకి కోకిలమ్**



అలాంటి మహాకవి మేధనుండి ఉద్భవించిన, మధురాక్షరాల రామాయణం, విన్నా, చదివినా, మోక్షమే. అందుకే భారతీయులందరికి రామాయణం నిత్య పారాయణగ్రంథం. రామపాదస్పర్శ తగిలితేనే శబరికి, అహల్యకు, గుహునికి మోక్షం లభించింది. 'రామ' అనే రెండక్షరాలు పాప విమోచనాలు. వేయినామాలకంటె ఒక్క రామనామం చాలని శివుడు పార్వతికి చెప్పాడట.

**శ్రీరామ రామ రామేతి**
**రమే రామే మనోరమే**
**సహస్రనామ తత్తుల్యం**
**రామనామ వరాననే**

ఇదే తారకమంత్రం. ఈ మంత్రం చదువుతూ అయోధ్యనగరాన్ని చూద్దాం. ఈ దేశంలో నదులు, పర్వతాలున్నంతకాలం, రామాయణం వుంటుంది. రామకథ వుంటుంది. అలాగే అయోధ్యనగరం, నిత్యం రాముణ్ణి తలచుకుంటూ వుంటుంది.

## అయోధ్య గురించి అద్భుత విషయాలు

1. అయోధ్యకు సాకేతమనిపేరు.
2. విష్ణుమూర్తి యొక్క ఏడవ అవతారం శ్రీరాముడు.
3. ఇది 9000 సంవత్సరాల కాలం నాటిదని చారిత్రకుల అంచనా.
4. అధర్వణ వేదంలో అయోధ్య దేవనిర్మితనగరమని ఉంది.
5. సూర్యవంశీయుల తర్వాత, బౌద్ధులు, జైనులు, మహమ్మదీయులు కొంతకాలం పాలించారు.
6. హిందూపురాణాల ప్రకారం అత్యద్భుతమయిన, అందమైన ప్రాచీన నగరం 250 చదరపు కిలోమీటర్ల విస్తీర్ణంలో వుంది.

7. సూర్యవంశానికి చెందిన 63వ రాజు దశరథుడు. 31వ రాజు సత్యహరిశ్చంద్రుడు.

8. శ్రీరాముని కన్నతల్లిలా చూసుకుంది 'సరయూనది'. అవతారసమాప్తిలో తనలో కలుపుకుంది సరయూనది.

9. తులసీదాసు 1574లో 'రామచరితమానస్' గ్రంథాన్ని యిక్కడే ప్రారంభించాడు.

10. ఇక్కడి మందిరాలలో ఒకచోట 'వాల్మీకి'ని చిత్రించారు. ప్రక్కనే లవకుశుల చిత్రాలు వుండడం విశేషం.

11. తమిళదేశంలోని 'ఆళ్వార్లు', అయోధ్యను సందర్శించి స్వామిని స్తుతిస్తూ తమిళపాశురాలలో ప్రస్తావించారు. వారు పురుషోత్తమమగన్ అని కీర్తించారు.

12. యుద్ధంలో పరాజితులు కాని వారి దేశం అని, యుద్ధమే లేని శాంతి నగరమని 'అయోధ్యకు పేరు వచ్చిందని చరిత్రకారులు చెబుతారు. ఇక్ష్వాకువంశప్రభువులు పూజించే శ్రీరంగనాథ దేవాలయం అయోధ్యలో వుంది.



## 13. మథుర

ఇదే శ్రీకృష్ణజన్మభూమి. ఇదే ఉత్తర భారతదేశంలోని మథురానగరం. రూపం మథురం, గాత్రం మథురం, నామం మథురం, సర్వం మథురం, మథురాతిమథురం అని వల్లభాచార్యులు, పుష్టి మార్గదర్శి, శ్రీకృష్ణుని అందచందాలను, ఆ నగరాన్ని వర్ణించాడు. ఇది ఢిల్లీకి 150 మైళ్ళ దూరంలో, ఆగ్రాకు 50 కి.మీ. దూరంలో యమునానదీ తీరంలోని వెలసిన పుణ్యక్షేత్రాలలో ప్రసిద్ధమైనది. శ్రీకృష్ణుడు జన్మించిన యీ స్థలం 108 దివ్య తిరుపతులలో ఒకటిగా; సప్త మోక్షదాయకములలో ఒకటిగా, మథుర విఖ్యాతి చెందిన నగరం. ద్వాపరయుగంలో, శ్రీకృష్ణుని మేనమామచే పాలింపబడుచున్న సూరసేనసామ్రాజ్యానికి మథుర రాజధాని. భూగర్భ చెరసాలలో జన్మించిన శ్రీకృష్ణుని జన్మస్థలంలో 'కేశవదేవ్' ఆలయం నిర్మించబడింది.

**వ్రజ మండలం :** శ్రీకృష్ణుడు తిరిగిన ప్రదేశాలు క్రీడాస్థలాలు లీలాక్షేత్రాలుగా పిలువబడుతున్నాయి. అవి మథుర, బృందావనం, బలదేవ్, గోకులం, గోవర్ధనం, నందగావ్‌లు ఈ అన్ని ప్రదేశాలను ప్రదక్షిణం చేస్తే, సప్తద్వీపములను ప్రదక్షిణం చేసిన పుణ్యం కలుగుతుంది.

**మథురానగర నిర్మాణం :** ఇది అతి ప్రాచీనమైననగరం – శ్రీమద్రామాయణంలో దీని ప్రస్తావన వుంది. శ్రీరాముని సోదరుడైన, శత్రుఘ్నుడు మథురలో జరిగిన యుద్ధంలో "లవణాసురుని" యిక్కడ సంహరించినట్లు పురాణ కథనం. ఇది దట్టమైన అరణ్యప్రాంతం కనుక, 'మధువనం'గా, మథురవనంగాను మథురగాను పిలువబడుతుంది. ఈ లవణాసురుడు 'మధువు' సంతతివాడు. యాదవరాజు. 'మధువు' సంతతివాడు పాలించిన నగరం మథురానగరంగా వ్యవహరింపబడిందని ఒక కథనం ప్రచారంలో వుంది. ఈ నగరం, నగరంలోని శ్రీకృష్ణుని లీలా

విలాసములను తమిళదేశంలో ఆళ్వార్లు కీర్తించారు. వారు, పెరియాళ్వార్, ఆళ్వార్, తిరుమంగై ఆళ్వార్ నమ్మాళ్వార్లు మొదలగువారంతా శ్రీకృష్ణుణ్ణి యదువంశ తిలకుడని పలుపలు విధాల కీర్తించారు. ఆళ్వార్లు కీర్తించిన ఆనాటి ప్రాచీన సన్నిధి నేడు కానరాదు.

శ్రీకృష్ణజన్మభూమిలో ఒక దేవాలయాన్ని మొదట నిర్మించినవాడు శ్రీకృష్ణుని మునిమనుమడైన వజ్రనాభుడు. ఈ అందమైన నగరాన్ని పలుమార్లు ఔరంగజేము, సికిందర్‌లోథి గజనీమహ్మద్ మున్నగువారు అనేకమారులు కూలగొట్టడం, హిందూమతానుయాయులు మరల నిర్మించడం, మరల ధ్వంసం చేయడం మూలాన, నగరం శోభను కోల్పోయింది. జహంగీర్ కాలంలో, రాజావీర్‌సింగ్‌దేవ్ అత్యద్భుత సుందర భవనం నిర్మించాడు. ఒక ఫ్రెంచి యాత్రికుడు చూచి, 12 కి.మీ. దూరం నుంచే కనిపించేదని రాశాడు. తర్వాత ఆంగ్లేయు పాలనలోకి వచ్చిం తర్వాత, 1850 ఈస్టిండియా కంపెనీ వారు దాన్ని వేలంవేయగా, కాశీరాజు రాజాపట్టనీమూల్ దానిని కొన్నాడు కాని ఆలయాన్ని నిర్మించలేక పోయాడు. తర్వాతి కాలంలో 21-8-1951లో "శ్రీకృష్ణజన్మభూమి" అనే ట్రస్ట్ ఏర్పడి, ఆ ట్రస్ట్ ద్వారా ఆలయ నిర్మాణానికి పూనుకున్నాడు. తర్వాత 'కళాయన' అధిపతి శ్రీహనుమాన్ ప్రసాద్‌గారు శంఖుస్థాపన చేసి ప్రస్తుత ఆలయాన్ని నిర్మించాడు. ఆ ఆలయ గర్భగృహంలో పెద్ద అరుగు, దానిపైన 'బాలకృష్ణుని' చిత్తరవు – శ్రీకృష్ణభగవానుని జీవిత ఘట్టాలచిత్రాలను నిర్మించి క్రీశ. 1957లో 'ఒక నూతన మందిరం కట్టించి అందులో శ్రీకృష్ణ విగ్రహాన్ని స్థాపించారు.

ఈ భవనానికి ఆనుకొని 'ఈద్గా' వున్నది. అదే ఔరంగజేబు హిందూ దేవాలయస్తంభాల మీద కట్టిన మసీదు. ఈ మసీదులోనుండి, క్రిందకు చూస్తే భూగర్భ చెరసాలవుంది. అందులోనే దేవకీవసుదేవులను నిర్భంధించాడు కంసుడు. శ్రీకృష్ణజననం కూడా ఈ చీకటి చెరసాలలోనే జరిగింది.



'గోకులం' అనే మరోపుణ్యక్షేత్రం – మధురకు 12 కిలోమీటర్ల దూరంలో ఉంది. ఇది చిన్ని శ్రీకృష్ణుని లీలాక్షేత్రం. గోపాల బాలురతో కలిసి, గోవులను మేపుతూ, కంసునికి దూరంగావుంటూ, మిత్రులతో గడిపిన పుణ్యస్థలం. బ్రహ్మాది దేవతలచేత మొక్క బడిన పాదాలతో యీ స్థలమంతా పునీతమయింది. 'పూతన' అనే రాక్షసిని చిన్నికృష్ణుడు సంహరించిన స్థలం యిదే యని ప్రచారంలోవుంది. ప్రాచీన కాలానికి సంబంధించిన చారిత్రక కట్టడా లేవీ లేవు. ఇవన్నీ ఆధునిక కాలంలో నిర్మించిన దేవాలయాలే. ఇక్కడి ఆలయంలో 'శ్రీకృష్ణభగవానుడు' తూర్పువైపు చూస్తూ వుంటాడు. గోకులం యమునానది ఒడ్డున వున్న మరో శ్రీకృష్ణలీలా క్షేత్రం ఉంది. కంసుని సంహరించిన తర్వాత శ్రీకృష్ణుడు యమునానదిలో స్నానం చేశాడట. ఈ యమునానది యమధర్మరాజు చెల్లెలట. ప్రతిసంవత్సరం కార్తీక శుద్ధవిదియనాడు 'యమున'లో స్నానంచేస్తే కోటి పాపాలు తొలగిపోతాయని 'యమధర్మరాజు చెప్పాడట. ఆ రోజు 'యముడు' చెల్లెలైన, యమున యింటికి వచ్చి భోజనం చేశాడట. ఆ చెల్లెలి ఆతిథ్యాన్ని మరచిపోని 'యముడు' ఎవరైనా కార్తీక శుద్ధవిదియనాడు 'యమునలో స్నానం చేస్తే పుణ్యగతులు పొందుతార'ని ఒక కథ ప్రచారంలో వుంది. మధురకు 9 మైళ్లు దూరంలో బృందావనం వుంది. ఇదొక చిన్న పట్టణం. ఈ పట్టణం నిండా అనేక దేవాలయాలు వున్నాయి. అన్నీ కృష్ణమందిరాలే – శ్రీరాధాకృష్ణులస్పర్శతో గో గోపీజనులు నడయాడిన పరమపవిత్రమైన దివ్యప్రదేశంగా ఈ బృందావనం సువాసనలు వెదజల్లే ఎత్తైన తులసీ వృక్షాలతో, పూలచెట్లతో విరాజిల్లుతుంటుంది. అందువల్లే ఈ బృందావనం అందరిదీ, గోవిందుడు అందరివాడయ్యాడు. అందుకే బృందావనంలో ప్రతిఇల్లూ శ్రీకృష్ణుని సదనంగానే దర్శనమిస్తుంటుంది. కనుకనే బృందావనంలో స్త్రీపురుష భేదంలేకుండా ప్రతివారినోటినుండి "రాధే రాధే" అనీ "రాధేశ్యాం" అనీ నామోచ్చారణలు చెవికింపుగా వినపడుతూ ఆనందాన్ని

కలిగిస్తాయి. మధుర, గోకులం, తర్వాత తప్పక చూడ తగిన మరో దివ్యమైన లీలాక్షేత్రం ఈ 'బృందావనం'. మధుర నుండి 30 కి.మీ దూరంలో 'గోవర్ధనం' అనే క్షేత్రం. దీనిని వ్రజభూమిగా పిలుస్తారు. బ్రహ్మకు, కాళియునికి ప్రత్యక్షమయిన స్థలంగా చెబుతారు. ఇది గూడ యమున ఒడ్డున వుంది. దీనినే గోవర్ధనగిరి అంటారు. శ్రీకృష్ణుడు, ఇంద్రుడు కురిపించిన రాళ్లవర్షంనుండి యాదవులను కాపాడిన స్థలం.

బృందావనంలోని వ్రజస్త్రీలు, పురుషులు తొలుత ఇంద్రుణ్ణి పూజించేవారట. శ్రీకృష్ణుడు పెరిగిపెద్దవాడైనపుడు, ఇంద్రునికి బదులు, తమను, తమ గోవులను, గోవర్ధనగిరినే పూజించమని ఆదేశించాడట. అందుకు కోపించిన ఇంద్రుడు ఆ గిరిపైన, పరిసర ప్రాంతముల మీద, రాళ్ల వర్షం కురిపించాడట. యాదవులు అందరూ కలిసి మొరపెట్టుకోగా, శ్రీకృష్ణుడు తన యొక్క చిటికెనవ్రేలు మీద, ఆ పర్వతాన్ని ఎత్తి, యాదవులను, ఆవులను, గొడుగులా క్రింద కాపాడినాడు. అందువల్ల ఆ గిరి అప్పటి నుండి గోవర్ధనగిరిగా మారింది. పర్వతము చుట్టు కొలత సుమారు 20 కి.మీ. భక్తులు కీర్తనలు భజనలు పాడుతూ 16 రోజులు ప్రదక్షిణం చేస్తారు. శ్రావణమాసంలో ఒక బృందంగా కొందరు, ఫాల్గుణ మాసంలో కొందరు బృందాలుగా ఏర్పడి గిరిప్రదక్షిణం చేస్తారట. అలా తిరుగలేనివారు అక్కడ గల 'మానసగంగ'లో స్నానాలు చేస్తారు. శ్రీకృష్ణుడే నిర్మించినట్లు చెప్పబడే ఓ బ్రహ్మకుండం, గోవర్ధన దేవాలయం చూడతగింది. దేవాలయ వెనుక భాగమున రాతితో మలచిన 'శ్రీకృష్ణరూపము, అందమైన నెమలి పింఛము కనిపిస్తాయట ఇవన్నీ చూడ తగినవే. ఈ విధంగా వ్రజమండలంలోని అయిదు శ్రీకృష్ణలీలాక్షేత్రాలను చూచి తరించవలసిందే. లోకోద్ధరణ కోసం అవతరించిన శ్రీకృష్ణుని జీవిత మాహాత్మ్యాన్ని తెలిపే సాహిత్యం విస్తృతంగా వుంది – సంస్కృతంలో లీలాశుకుడు శ్రీకృష్ణకర్ణామృతం, నిజంగా అక్షరాక్షరం అమృత స్రోతస్వినియే నౌమి గోపాలం అంటూ వరుసగా అదే మకుటంతో



కొన్ని శ్లోకాలు, లలిత హృద్యంగా సాగాయి. చిన్ని కృష్ణుని వర్ణిస్తూ యిలా వ్రాశాడు.

**"బాలాయ నీలవపుషే**
**నవ కింకిణీక జాలాభి రామ**
**జగన్నుత దిగంబరాయ**
**శార్దూల దివ్య నఖ భూషణభూషితాయ**
**నందాత్మజాయ నవనీత ముషే నమస్తే"**

"కస్తూరీ తిలకం లలాట ఫలకే వక్షఃస్థలే కౌస్తుభం" వంటి ప్రసిద్ధ శ్లోకాలు ఎన్నో వున్నాయి. ఇవన్నీ లీలాశుకునివే. వల్లభాచార్యులు మధురాష్టకమ్, జయదేవకవి గీత గోవిందమ్, మీరాబాయి భజనలు, నారాయణ తీర్థుల తరంగాలు, నామ్ దేవ్ కీర్తనలు, గోదాదేవి పాశురాలు మొదలగు స్తుతిసాహిత్యమంతా శ్రీకృష్ణునికి చెందినదే. గీతోపదేశం చేసిన మహానుభావుడు, అజ్ఞాన అంధకారాన్ని బాపిన జ్ఞాన భాస్కరుడు, కర్తవ్య నిష్ఠను తెలిపిన బోధకుడు శ్రీకృష్ణ భగవానుడు.

శ్రీకృష్ణపరబ్రహ్మ తత్త్వమును తెలిసికొని ఆయన పేరిట స్థాపించిన మందిరాలు, దేవాలయాలు దర్శించి మన జన్మను సార్థకం చేసుకోవాలి. ఇక్కడికి ఢిల్లీనుండి ఆగ్రాద్వారా, మధురకు చేరుకొని, అక్కడినుంచే వ్రజమండలమంతా తిరిగి రావచ్చు.

# 14. పూరీ జగన్నాథస్వామి ఆలయం

భారతదేశంలోని ప్రసిద్ధ క్షేత్రాలలో ఇదొకటి. ఇది ఒరిస్సా రాష్ట్రంలో 'పూరీ' పట్టణంలో వుంది. ఆధునిక కవి శ్రీశ్రీ చెప్పిన జగన్నాథ రథ చక్రాలు యీ స్వామిదే. ఈ స్వామిపేరు 'జగన్నాథ స్వామి'. అతి ప్రాచీనము అతి ప్రాముఖ్యమైన యీ క్షేత్రం అధిపతి 'జగన్నాథుడు. ఇక్కడికి ఎలా చేరుకోవాలి. అంటే ముందుగా కలకత్తా రావాలి. లేదా చెన్నై – హౌరా రైలుమార్గంలో ఖుర్ధా రోడ్ జంక్షన్ వుంది. దానికి 44 కి.మీ. దూరంలో 'పూరీ' రైల్వేస్టేషన్‌లో దిగాలి. అదే శ్రీస్వామివారి కొలువు. ఈ క్షేత్రం "నీలాద్రి" అనే కొండపై ఉండడం వలన, నీలాచలం, నీలగిరి, నీలాద్రి స్వామిగా పేర్కొన బడింది పురాణాలలో. ఇది భారతదేశానికి తూర్పుభాగాన మహత్తర తేజంతో, బంగాళాఖాతం తీరంలో వెలసిన జగన్నాథ ప్రభువు క్షేత్రం. ఈ స్వామి విగ్రహం ఎలా వుంటుందో చెబితే అందరికీ అశ్చర్యమౌతుంది ఇది. బంగారమో వెండియో ఇత్తడియో యితర లోహాలతో నిర్మించిన మూర్తులు కాదు. కేవలము నింబ (వేప) దారు నిర్మితమై, శిల్పకళా ఖండవిరాజిత నీలకళేబర విరాజిత జగన్నాథ ప్రభు దివ్యక్షేత్రమై, ప్రాగ్దిశామండల మణిగా విఖ్యాతమైన క్షేత్రం.

ఇది పాపాలను పోగొట్టే 'శ్రీకృష్ణపరమాత్ముని నిత్యలీలావిభూతిని, పరతత్వాన్ని దర్శనస్పర్శస్మరణ మాత్రేణ ముక్తి దాయకక్షేత్రంగా విరాజిల్లుతోంది. కేవలము వేపచెట్టు చెక్కచేత బలరామ, శ్రీకృష్ణ, సుభద్రల విగ్రహాలను అతిసుందరంగా శిల్పశోభిత రామణీయకంగా చెక్కి, నిల్పి, అతినిష్ఠా గరిష్ఠ మాత్రంగా పూజించి, చైత్ర, ఫాల్గుణ మాసాలలో జరిగే నవ కళేబరోత్సవ, రథోత్సవ వైభవాలను సంతరించి భక్తులకు అనేక, అనుగ్రహ కృపాపారీణ విభూతిని అందించడం ఒక గొప్ప సంప్రదాయం. ఈ క్షేత్రంలో 12 ఏండ్ల కొకసారి కొత్త దారువిగ్రహాలను తయారు చేసి భక్తి ప్రపత్తులతో ప్రతిష్ఠచేసి ఆరాధిస్తారు. దీనికి శ్రీక్షేత్రమనీ, పురుషోత్తమ క్షేత్రమనీ,



నీలక్షేత్రమనీ, దశావతారక్షేత్రమనీ, సుభద్రాప్రాణనాథ క్షేత్రమనీ, పరిపరి విధాల కీర్తిస్తారు. దీనికి పరిపూర్ణక్షేత్రమని కూడా పేరుంది. సర్వజగద్రక్షకుడైన హరి శ్రీకృష్ణరూపములో, బలరామునితో – చెల్లెలు సుభద్రతో కలిసి రథోత్సవములో భక్తుల నలరించడం ఈ ఉత్సవ ప్రత్యేకత. ఇదొక శ్రీకృష్ణభక్త కవీంద్రుని – పవిత్రకవితా మందారాలు వికసించిననేల – పద్మావతీ చరణచారణ చక్రవర్తి భక్త జయదేవకవి గీతగోవిందం ఆవిష్కరింపబడిన నేల. పురుషోత్తమ ప్రభువు ఆ స్థానంలో జయదేవ కవీంద్రుడు, తన కవితాశక్తిని ప్రదర్శించాడు. ఎండిపోయిన చెట్టును, సంగీతం ద్వారా చిగురింప చేశాడు. దీపక రాగంచేత, ఆరిపోయిన దీపాలను వెలిగింప చేశాడు. జయదేవుని గీతాలు కృష్ణభక్తి జలపాతాలు.

పూరీలో ప్రధానమైన ఉత్సవాలు రెండు ఒకటి 'నవ కళేబరోత్సవం – రెండవది ప్రపంచ ప్రసిద్ధిగాంచిన రథోత్సవం. ఇక్కడ మూడు రథాలుంటాయి – ఒకటి – బలభద్రునిది – రెండు సుభద్రది మూడవది అతిపెద్దది జగన్నాథుని రథం. బలమైన త్రాళ్లతో లక్షలాది మంది లాగుతారు జగన్నాథుని రథం ఎత్తు 45 అడుగులు 7 అడుగుల వ్యాసం. దీని పేరు నంది ఘోష. దీనిపై గరుత్మంతుని జండా ఎగురుతుంది – ప్రతిరథానికి 4 గుఱ్ఱాలు వుంటాయి. ప్రతిసంవత్సరం, రథాలను క్రొత్తగా నిర్మిస్తారు. ఉత్సవాల తరువాత, వాటిని కాల్చివేస్తారు. కర్రలు, వాసాలు వేలం వేస్తారట – జగన్నాథుని రథ చక్రాల సంఖ్య 16. బలభద్రుడి రథం చక్రాలు 14. ఎత్తు 44 అడుగులు. దీనిపై తాడి చెట్టు పతాకం ఎగురుతుంది. ఇక మూడవది సుభద్రారథం. ఇది 43 అడుగుల ఎత్తు 12 చక్రాలు రథం. పద్మధ్వజం రెపరెపలాడుతుంది. రథాలు వరుసగా కదులుతాయి. జగన్నాథుని రథం కదలటానికి ముందు యిక్కడి ఆచారం ప్రకారం పండాలు బూతులు (అశ్లీలపదాలు) పలుకుతారు. ప్రధాన పండా సూచన తీసికొని ముందుగా బలభద్రుని రథం, తరువాత సుభద్రరథం. చిట్ట చివరకు 'జై జగన్నాథ'

అనే భక్తి నినాదం మారు మ్రోగేలా ఉచ్చరిస్తుండగా, జగన్నాథుని రథం కదులుతుంది. ఈ రథాలన్నీ 2 కి.మీ. దూరంలోనున్న "గుండిచ" ఆలయాన్ని చేరుకుంటాయి. అక్కడ వేంచేసియున్న అమ్మవారిని జగన్నాథుని సరసన కొంత సేపు వేంచేపు చేసి తిరిగి వెనక్కి తీసుకొని వెళతారు. 2 కి.మీ. దూరం కదిలే రథయాత్రకు 12 గంటలు పడుతుందట. రథం భక్తుల మనోరథం. మనిషి జీవితమే రథం. అందులోని రథస్థుడే జగన్నాథుడని భక్తులు భావిస్తారు. గుండిచ ఆలయం నుండి తిరిగి జగన్నాథుని ఆలయానికి 12 గంటలపాటు అతి నెమ్మదిగా అంగుళం, అంగుళం కదులుతూ సాగుతుంది. రథ చక్రాల క్రింద ఎవరైనా పడినా, దారిలో దుకాణాలు అడ్డం వచ్చినా రథం మాత్రం వెనుకకు రాదు. కూల గొట్టైనా ముందుకే కదలుతుంది. మూలవిరాట్టులను 2 రోజుల పాటు రథంలోనే వుంచుతారు. అయిదవ రోజున, 9వ రోజున, 11వ రోజున వివిధ ఉత్సవాలు చేస్తారు. వీటినే నీలకళేబరోత్సవం, నవ కళేబరోత్సవం అంటారు. ఇలా 12 రోజులు ఉత్సవాలయిన తరువాత, మూలవరులను తిరిగి దేవాలయంలో ప్రతిష్ఠిస్తారు. ఇక్కడి విగ్రహాలను ఒక రకమైన వేపచెట్టు చెక్కతో తయారు చేస్తారు. వెండి, బంగారం, ఇత్తడి, పంచలోహాలు కాక చెక్క విగ్రహాలు తయారు చేయడానికో కథవుంది.

**శ్రీకృష్ణ చరిత్ర :** శ్రీకృష్ణ నిర్యాణం జరిగింది. అనుయాయులు, బంధువులు, యాదవులంతా కలిసి అంత్యక్రియలు చేశారు. పార్థివ శరీరంలో నాభిభాగము కాలలేదు. కాలకుండా మిగిలిన ఆభాగాన్ని సముద్రంలో పారవేశారట. కొంతకాలానికి సముద్రంలో నల్లటి విష్ణుమూర్తి శిలగా మారిందట. విశ్వసముడనే సవర జాతి(గిరిజన)కి చెందిన గిరిజన నాయకునికి నీటిలో లభించిందట. విశ్వసముడు అడవిలో ఒకచోట యీ విగ్రహాన్ని 'నీల మాధవుడిగా ప్రతిష్ఠించి పూజిస్తుండేవాడు ఈ గిరిజనుడు సమర్పించే అన్నము పళ్లను, విష్ణుమూర్తి మానవ రూపంలో వచ్చి ఆరగించేవాడట. ఈ సంగతి మాళవదేవపు రాజు ఇంద్రద్యుమ్నుడికి, నారదుని వలన తెలిసింది. రాజా! మీ రాజ్యంలోనే విష్ణుమూర్తి మానవ రూపంలో తిరుగుతున్నాడని చెప్పాడట. రాజు తన మనుషులను పంపి వెదికించాడు. అందులో విద్యాపతి అనే బ్రాహ్మణుడు తిరుగుతూ తిరుగుతూ విశ్వసముని ఊరికి వచ్చి అతని కుమార్తె లలితను వివాహం చేసుకొని అక్కడే స్థిరపడిపోయాడు. మామగారు ప్రతిరోజు ఎక్కడికో పోయిరావడం చూచి గట్టిగా అడుగుతాడు.



అల్లుని మాట కాదనలేక, గంతలు గట్టి అడవిలోని నీలమాధవుని స్థలం చూపించాడు. మామకు తెలియకుండా దారిపొడుగునా ఆవాలు చల్లు కుంటూ వెళ్లాడు. తర్వాత యీ విషయం ఇంద్రద్యుమ్నునకి వెళ్లి చెప్పాడు. ఇంద్రద్యుమ్నుడు వెళ్లి చూడగా విగ్రహం ఆదృశ్యమయింది. ఒక రాత్రి విష్ణుమూర్తి స్వయంగా ఇంద్రద్యుమ్నునికి కలలో కన్పించి అశ్వమేధ యాగం చేసి, చూడు నీకు నా విగ్రహం చెక్కరూపంలో సముద్రంలో దొరుకుతుందని చెప్పాడు. ఇప్పుడు పూరీలోని 'గుండిచ' ఆలయం ఉన్నచోటే రాజు అశ్వమేధ యాగం చేశాడు. తర్వాత సముద్రంలో చూడగా ఒక పెద్ద చెక్క దుంగ కొట్టుకొని రాగా, తీసికొని శిల్పులను పిలిపించి. విష్ణుమూర్తి విగ్రహం చెక్కించే ప్రయత్నం చేశాడు. శిల్పులకు పని ఆరంభించగానే పనిముట్లు మొద్దుబారిపోయాయట. ఇంతలో విష్ణుమూర్తి ఒక వృద్ధ బ్రాహ్మణుని రూపంలో వచ్చి ఈ పని చేసి పెడతానని ప్రక్కన ఉన్న గదిలో 21 రోజుల పాటు ఈ పనిలోనే వుంటానని, ఎవరూ కూడ మధ్యలో వచ్చి తలుపు తెరచి చూడరాదని షరతుపెట్టారు. 15 రోజుల తర్వాత రాజుగారు కుతూహలం ఆపుకోలేక, తలుపు తెరచి చూడగా స్వామి అదృశ్యమయ్యాడు. విగ్రహాలు అసంపూర్తిగా ఉన్నాయి. నడము క్రింది భాగం కాళ్లు చేతులు లేవు. ఇంద్రద్యుమ్నుడు చేసిన తప్పుకు పశ్చాత్తాపపడి అవే విగ్రహాలను యిప్పుడున్న గుడిలో ప్రతిష్ఠించాడు. గుండిచాలయమే స్వామికి జన్మస్థలమయింది. తర్వాత యయాతికేసరి అనే రాజు, దేవాలయాన్ని

విస్తరించాడు. రెండు ప్రాకారాలు, రాజగోపురం కట్టించాడు. క్రీ.శ.1140 ప్రాంతంలో పాలకుడైన చోడ గంగమహాదేవుడు, ఆలయానికి, ఎత్తైన గోపురం. గోపురం మీద అష్టధాతువులతో తయారైన "చక్రం" తయారు చేశాడు. ఇతని కుమారుడైన అనంగమహారాజు, యిప్పుడున్న దేవాలయప్రాకారంలోని అనేక ఉప దేవాలయాలను, నిర్మించి విగ్రహాలను ప్రతిష్ఠించాడు.

ఈ క్షేత్రానికి నీలాద్రి అని కూడా పేరుంది. దీనికి 4 విశాలమైన ద్వారాలున్నాయి. చూడడానికి ఒకటిగా కన్పించినా నాలుగు భాగాలుగా వుంటుంది. తూర్పు ద్వారాన్ని సింహద్వారమంటారు. దక్షిణాన అశ్వద్వారం, పడమట వ్యాఘ్ర ద్వారం, ఉత్తరాన హస్తి ద్వారం వుంటుంది. ఆ యా ద్వారాల జంతువుల రెండు రెండు విగ్రహాలుంటాయి. ఆలయ ప్రవేశం కాగానే నాలుగుమంటపాలు చూస్తాం. మొదటిది భోగమంటపము, తర్వాత నాట్యమంటపము, పిదప ముఖమంటపం చివరగా గర్భాలయం వుంటాయి. స్వామిని ప్రతిష్ఠించిన స్థలాన్ని 'జగన్‌మోహన్' అంటారు. ఈ ప్రాకారాలలో 'అలోకనాథ్, లక్ష్మీనరసింహస్వామి, వరాహస్వామి మందిరాలున్నాయి.

నీలమాధవుడనే బ్రాహ్మణుడు యిక్కడి ఆటవికస్త్రీని సాంప్రదాయపద్ధతిలో వివాహమాడినాడట. వారి యొక్క సంతానమే యిక్కడి పండాలు (బ్రాహ్మణులు) అర్చకులని అంటారు.

జీవితంలో ఒకసారైనా పూరీని సందర్శించి జగన్నాథరథ చక్రాలచప్పుడును వినాల్సిందే.



## 15. కోణార్క్

ఒడిషా రాష్ట్రంలో, పూరి నుండి 35 కి.మీ దూరంలో భువనేశ్వర్ నుండి 65 కి.మీ దూరంలో కోణార్క్ క్షేత్రం కలదు. ప్రపంచ ప్రసిద్ధిపొందిన కట్టడాలలో కోణార్క్‌లోని సూర్యదేవాలయం ఒకటి. ఈ ఆలయం ప్రపంచ వారసత్వ పరిరక్షిత ప్రదేశం. ఈ కోణార్క్‌ను అర్కక్షేత్రం లేక పద్మక్షేత్రం అంటారు. ఇది ఒకప్పుడు మంచి ప్రాచుర్యంలో ఉన్న అద్భుతమైన కట్టడముగా ప్రసిద్ధి చెందింది. అయితే మధ్యలో కొన్నాళ్లు ఇసుక దిబ్బలతో కప్పబడిపోయి, తిరిగి గత శతాబ్దపు చివరి భాగంలో బయటి ప్రపంచపు వెలుగులను చూసింది. పూరిని చక్రక్షేత్రం అనీ, భువనేశ్వర్‌ను శంఖక్షేత్రమనీ, జయపూర్‌ను గదాక్షేత్రమనీ అంటారు. ఈ నాలుగు క్షేత్రాలు శ్రీమహావిష్ణువు తన నాలుగు హస్తాలతో ధరించిన నాలుగు ఆభరణాలు అని, అందువల్ల పద్మక్షేత్రమైన కోణార్క్ విష్ణుమూర్తి యొక్క అవతార ప్రదేశమేనని ఒడిషా రాష్ట్ర ప్రజల విశ్వాసం.

ఈ కోణార్క్ దేవాలయం సముద్రతీరమున నిర్మింపబడింది. ఈ ఆలయము నల్ల గ్రానైటు రాళ్ళతో 13వ శతాబ్దంలో నిర్మింపబడినట్లు తెలియుచున్నది. దీన్ని తూర్పు గాంగ వంశానికి చెందిన నరసింహదేవుడు (1236-1264) నిర్మించాడు. సూర్యభగవానుని రథం ఆకారంలో నిర్మించబడిన ఈ ఆలయం నగిషీలు చెక్కిన శిల్పాలతో, స్త్రీమూర్తుల అద్భుత భంగిమలతో కూడి హృద్యంగా అలంకరింపబడి ఉన్నది. ఈ ఆలయ సముదాయం మొత్తం ఏడు బలమైన అశ్వాలు, 12 జతల అలంకృత చక్రాలతో లాగబడుతున్న పెద్ద రథం ఆకారంలో నిర్మించబడింది. ఈ ఆలయాన్ని నిర్మించటానికి అప్పట్లోనే 12 సం॥ల సమయం పట్టిందని చెబుతారు. సూర్యగమనమునకు అనుగుణంగా ఈ ఆలయ నిర్మాణం జరగటం అద్భుతాలలోకెల్లా అద్భుతంగా చెప్పవచ్చు. రథానికి 12 చక్రాలు,

సంవత్సరానికి 12 మాసాలు, పన్నెండు రాశులు వీటికి అనుగుణంగా సూర్యగమనం చాటి చెప్పే విధంగా ఈ ఆలయం నిర్మింపబడింది.

**చరిత్ర :** శ్రీకృష్ణునికి జాంబవతి ద్వారా కలిగిన కుమారుని పేరు సాంబుడు. ఇతను చాలా అందగాడు. తన అందమైన రూపం కారణంగా అతను చాలా గర్వంతో ఉండేవాడు. ఆ గర్వంతోనే, ఒకసారి దేవఋషి అయిన నారద మహర్షిని అవమానరపర్చగా, నారదుడు తెలివిగా సాంబుని అంతఃపుర స్త్రీలు స్నానం చేసే ప్రదేశానికి తీసుకు వెళ్ళాడట. అక్కడ కూడా సాంబుడు అసభ్యకరంగా ప్రవర్తించాడట. ఈ విషయం తెలిసిన శ్రీకృష్ణుడు ఆగ్రహం చెంది సాంబుని కుష్టువాడయి పొమ్మని శపించాడు. అందుకు విచారించి సాంబుడు నివారణోపాయాన్ని చెప్పుమని కోరగా, శ్రీకృష్ణుడు చెప్పిన ప్రకారం సాంబుడు ఈ అర్కక్షేత్రానికి వచ్చి, ఒక కుటీరం నిర్మించుకొని ఈ క్షేత్రంలో ప్రవహిస్తున్న చంద్రభాగ నదిలో నిత్యం స్నానం చేసి, సూర్యుడిని ఆరాధిస్తూ తపస్సు చేస్తూ ఉండేవాడట. ఒకరోజున సాంబునికి ఆ నది నీటిలో సూర్యుని విగ్రహం ఒకటి దొరికింది. ఆ విగ్రహాన్ని తెచ్చి ప్రస్తుతం కోణార్క్‌లో ఆలయం ఉన్న చోట ప్రతిష్ఠించి ప్రతిరోజు నిష్ఠగా పూజిస్తూ ఉండగా కొంతకాలానికి కుష్టు వ్యాధి నుంచి విముక్తుడయ్యాడంటారు.

ఒకప్పుడు సూర్యభగవానుడు అర్కుడు అనే రాక్షసుని ఈ ప్రదేశంలో సంహరించాడు. గనుక ఈ ఊరికి, ఆ పేరు వచ్చిందని కొందరి అభిప్రాయం. ఒడిషా రాష్ట్రంలో మొత్తం అయిదు పవిత్ర క్షేత్రాలు ఉన్నాయని, అందులో ఈ ఊరు ఉన్న దిశలో అంటే (కోణం)లో సూర్యుడు వెలసియున్నాడు. గనుక ఇది కోణార్క్ అయిందని మరికొందరి అభిప్రాయం. ప్రస్తుతం ఆలయం గోడల యొక్క బయటి భాగం మాత్రమే చూడగలం. ఆలయంలోపలికి, అంటే గర్భగుడిలోకి వెళ్ళే మార్గం పూర్తిగా మూసివేశారు. గర్భగుడిలో ఏడు గుర్రాలు ఉన్న రథం మధ్య సూర్యభగవానుని విగ్రహం ఉండేదట.



ప్రస్తుతం కనిపించే కట్టడం 192 అడుగుల ఎత్తు ఉంది. అయినా బయటి భాగాన ఉండే శిల్పాలే. మనలను ఆశ్చర్యంతో ముంచెత్తుతాయి.

ఈ సూర్యదేవాలయంలో ఎన్నో విచిత్రాలు కలవు. దేవాలయముపైన పద్మము మరియు కలశము ఆకర్షణీయముగా చెక్కబడి ఉన్నాయి. ఖజురహో మాదిరి ఇక్కడ కూడ శృంగార రసభరిత శిల్పాలు విశేషంగా కలవు. ఇక్కడ సముద్రతీర ఇసుక బంగారపు వర్ణములో ఉండి తీర ప్రాంతము అందాలు చిందుతూ ఉల్లాసం కలిగిస్తుంది. కోణార్క్‌లో ప్రతి సంవత్సరం మాఘశుద్ధ సప్తమికి (రథసప్తమి)కి గొప్ప ఉత్సవాలు జరుగుతాయి. ఈ ఉత్సవాలకు ప్రపంచ నలుమూలల నుండి వేలదిగా భక్తులు తరలిస్తారు.

## 16. ఉజ్జయిని

మధ్యప్రదేశ్ రాజధాని భోపాల్‌కు 188 కి.మీ. దూరంలో 'ఉజ్జయిని' అనే చారిత్రక, పౌరాణిక ప్రసిద్ధ నగరం వుంది. ప్రపంచ ప్రసిద్ధి గాంచిన 'ద్వాదశ జ్యోతిర్లింగాలలో ఇది ఒకటి. ఇక్కడనే ప్రసిద్ధమైన' మహాకాళేశ్వరాలయం వుంది. మహాకాళేశ్వరుడు దక్షిణాభిముఖంగా స్వయంభువై వెలసిన దైవ స్థలం.

మహాకాళేశ్వరస్వామి ఆలయం, విశాలమైన ప్రాకారాల మధ్య నిర్మింపబడింది. ఇది అయిదు అంతస్థుల దేవాలయం. ఇది క్షిప్రానది ఒడ్డున వెలసిన దివ్యక్షేత్రం. భోపాల్ నుంచి రావలసి వుంటుంది. ఢిల్లీనుంచి భోపాల్‌కు రైలు సౌకర్యం వుంది. రోడ్డు సౌకర్యం వుంది.

ఉజ్జయిని అనేక దేవాలయాల నగరంగా పేరుపొందింది. దీనినే 'అవంతి' అని కూడా పిలుస్తారు. కవిరాజు, రాజకవియైన భోజరాజుకూడా యీ ప్రాంతాన్ని పరిపాలించాడు. అతని ఆస్థానంలోని నవరత్న కవులలో 'కాళిదాసు ఒకడు – కాని అందరిలో ఇతడే ప్రసిద్ధుడు. కాళిదాసు కవితా ధారానగరమే ఉజ్జయినీ నగరమంటాడు. భోజరాజు పాలించిన ప్రదేశం 'ధారానగరం'. కాళిదాసు మహాకవికి ఉజ్జయిని కాళికాదేవి ప్రసన్నమై కవితాశక్తిని ప్రసాదించిందని ప్రచారం. భోజరాజు కవితా ప్రియుడు, స్వయంగా కవి. చంపూ రామాయణము వ్రాసింది యీ భోజరాజే. ఇదిగాక 'చారుచర్య' – కూడా వ్రాశాడని చెబుతారు. తనకు అమోఘమైన, అనితరమైన కవితాశక్తిని ప్రసాదించిన 'మహాకాళికాదేవిపైన అద్భుతమైన శ్లోకాలు, దండకం వ్రాశాడు కాళిదాసు. ఉజ్జయినీ నగరం గురించి – కాళికాదేవి గురించి ప్రశంసించాడు మేఘసందేశకావ్యంలో – మేఘాన్ని సంబోధిస్తూ – నీవు వింధ్యాపర్వతం చూచి, అక్కడి రేవానదిలో స్నానమాడి వింధ్యవాసిని కృపను పొందు. అవేగాక అక్కడ ప్రవహించే తపతీ, నర్మదానదుల సోయగాలు తిలకించి విదిశా నగరం సందర్శించు. అక్కడి నుంచి దశార్ణవదేశం చూడు. హంసలకు నిలయం అది కూడ చూచి కొంచెం ఉత్తర దిశవైపుగా ప్రయాణం చేయి. అక్కడ కనిపిస్తుంది. ఎత్తైన భవనాలతో, ఇంకా ఎత్తైన విమాన గోపురాలతో, విశాలమైన వీధులతో జనసమ్మర్దంతో కిటకిటలాడే ఉజ్జయినీ నగరం చూడు. అది అష్టాదశ శక్తిపీఠాలలో ఒకటైన "శక్తి పీఠం కాళికాలయం" దర్శించుకో. "వక్రః పంథా" కొంచెం చుట్టైనా తిరిగి వెళ్లు. ఉజ్జయిన్యాం మహాకాళీ", అనే శ్లోకంలో ఉజ్జయినిలో కాళికాదేవి గురించి వివరించాడు. ఉజ్జయినీ నగరం చుట్టూ 10 మైళ్లలోపు అనేక దేవాలయాలున్నాయి. ఉజ్జయినిని తప్పక చూడాలని కోరాడు కవి.



**"వక్రః పంథా యదసి భవతిః ప్రస్థితస్యోత్తరాశాం**
**సౌధోత్సంగ ప్రణయవిముఖోమానుభూర్యుజ్జయిన్యాం"**

దేవాలయాలకు, ఉన్నత భవనాలకు నిలయమైన దేశాన్ని అక్కడ ప్రవహించే క్షిప్రానదీ తోయములో క్రుంకులాడమని కాళిదాసు కోరికను యీ శ్లోకంలో వెల్లడించాడు. ఉజ్జయినీ మహాకాళేశ్వర లింగాన్ని ఎవరైనా ముట్టుకొని అభిషేకం చేయవచ్చు. దక్షిణాభిముఖంగా వున్న శివలింగం స్వయంభువు. పై అంతస్థులో ఓంకారేశ్వరస్వామి వెలసియున్నాడు. భక్తులు ప్రీతితో అర్చిస్తే సకల కోరికలు తీరుతాయని నమ్మకం.

**"అఖిలమును గూడి ఓంకారమయ్యె**
**పిదప క్రమముతో కుంభభవ! యకార ముకార**
**మును మకారంబు నగు వర్ణములును నాద**
**బిందువులు ధాత యగ్రమునందు నిలిచె"**

అకార ముకార మకార అనగా "అ+ఉ+మ" కలిపి ఓంకారం (ఓం) అయినట్లు చెబుతారు. ఇది ప్రణవము. ప్రణవాక్షరముతో నిరంతరము ధ్యానముచేయువారికి, మనోసిద్ధి – మోక్షము లభిస్తాయని పురాణగాథలు వివరిస్తాయి.

ఉజ్జయినిలో నవగ్రహాలతోపాటు, వినాయకుల దేవతామూర్తులను ప్రతిష్ఠించారు. ఇక్కడ నాగ చంద్రేశ్వరస్వామి అనే ఒక దేవాలయం వుంది, ప్రత్యేక పూజలు చేస్తారిక్కడ. మహాకాళేశ్వరాలయంలో ఎన్నో ప్రత్యేకతలున్నాయి. ప్రతిరోజు తెల్లవారు జామున 3 గంటలకు "చితాభస్మాభిషేకం" నిర్వహిస్తారు. నమకం – చమకం – వేదమంత్రాల మధ్య అత్యంతవైభవంగా మంగళహారతి జరుగుతుంది. భస్మలేపనంతో మెరిసిపోతున్న శివలింగ దర్శనం. ఒక అపురూప దృశ్యంగా భావిస్తారు భక్తులు. భస్మాంగుడైన శివుని దర్శన మంటే ఆధ్యాత్మిక భావజాలంతో మునిగిపోవడమే. ఇహం అంటూ ఏమీలేదని అంతా భస్మీభూతమే అంతా అశాశ్వతం అని చెప్పడమే యీ భస్మాభిషేక పరమార్థం అంటారు.

ఇంకో కథ యిలాగుంది – పూర్వము 'అమృత భాండంకొరకు దేవతలు, రాక్షసుల పెనగులాటలో అమృతభాండం నుండి నాలుగు బిందువులు తొణకి నేలమీద పడిపోయినవట. ఒక బిందువు ఉజ్జయినిలో, ప్రయాగ, నాసిక్ హరిద్వార్‌లలో మిగతా బిందువులు పడిపోవడం చేత యీ నాల్గు స్థలాలు – అమృత తుల్యములని. ఇక్కడి నదులలో స్నానం – అమృతస్నానమని స్థలపురాణ కథలు వివరిస్తున్నాయి. కనుక అంతటి పవిత్రక్షేత్రమైంది, ఉజ్జయిని.

ఉజ్జయిని ప్రత్యేకత గురించి మరోకథ ప్రచారంలో వుంది. దూషణుడు అనే రాక్షసుడు యీ ప్రాంతంలో వుంటూ అనేక మందిని, దారిలో పోయే వారిని, సాధువులను, మునులను బాధిస్తుండేవాడు. ఆ ఊరిలో నివసించే ఒక శివభక్తుడైన బ్రాహ్మణునితో ఊరిప్రజలు మొరపెట్టుకోగా, బ్రాహ్మణుడు శివునికై ఘోరతపస్సు చేశాడు. భూమిని చీల్చుకొని పెద్ద ధ్వనితో శివుడు ప్రత్యక్షమై దూషణుని సంహరించి, తిరిగి లింగరూపంలో వెలసి అదృశ్యమయ్యాడు. ఇక్కడ ఎవరైనా క్షిప్రానదిలో స్నానం చేసి, లింగ దర్శనం చేసుకున్నవారికి పది జన్మల పాపపరంపరలు మాయమైపోతాయని కథనం.



**హరసిద్ధి ఆలయం :** ఉజ్జయినిలో చూడతగిన స్థలం హరసిద్ధి ఆలయం. పూర్వం ఇదంతా అరణ్యం. రాక్షసులకు విడిది నేల. చండుడు – ప్రచండుడు అనే యిద్దరు రాక్షసులు. విపరీతమైన ద్రోహకార్యాలు తలపెట్టేవారు – దొంగతనాలు, దోపిడీలు, మానవ హత్యలు. దహనకాండ ఒకటేమిటి వీరు చేసే అకృత్యాలు లెక్కలేదు. ఒకరోజు పార్వతి పరమేశ్వరునితో వీళ్ల దుండగాల గురించి చెప్పింది. శివుడు ఆమె వంక చూసి, నవ్వాడు. ఈ పని చెయ్యాల్సింది నీవే అన్నట్లు. భర్త కోరిక మన్నించి, దుర్గారూపంలో బయలుదేరి వారిద్దరిని హతమార్చింది. శివుని కోరికను తీర్చిన చోటులో ఒక ఆలయం కట్టారు. ఇదే హరసిద్ధి ఆలయంగా ప్రసిద్ధి చెందింది. ఉజ్జయినిలో 10 అడుగుల ఎత్తుగల గణపతి విగ్రహంతో దేవాలయం ప్రక్కనే దుర్గామాత ఆలయం కూడా వుంది. ఇది అందమైన శిల్పాల నిలయం. పార్వతీ ఆలయంలో, వివిధ పార్వతీదేవి మూర్తులు చెక్కబడ్డాయి. హరసిద్ధి ఆలయానికి ఒక కిలోమీటరు దూరంలో హరగోపాల్ ఆలయం వుంది. ఇందులో శ్రీకృష్ణుని లీలలను తెలిపే చిత్రాలు, శిల్పాలున్నాయి. ఇదో అందమైన హరగోపాల మందిరం.

**సిద్ధ వటం :** క్షిప్రానదీ తీరంలో ఒక పాతకాలం నాటి రావిచెట్టు వుంది. దీనినే సిద్ధవటం అంటారు. కలియుగారంభం నుండి యీ చెట్టు వుందని. ఇది 20 అడుగుల ఎత్తు మాత్రమే వుంటుంది. ఇది చాలా పురాతనమైన చెట్టు. కోరిక కోరికలు తీర్చే భక్తుల కల్పవృక్షంగా వేరు పొందింది. క్షిప్రానదిలో స్నానంచేసి భక్తులు, యీ చెట్టుకు మొక్కుకుంటారు.

**సాందీపుని ఆశ్రమం :** ఇది సాందీపుడనే మునిపుంగవుని ఆశ్రమం. శ్రీకృష్ణ, బలరాములకు విద్యాక్షేత్రం. కంసుని వధించిన తర్వాత, బలరామ, శ్రీకృష్ణులు, మధుర నుండి. ఉజ్జయినికి వచ్చి, యిక్కడే గల సాందీపుని ఆశ్రమంలో చేరి, గురువుగారికి శుశ్రూష చేసి సకల విద్యలు నేర్చారు. శ్రీకృష్ణుని ప్రియమిత్రుడైన సుదాముడు కూడా యిక్కడే చదువుకున్నాడు.

వీరిద్దరికి మైత్రి కుదిరింది యిక్కడే. ఇలా వుంటుండగా గురువుగారి పుత్రుడు సముద్రంలో స్నానానికి వెళ్లి చనిపోగా గురువుగారి దుఃఖాన్ని శమింప చేసి, బలరామకృష్ణులు వెళ్లి, సముద్రుణ్ణి, యమధర్మరాజును ప్రశ్నించి, గురు పుత్రుని బ్రదికించి గురుదక్షిణ చెల్లించారని పురాణ కథ వుంది.

**కాలభైరవాలయం :** ఉజ్జయినికి ఊరిబయట అతి పురాతన "కాలభైరవాలయం వుంది. ఈ స్వామి మద్య ప్రియుడు. భక్తులు మద్యం సీసాలు కొని సమర్పించుకుంటారు. సీసా తెరచి స్వామికి నోటి ముందర ఉంచితే శబ్దం చేస్తూ క్షణంలో ఖాళీ చేస్తాడీ కాలభైరవుడు. ఇక్కడ దుకాణాలలో సీసాలు అమ్ముతారు – నిషేధం లేదు. ఇదే స్వామికి పానీయం, నైవేద్యం, ప్రసాదం.

ఇన్ని దేవాలయాలున్న ఉజ్జయినిలో అనేక ప్రత్యేకతలున్నట్లే దీనిని చార్‌ధామ్ అని కూడా పిలుస్తారు. నాలుగు దేవాలయాలు, నాలుగు విగ్రహాలు కలిసిన కూడలిని చార్‌ధామ్ అంటారు. ఇలాంటివి ఉత్తరాంచల్‌లో నేపాల్ వద్ద 'చార్‌ధామ్, వుంది. అలాగే పంచబదరీలు, పంచప్రయాగలు ఈ కోవకు చెందినవే. ఉజ్జయిని చార్‌ధామ్ కావడం కూడా ఒక ప్రత్యేకతే

**సూర్యదేవాలయం :** క్షిప్రానదీతీరంలో అతిపురాతనమైన, ప్రత్యక్ష భగవానుడైన సూర్యదేవాలయం ఉంది. 15వ శతాబ్దంలో ఖిల్జీ ధ్వంసం చేయగా, ప్రస్తుతం అవశేషాలు మాత్రం ఉన్నాయి. అయినా భక్తులు క్షిప్రాలో స్నానం తరువాత "సప్తాశ్వరథునికి ఆర్ఘ్యం యిచ్చి నమస్కరించుకుంటారు.

ఇలా ఒక్కచోట అనేక దేవాలయాలు వెలయడం యాత్రికులకు కన్నుల పండుగే. రైలు ద్వారా ఝాన్సిలో దిగి భూపాల్ మార్గంగా ఉజ్జయిని వెళ్లవచ్చు. భోపాల్, భోజపాలనగరమని భోజనగరమని చారిత్రకుల వాదన. ఎలాగైతేనేం సంస్కృత సాహిత్యానికి శిరోమణి, మేఘసందేశం, అభిజ్ఞాన శాకుంతలం, కుమార సంభవం, రఘువంశం వంటి కావ్యాలు వ్రాసిన మహాకవి



కాళిదాసుకు కీర్తి ప్రతిష్ఠలు తెచ్చిన భోజుని ఆస్థానం, చంపూ రామాయణకర్త భోజమహారాజు సంస్కృత కవితాసామ్రాజ్యానికే మకుటం లేని మహారాజు. ఆ ఇద్దరు మహానుభావులు నివసించిన యీ నగరం చూడడం అదృష్టమని భావించాలి. ఇక్కడ ప్రతిసంవత్సరం "ఉజ్జయినీ కాళిదాస సమారోహ్ ఉత్సవాలు జరగుతాయి.

## 17. శ్రీసోమనాథక్షేత్రం

ఇది ద్వాదశజ్యోతిర్లింగాలలో మొదటిది ప్రధానమైనది – 'సౌరాష్ట్రే సోమనాథం చ" – అని అంటారు. గుజరాత్‌లోని సౌరాష్ట్రం వద్ద భేట్ ద్వారకకు సమీపంలో వీరవల్ అనే ప్రదేశంలో "సోమనాథక్షేత్రం వుంది. ఇది అతి ప్రాచీనమూ, పురాణప్రసిద్ధము. స్కాందపురాణంలో యీ క్షేత్రం గురించి విపులంగా వుంది. ఈ క్షేత్రాన్ని చంద్రుడు బంగారంతోను, రావణుడు వెండితోను, శ్రీకృష్ణుడు చెక్కతోను నిర్మించినట్లు ప్రచారకథ. దీనికే ప్రభాసతీర్థం అని కూడా పేరుంది. పాండవులు యీ ప్రభాసతీర్థాన్ని దర్శించినట్లు చెబుతారు. ఇక్కడి శివలింగం భూగృహంలో అండాకారంలో (గుడ్డు ఆకారంలో) వుంటుంది. చాలా శక్తివంతమైనది – చూడడానికి వీలుకానంత ప్రకాశవంతంగా వుంటుంది. కనుక ప్రభాసలింగం, ప్రభాసతీర్థం అంటారు.

**శ్రీకృష్ణచరిత్ర :** ఇది భేట్‌ద్వారకకు సమీపంలోని క్షేత్రం. ఇక్కడ 'శ్రీకృష్ణ నిర్యాణం' జరిగిన చోటని, ఆయన ఆనుకుని పడుకొన్నవృక్షం యిప్పటికీ ఉన్నదని చూపిస్తారు. ద్వాపర యుగాంతమున శ్రీకృష్ణుడు తన అవతారం చాలించిన స్థలంగా, గోపికలతో సరససల్లాపాలాడిన జలాశయం యిక్కడే వున్నట్లు చెబుతారు. పరమశివుడు అండాకారంలో ఉండడం విశేషం ఈ భువన భాండాలన్ని అండంతో సమానమని "పూర్ణమిదం, పూర్ణమదశ్శాంతి" – అనే మంత్రంలో చెప్పి సమస్త జగత్తులకు, అంతర్, బహిశ్చ రూపాలేవీ లేవు. అండం యొక్క బయటంతా శూన్యమని దీని అర్థం. ఈ స్వామి భూగర్భ గృహంలో వుంటాడు. ఆలయంపై భాగాన, గర్భగుడిలో వేరే ఒక శివలింగం ప్రతిష్ఠ చేయబడింది – తరచుగా దండయాత్రలవల్ల భూగర్భలింగానికి క్షతిగాకుండా, మరొకలింగాన్ని పైన ప్రతిష్ఠించారు. దేవాలయం దక్షిణభాగాన సముద్రపు అలలు తగులుతుంటే, స్వామికి జలాభిషేకం చేస్తున్నట్లు భావిస్తారు భక్తులు.



**సోమనాథుని కథ :** ఈ క్షేత్రానికి 'చంద్రునితో సంబంధం వున్న కథ ఒకటి ప్రసిద్ధమైనదే – ఇది పురాణాంతర్గతం కూడా. దక్షప్రజాపతికి 27 మంది కూతుళ్లు – దక్షుడు 27 మందిని చంద్రుడికిచ్చి వివాహం చేశాడు. చంద్రుడు రోహిణిపై ఎక్కువ అనురాగం చూపిస్తూ – మిగతా భార్యలను నిర్లక్ష్యం చేశాడు. ఈ సంగతి దక్షునికి తెలియగా, వచ్చి అలాచేయరాదని హితవు చెప్పాడు. ఎన్నిమార్లు చెప్పినా చంద్రుని వైఖరిలో మార్పురాకపోవడం వల్ల కోపించిన దక్షుడు, చంద్రుణ్ణి క్షయవ్యాధి గ్రస్తుడవై పోదువని శపించాడు. మనస్తాపం చెందిన చంద్రుడు మామగారిని శాపం ఉపసంహరింపమని ప్రార్థించాడు. శాప ఉపసంహారం నావల్ల కాదని, శివుని వల్లనే జరుగుతుందని చెప్పాడు. వెంటనే యీ ప్రభాసతీర్థానికి వచ్చి శివుణ్ణి వేలసంవత్సరాలు తపస్సుచేయగా, శివుడు ప్రత్యక్షమై, మీ మామగారి శాపాన్ని పూర్తిగా తొలగించలేను కాని ఒక వరం యిస్తాను. నెలలో 15 రోజులు కాంతివంతంగా, 15 రోజుల క్షయ తరిగిపోతూ వుంటావని విరుగుడు చెప్పాడు. చంద్రుడు తృప్తిచెందక బ్రహ్మగురించి తపస్సు చేశాడు. చంద్రుని కారణంగా భూగర్భ శివలింగాన్ని స్పర్శించడంవల్ల యిది స్పర్శలింగం అయింది. భూగర్భంలోని అండాకార లింగాన్ని బ్రహ్మవెలుపలికి తీయగా, చూడడానికి శక్యంగాని వెలుతురు ప్రసరించిందట. పైగా లింగము తేనెలో నిండియుందట. పైన దర్భలున్నాయట. లింగం బయటకు తీయ్యరాదని బ్రహ్మనిశ్చయించి, ఆ లింగాన్ని అలాగే వుంచి, దర్భలతో ముంచి పైన ఒక పెద్దశిలతో కప్పినాడట – ఆ శిలనే బ్రహ్మశిల అంటారు. బ్రహ్మ చంద్రునితో, నీకా శాపం వరంగా వుంటుంది అని చెప్పి అదృశ్యమయ్యాడు. చంద్రుడు (సోముడు) పూజించి, బంగారు గోపురాలు, కట్టడాలు కట్టించినందువల్ల, యిది సోమనథ క్షేత్రమైనదని స్థలపురాణం.

**నిర్మాణాలు – ధ్వంసాలు :** ప్రసిద్ధమైన యీ దేవాలయానికి అనేకమంది నిర్మాణాలు చేసినా, అంతే రీతిలో, నష్టంకూడా జరిగింది – గుజరాత్ పాలించిన అనేక పాలకులకు ఈయన కులదైవం. అందుచేత, అనేక

భవనాలు, వెలకట్టలేని ఆభరణాలు, చెప్పలేనన్ని ఆస్తులున్నాయి. క్రీ.శ.1025లో మనదేశం మీదికి దండెత్తి వచ్చిన ఘజనీమహమ్మద్, యీ ఆలయ ప్రసిద్ధి విని, స్వామియొక్క ఆభరణాలు కొల్లగొట్టి, గుడిని ధ్వంసం చేశాడు. ఆ వెంటనే గుజరాత్ ప్రభువు భీమదేవుడు గుడిని పునర్నిర్మించాడు. చివరిసారిగా ఔరంగజేబుచే ధ్వంసం చేయబడింది.

క్రీ.శ.1783లో – ఇండోర్‌ని పాలించిన రాణి అహల్యాబాయి, ధ్వంసం చేయబడిన ఆలయానికి ఎదురుగా వేరే ఆలయం కట్టించింది. అప్పటికి మహమ్మదీయుల ప్రభావం తగ్గిపోవడంవల్ల, ఆ క్రొత్త గుడి నిలిచింది. పాతగుడిలోనికి అందరికీ ప్రవేశమున్నది. కాని యీ క్రొత్త గుడిలోనికి ప్రవేశంలేదు. స్వాతంత్ర్యానంతరం అప్పటి ఉపప్రధాని సర్దార్‌వల్ల భాయిపటేల్, పాత గుడిని అభివృద్ధి చేయగా, ఆదినుంచి యిక్కడ బ్రహ్మశిల ఉన్నచోటే, మరో లింగాన్ని ప్రతిష్ఠ చేసి, అప్పటి రాష్ట్రపతి డా॥ రాజేంద్రప్రసాద్ చేత ప్రారంభోత్సవం చేయించారు.

సోమనాథ్‌క్షేత్రానికి 5 కి.మీ దూరంలో "దేహోత్సర్గ" అనే ప్రదేశంలో శ్రీకృష్ణుడి అంత్యక్రియలు జరిగాయని, అర్జునుడే ఈ దహన క్రియ నిర్వహించాడని చెబుతారు. ఇక్కడే బలరాముడు, కొండ గుహలోనికి వెళ్లి అదృశ్యమయ్యాడు.

భక్తులు అచ్చటి పాలక ప్రభువులు శ్రీకృష్ణుని అంత్యక్రియలు జరిగినచోట, శ్రీకృష్ణ మందిరాన్ని నిర్మించారు. ఇక్కడి దేవాలయంలో శ్రీకృష్ణుడు బోధించిన 18 అధ్యాయాల 'భగవద్గీతను' – 18 చలువరాతి పలకాలపై చెక్కించినారు.

సోమనాథ్ నుండి 10 కి.మీ. దూరంలో "బాలకతీర్థం" వుంది. ఇందులో కవిల, హిరణ్య, సరస్వతి – మూడు నదుల సంగమస్థలాన్ని శ్రీకృష్ణనిర్యాణ స్థలంగా గుర్తించారు . ఈ విధంగా అనేక ప్రత్యేకతలు కల "సోమనాథ క్షేత్రం సందర్శనం, జీవితానికి మోక్షప్రాప్తినిస్తుందని స్థలపురాణం చెప్పడం వలన యిది ఎంతో ఖ్యాతి చెందింది.



# 18. కాంచీపురం - కంచి

భారతదేశంలో ప్రసిద్ధమైన ఏడు మోక్ష స్థలాలు చెప్పబడినవి. "అయోధ్య మధుర మాయా, కాశీ కాంచీ అవంతికాపురి, ద్వారవతీచైవ సప్తైతే మోక్షదాయికా" అని. వాటిలో ఉత్తరాన కాశీనగరమెంత ప్రశస్తి చెందిందో, దక్షిణాన కంచీపట్టణం కూడ అంతే ప్రశస్తి కలిగివుంది. ఇక్కడ, విష్ణుకంచి, శివకంచి, స్థలాలున్నాయి. 5000 మంది పట్టు నేత కార్మికులతో పట్టు వస్త్రాలకు కూడా కంచి ప్రపంచప్రఖ్యాతి గాంచింది. కంచిలో కామాక్షి, మధురలో మీనాక్షి, కాశిలో విశాలాక్షి అమ్మవారు, యీ దేశానికి దీవనలందిస్తున్నారు. వారి అవ్యాజ కృపాకటాక్షశ్రీల వల్లనే దేశం శాంతి, సుభిక్షాలతో వర్ధిల్లుతుంది.

కాంచీపురం మహాపవిత్రం, మహాప్రాచీనగరం, చెన్నైకి 70 కి.మీ. దూరంలో, యించుమించు తిరుపతికి కూడా అంతే దూరంలో వుంది. కంచిలో అనేక దేవాలయాలున్నాయి. ఇక్కడే ఆదిశంకరులు స్థాపించిన, మూలామ్నాయ కంచి పీఠం వుంచి. ఇది కంచి కామకోటి పీఠాధిపతుల ఆశ్రమనివాసం. కంచిపరమాచార్యులు యిక్కడనుంచే ఆధ్యాత్మిక ప్రసంగ ప్రసారాలయ్యాయి. ఆయనే ఒక ఆధ్యాత్మిక హిమాలయ శిఖరం.

కంచి కామకోటి పీఠంవారు, దేశంలో అనేకచోట్ల మాధవ దేవాలయాలు, మానవ దేవాలయాలు (Hospitals) నిర్మించారు. ఇందులో శివాలయాలు, విష్ణు ఆలయాలూ ఉన్నాయి. కంచి కామకోటి పీఠం ఇంజనీరింగ్ కళాశాలలు, పాఠశాలలు టెక్నికల్ కళాశాలలు కూడ నడుపుతుంది. అనేక, ధార్మిక ఆధ్యాత్మిక కార్యక్రమాలు నిర్వహిస్తూ – పవిత్రమైన స్థలంగా పేరు పొందిన శ్రీకంచికామకోటివారి పీఠాన్ని దర్శించవచ్చు కంచిలో.

కాంచీపురానికి సమీపంలో బంగాళాఖాతం తీరాన, చూడతగ్గ చారిత్రకస్థలం మహాబలిపురం – ఇది పల్లవరాజుల కళా నిర్మాణచాతుర్యానికి

తార్కాణం. కంచికి వచ్చిన యాత్రికులు తప్పకుండా చూచివెళ్తారు. అంతేకాకుండా ఈ జిల్లాలో వేడన్‌తాంగళ్ – అనే పక్షుల సంరక్షణ కేంద్రం వుంది. మహాబలిపురానికి 14 కి.మీ దూరంలో మొసళ్ల పెంపక కేంద్రంకూడా వుంది. ఇవన్నీ దర్శనీయస్థలాలే.

కాంచీపురం జనాభా 2001 సంవత్సరం ప్రకారం 15,984 అందులో 50% పురుషులు, స్త్రీలు 50%. కాంచీపురం అక్షరాస్యత 75%. ఇది సగటు భారతదేశ అక్షరాస్యత కంటె ఎక్కువ. ఈ జిల్లాలో సుమారు 689 గ్రామాలున్నాయి. ఇక్కడ సముద్ర తీరప్రాంతం కనుక సగటు కన్న వర్షపాతం ఎక్కువ –

కంచిలో ప్రధాన దేవాలయాలు రెండు. ఒకటి శివకంచి. రెండవది విష్ణుకంచి.

**శివకంచి చరిత్ర**

**పుష్పేషు జాతీ – పురుషేషు విష్ణుః**
**నారీషు రంభా – నగరేషు కాంచీ"**

కనుక పుణ్యనగరాలలో కంచి ఒకటి. కంచి మధ్యయుగంలో ప్రసిద్ధి చెందిన నగరం. చైనా యాత్రికుడు హుయాన్ సాంగ్, యీ నగరాన్ని చూచి ఆశ్చర్యపోయాడట. ఇక్కడి విశాలమైన దేవాలయ ప్రాంగణాలు, ఎత్తైన గోపురాలు, భక్తి ప్రపత్తులతో దర్శించే యాత్రికుల రద్దీ, మహాబలిపురంలోని పల్లవ ప్రభువుల శిల్పకళాపోషణ వంటి విషయాలను ఆసక్తికరంగా వ్రాశాడట. 4వ శతాబ్దం నుంచి 9వ శతాబ్దం వరకు పల్లవ రాజుల ఏలుబడిలోవున్న కాంచీపట్టణం శోభాయమానంగా వెలిగిపోయింది. కంచిని పాలించిన పల్లవరాజు మహేంద్రవర్మ గొప్ప సాహితీ వేత్త. ఇక్కడి ప్రజలు ధైర్యవంతులని చురుకు గలవారనీ ప్రశంసించాడట. గౌతమ బుద్ధుడు కూడా సందర్శించిన ప్రాంతంగా చారిత్రకులు వ్రాశారు.



కాశీనగరంలో వలె, విద్యావంతులు, పండితులు, ఆగమవేత్తలు, విద్వాంసులకు నిలయం కాంచీనగరం. పల్లవరాజుల తర్వాత చోళులు పదవశతాబ్దం నుండి 13వ శతాబ్దం వరకు పాలించగా, తరువాత 17వ శతాబ్దం వరకు విజయనగర రాజుల పాలనలో కీర్తి ప్రతిష్ఠలు పొందిందీ నగరం. స్వయంగా శ్రీకృష్ణదేవరాయలు యీ క్షేత్రాన్ని సందర్శించారు. శివకంచికి, విష్ణుకంచికి భూరివిరాళాలు సమర్పించాడు. హిందువులు, జైనులు, బౌద్ధులకు కూడా యిది గొప్ప తీర్థస్థలం, అన్నిటిని మించిన శివక్షేత్రం.

ఇక్కడి అధిదేవత 'కామాక్షి' అమ్మవారు అంటే పార్వతీదేవియే – మోక్షవిద్యకు మూలక్షేత్రం కంచి. అద్వైత విద్యకు ఆధారభూమి ఆదిశంకరులు కామాక్షి పీఠాన్ని ఏర్పాటు చేశారు. ఇక్కడే అమ్మవారి సన్నిధిలో చాలాకాలం పాటు ధ్యాననిమగ్నులైయున్నారు. వారు ఏర్పాటు చేసిన యీ శక్తిపీఠం, ఆధ్యాత్మిక భావాలకు కేంద్రస్థానం. ఇక్కడ చూడ తగిందీ – అతిముఖ్యమైనది శ్రీఏకాంబరేశ్వరాలయం. ఏకామ్రేశ్వర ఆలయం అని కూడా అంటారు. ఇక్కడి మామిడి చెట్టు కో కథవుంది.

మామిడిచెట్టు యొక్క కాండాన్ని. అద్దాల పెట్టెలో ఉంచిన ఫోటో ఒకటి చూపిస్తారు. ఆ కాలంలోని మామిడి చెట్టుకు గల నాలుగు కొమ్మలు నాలుగు రకాల పండ్లను కాస్తుందట. మామిడి చెట్టు క్రింద వెలసిన దేవుడు కనుక ఏకాంబరేశ్వరాలయం. ఈ దేవాలయ ప్రాచీన వైభవాలను, గుడిలోపల చిత్రాలలో చెక్కారు. ఇక్కడి ప్రధాన దేవుడు శివుడు. దేవాలయానికి చుట్టు నాలుగు గోపురాలున్నాయి. ఒక్కొక్క గోపురం 57 మీటర్ల ఎత్తు. వేయిస్తంభాలు గల యీ దేవాలయంలో 1008 శివలింగాలు ప్రతిష్ఠింపబడ్డాయి. 3500 సం॥ క్రిందటి మామిడిచెట్టు యిక్కడ ప్రత్యేక దర్శనీయం. ఈ చెట్టు యొక్క పండును తిన్నవారికి సంతానం కలుగుతుందని నమ్మకం. చెట్టు మొదలును చూడలేము. ఫోటోలో తప్ప – యీ

పురాతనస్థానంలో, దేవస్థానం వారు మరోమామిడి చెట్టును పెంచారు – అది కూడ దివ్యమైన పండ్లను ప్రసాదిస్తుంది–

**కామాక్షీ దేవాలయం :** కంచికి కామాక్షియే అధిదేవత. ఆమె పార్వతీదేవియే. కామాక్షీదేవి విగ్రహం యోగముద్రలో పద్మాసనంలో వుంటుంది – ఆమెది ప్రసన్నమైన రూపము. ప్రవహించే దయాగుణంకల కామాక్షీమాతను దర్శించినవారికి ముక్తి తప్పదని ఆధ్యాత్మికులు చెబుతారు. శాంతిని, సుభిక్షాన్ని ప్రసాదించే మాత – అఖిలాండేశ్వరి యీ కామాక్షి అమ్మవారికి నాలుగు చేతులు – క్రింది హస్తాలలో చెరుకుగడ, తామరపుష్పాన్ని, చిలుకను, అంకుశాన్ని పై చేతులలో ధరించి వుంటుంది. పాడిపంటలకు, సంతోషానికి, భాషావైదుష్యానికి ప్రతీకలైన చిహ్నాలతోపాటు, శత్రు సంహార కారకమైన 'అంకుశాన్ని ధరించి లోకానికి శాంతిని ప్రసాదిస్తుంది అమ్మవారు. కంచిలో కామాక్షి అమ్మవారి దేవాలయం చాల ప్రసిద్ధమైంది. అమ్మవారిని రాజరాజేశ్వరీ దేవిగా కూడా చెబుతారు.

అమ్మవారు ప్రసిద్ధమైన మామిడిచెట్టు క్రింద, మట్టితో పరమేశ్వరుని ప్రతిష్ఠించి, ఈశ్వరుని పాణిగ్రహణం చేసిందని చెబుతారు. మొదట అమ్మవారు ఉగ్రరూపంలో బలులను తీసుకుంటుండగా, అదిశంకరులు అమ్మవారి ఉగ్రతను తగ్గించి శ్రీచక్రాన్ని ప్రతిష్ఠించారట. ప్రతినిత్యం శ్రీచక్రానికి పూజలు జరుగుతాయి. ఆదిశంకరులు, దేవిని ప్రార్థించి, ఈ స్థలాన్ని విడిచి వెళ్లవద్దని కోరడం చేత, ఉత్సవకామాక్షి, ప్రాంగణంలోని ఆదిశంకరుల అనుమతి తీసికొని వెళ్తుందట. కామాక్షిదేవి ప్రతిరోజు తెల్లవారు జాముననే, సుప్రభాతం, ఆరగింపు హారతియిస్తారు. తరువాత గోపూజ చేస్తారు. గోవుయొక్క పృష్ఠభాగం అమ్మవారి వైపు ఉంచి పూజానంతరం, తెరతీసి, హారతియిస్తారు. ఇది ప్రతిరోజూ జరిగే పూజావిధానం. అక్కడ బోర్డు పైన నిత్యార్చనా విధానాలు, సేవల గురించిన వివరాలు, యితర సదుపాయాలు, వసతుల గురించి వ్రాశారు. దేవాలయాధికారుల పర్యవేక్షణలో అన్ని సవ్యంగా జరుగుతాయి.



**విష్ణుకంచి :** ఇది 108 దివ్యతిరుపతులలో ఒకటి. ఇక్కడి స్వామి శ్రీవరదరాజస్వామి పెరుమాళ్. విశిష్టాద్వైతసిద్ధాంతప్రవక్త – భాష్యకారులు. జ్ఞాన దివాకరులైన శ్రీమద్రామానుజాచార్యులు సేవించి, యిక్కడే నివాసమేర్పరచుకొన్న దివ్యస్థలం. శ్రీవైష్ణవ క్షేత్రంగా అత్యంత వైభవంగా ప్రకాశించిన విష్ణుకంచిలో యీ వరదరాజస్వామి భక్త సులభుడు – ప్రసన్నుడు. క్రీ.శ.1053లో చోళచక్రవర్తులు ఆలయనిర్మాణం జరిపారని తెలుస్తుంది. ఈ దేవాలయం వైశాల్యం 23 ఎకరాలు. ఈ దేవాలయం మరో ప్రత్యేకత ఏమంటే బంగారు బల్లి, వెండిబల్లులు యిక్కడే వున్నాయి. ఈ బల్లులను తాకితే, బల్లిపడిన దోషం పోతుందని భక్తులు బల్లుల శిల్పాలను ముట్టుకుంటారు. దేవాలయప్రాకారంలోని కప్పులపై అనేక బల్లుల చెక్కిన శిల్పాలుంటాయి. దీనికో కథ వుంది.

ఒక ఇతిహాసం ప్రకారం ఒక ఋషి తన కుమారుణ్ణి, దేవతార్చనకు నీరు తీసికొని రమ్మనగా, అతడు తెచ్చిన పాత్రలో తెలియక ఒక బల్లిపడింది. తండ్రి చూచి కోపించి బల్లివి కమ్మని శపించాడట. కుమారుడు బాధపడి అనేక విధాలుగా ప్రార్థనచేయగా యిక్కడ బల్లిగా వెలసి, అతన్ని ముట్టుకుంటే, గౌళి స్పర్శదోషము పోతుందని తండ్రి చెప్పాడనీ అంటారు. ఆ విధంగా బల్లుల ప్రశస్తి అంతటా వ్యాపించింది. ఇక్కడ మరో విశేషం వుంది. ఆలయ ప్రాంగణంలోని ఆనందసరోవరంలో బంగారు తామరాకులుంటాయి. ఈ ఆనందసరోవరం మధ్యలో ఒక మండపం ఉంది. జలాంతర్భాగాన అత్తి చెక్కతో తయారైన విగ్రహాలుంటాయి. వీటిని 40 సం॥ ఒకసారి తీసి దర్శనానికి ఉంచుతారు. 1979 సం॥లో యీ విగ్రహాలను తీసారట. మళ్లీ 2019లో తీసి దర్శనార్థం బయట ఉంచుతారట ఈ విగ్రహాలనే 'అత్తి శ్రీవరదరాజ పెరుమాళ్ అని పిలుస్తారు.

ఈ దేవాలయ ప్రాకారాలు 11వ శతాబ్దంలో చోళచక్రవర్తుల చేత నిర్మింపబడ్డాయి. మొదటి కుళోత్తుంగ చోళుడు, విక్రమ దేవచోళుని తర్వాత

విజయనగర ప్రభువులచేత పునరుద్ధరించబడ్డాయి. ఈ దేవాలయంలో కూడ వేయిస్తంభాలున్నాయి. ఇతిహాసం ప్రకారం, కృతయుగంలో బ్రహ్మ – త్రేతాయుగంలో గజజేంద్రుడు, ద్వాపర యుగంలో బృహస్పతి, కలియుగంలో అనంతశేషుడు సేవించారని చెబతారు. ఆ దేవాలయం గురించి' హస్తిగిరి మాహాత్మ్యంలో వర్ణింపబడింది. దీనికే, హస్తిగిరి, కరిగరి అని పేర్లున్నాయి. ఈ స్వామి గుట్టపైన వెలిశాడు. ఇక్కడ మూలవిరాట్టుగా ఉన్న శ్రీవరదరాజ పెరుమాళ్ ఎత్తైన విగ్రహాలలో రెండవది. ఈ స్వామి వైభవాన్ని శ్రీమాన్ వేదాంత దేశికులు 'శ్రీవరదరాజపంచాశత్' అనే ప్రబంధ కావ్యంలో దివ్యంగా వర్ణించారు. ఇది 50 శ్లోకాలస్తోత్రకావ్యం. అందులో ఒక శ్లోకంలో వేదాంత దేశికులు యిలా చెప్పారు. వరదరాజ స్వామి యొక్క తేజస్సు గురించి

**18వశ్లో. "మోహాంధకార వినివర్తన జాగరూకే**
**దోషాదివాఽపి నిరతగ్రహ మేధమానే**
**తత్తేజసి ద్విరదశైలపతే విమృష్టే**
**శ్లాఘ్యేత సంతమన పర్వసహస్రభానోః"**

దీని అర్థం యిది –

సూర్యుడు ప్రకాశవంతుడు. – పగలు మాత్రమే కనిపిస్తాడు. రాత్రిపూట కనిపించడు. పైగా రాహుగ్రస్తదోషం కలవాడు. సూర్యుడు బాహిరమైన తిమిరాన్నే పోగొడతాడు. కాని మానవుని అజ్ఞాన తిమిరాన్ని పోగొట్టలేడు. ఈ వరదరాజ పెరుమాళ్‌కు పగలు రాత్రి అనే భేదం లేదు. ఇతనికి రాహుదోషం లేదు. కనుక ఈ స్వామి నిత్యప్రకాశవంతుడు. నిత్య తేజస్వి. తేజస్సు విషయంలో సూర్యుడు ఓడిపోయాడు. వరదరాజ పెరుమాళ్ జ్ఞానభాస్కరులు ముక్తిదాతలని శ్రీవేదాంత దేశికులు యిలా స్వామిని స్తుతించారు. ఈ స్వామిని పలుమార్లు – కరీశ – హస్తగిరీశ – కరిగరివాసా' అని సంబోధించారు. విష్ణుకంచిని కరిపురమని కూడా పిలుస్తారు.



మొదటిశ్లోకంలోనే

**"ద్విరద శిఖరిసీమా సద్మవాన్ పద్మయోనేః**
**తురగ సవన వేద్యాం శ్యామలో హవ్యవాహః**
**కలశజలధి కన్యావల్లరీకల్పశాఖీ**
**కలయతు కుశలం నః కోపి లావణ్య రాశీ"** అని

విష్ణుమూర్తికి లక్ష్మికి మంగళాశాసనం చేశారు.

కాంచీనగరం శైవవైష్ణవక్షేత్రంగా వర్ధిల్లుతున్న క్షేత్రం. శ్రీమహావిష్ణువు 'వరదహస్త విరాజితుడై – శ్రీమహాలక్ష్మి సమేతంగా వేంచేసి యున్న కొండను కరిగిరి, హస్తగిరిగా ప్రసిద్ధి పొందిన ఈ క్షేత్రాన్ని ఎందరో శ్రీవైష్ణవులు, పన్నిద్దరాళ్వార్లు సేవించిన పవిత్ర స్థలం. అన్నింటికన్నా వేంకటేశుని ఘంటావతారులైన వేదాంత దేశికులు వ్రాసిన శ్రీవరదరాజ పంచాశత్ కావ్యంలో ప్రతిచోట స్వామివారి అఖండవైభవం వర్ణింపబడింది. కంచిలో గరుడసేవ కూడా ప్రత్యేకమయినదే – స్వామిని విశేషంగా అలంకరిస్తారు. ఎక్కువ సమయం తీసుకునే అలంకార వైభవంతో స్వామి జగజ్జేగీయమానంగా వెలిగిపోతారు.

ఒక్కసారి కంచికి వెళితే – మనసంతా శివమయమైపోతుంది – మరోక్షణంలో విష్ణువుమయమౌతుంది. ఇక్కడి యాత్రికులను మంత్ర ముగ్ధుల్ని చేస్తుంది కామాక్షి అమ్మవారు. నిజంగా ఇది కైలాసమా! వైకుంఠమా అన్న భ్రాంతి కలుగక మానదు. ఆ క్షేత్రం ఔన్నత్యం ఒకసారి దర్శించి వస్తే తెలుస్తుంది. తిరుపతినుండి గాని చెన్నైనుండి గాని వెళ్లిరావచ్చు.

**శుభం**

## 19. అలంపురం

మహాశక్తివంతమైన 'జోగులాంబ' దేవత పార్వతీదేవి రూపమే. బ్రహ్మయే స్వయంగా ప్రతిష్ఠించినమూర్తియని ఈశ్వరుని పత్నిగావున బ్రహ్మేశ్వరియని, – స్వామికి బాలబ్రహ్మేశ్వరుడని పేర్లు కలవు. మహబూబ్‌నగర్ నుండి (50 మైళ్లదూరం)గాని హైద్రాబాద్ నుండి (200 మైళ్లదూరం)గాని ఆలంపురం చేరవచ్చు. కర్నూలు పట్టణానికి 20 కిలోమీటర్ల దూరాన తుంగభద్రానదీ ఆవలి తీరాన వెలసిన శక్తిపీఠం అల్లంపుర క్షేత్రం. ఇది అష్టాదశపీఠాలలో ఒకటిగా ప్రసిద్ధిపొందిన యీ క్షేత్రాన్ని, చాళుక్యులు పాలించారు. తర్వాత కాకతీయుల కాలంలో ఉజ్జ్వలంగా వెలసిన క్షేత్రరాజమిది.

**హలంపురం :** ఒకప్పుడు వ్యవసాయక్షేత్రం వ్యవసాయమే వృత్తిగాగల కృషీవలురున్న గ్రామంయిది. కేవలము హలవృత్తిగల గ్రామం కావున హలంపురం అనేపేరు క్రమంగా ఆలంపురం – అలంపురం అనీ అయిందని కొందరు చెబుతారు. ఇక్కడ ఎల్లమ్మ గ్రామదేవత కొలువై యున్నది కావున ఎల్లమ్మపురం అయిందని చెబుతారు.

భౌగోళికంగా యిది శ్రీశైలానికి పశ్చిమ ద్వారంగా భావించబడుతుంది. సిద్ధవటం, త్రిపురాంతకం, ఉమామహేశ్వరాలయాలు దక్షిణ, తూర్పు, ఉత్తరద్వారాలుగా వున్నాయి. ఇక్కడి దేవాలయంలో జోగులాంబ ప్రధానదేవత దక్షిణకాశిగా పిలువబడుతున్న యీక్షేత్రంలో అనేక శిల్పాలు, శివకథలతో కూడిన చిత్రాలున్నాయి. దీనికే హిమపురమని, శక్తిస్థలమని, బాల బ్రహ్మేశ్వరక్షేతమని పిలుస్తారు.

ఈ క్షేత్రంలో త్రికాల పూజలు జరుగుతాయి. ఈ క్షేత్రానికి దగ్గర్లోనే తుంగభద్రానది – కృష్ణా నదులసంగమ ప్రసిద్ధ క్షేత్రం, సంగమేశ్వర క్షేత్రం చరిత్రప్రసిద్ధి కాంచింది. వరదల తాకిడికి లోనైన ఈ ఆలయానికి భవిష్యత్తులో ముప్పు రాకుండా ఆలయంచుట్టూరా పెద్ద ప్రాకారం నిర్మింపబడింది. అది యీ నాటి మన ఇంజనీర్లు – శిల్పులు – శిల్పాచార్యుల ఘనతకు ఉదాహరణ. శ్రీజోగళాంబ ఆలయంకూడా కొంచలోపలికి జరిపి నూతనంగా పునర్నిర్మింపబడింది. జోగులాంబ ఉగ్రస్వరూపిణి. పూర్వం ఈ అమ్మవారిని ఒక కిటికీ రంధ్రం ద్వారా చూడవలసివచ్చేది. 2008లో స్థానికులు, శిల్పాచార్యులు, స్థపతితో సంప్రదించి, నూతన ఆలయనిర్మాణం చేశారు. అమ్మవారు పీఠాసన రూపంలో వుంటారు. కేశాలు గాలిలో తేలుతున్నట్లు. ఆ కేశాలలో తేళ్లు, గబ్బిలాలు కనిపిస్తాయి. ప్రధానంగా యోగులు మునులు మున్నగువారు ఉపాసించే దేవత కనుక "జోగులాంబ" అని పేరు వచ్చింది.



ఈ క్షేత్రంలో ఉగ్రరూపిణి అయిన జోగుళాంబ ఆలయమేగాక నవబ్రహ్మదేవాలయాలను బాదామి చాళుక్యులు నిర్మించారు. అవి 1. బాలబ్రహ్మేశ్వరాలయం, 2. కుమార బ్రహ్మేశ్వరాలయం, 3. అర్క బ్రహ్మేశ్వరాలయం, 4. విశ్వ బ్రహ్మేశ్వరాలయం, 5. వీర బ్రహ్మేశ్వరాలయం, 6. తార బ్రహ్మేశ్వరాలయం, 7. గురు బ్రహ్మేశ్వరాలయం, 8. స్వర్గ బ్రహ్మేశ్వరాలయం, 9. పద్మ బ్రహ్మేశ్వరాలయం. వీటిలో బాలబ్రహ్మేశ్వరాలయం పెద్దది. ప్రధానమయింది.

ఈ నవబ్రహ్మేశ్వరాలయాలలో కొన్ని శిథిలమైపోయాయి. కొన్ని పూజలందుకుంటున్నాయి. చాళుక్యప్రభువుల శిల్పకళావిన్నాణానికి ప్రతిబింబాలు అనతగిన శిల్పవిరాజమానస్వర్ణ, తారక, గురుబ్రహ్మేశ్వరాలయాలు నేటికి, తరిగిపోయిన శిథిల శిఖరాలతో చూపరులను దిగ్భ్రాంతికి గురి చేస్తాయి. ప్రధాన ఆలయంలో జోగులాంబ ప్రతిష్ఠింపబడింది. ఇప్పటికీ నిత్యధూప దీపార్చనలతో కళకళలాడుతుంది. శివరాత్రి పర్వదినంనాడు భక్తులసందడి ఎక్కువగా వుంటుంది. అర్చనలు, జాగరణ, భజనలతో అపరకైలాసంగా మారుమ్రోగుతుంది. ఈ ఆలయంలో ఇంకా కామేశ్వరీదేవి, గణపతి, కామాక్షి, శ్రీవేంకటేశ్వరస్వామి మూడు శిరస్సుల దత్తాత్రేయస్వామివారల ఉపసన్నిధులున్నాయి. బాలబ్రహ్మేశ్వరస్వామి వారికి ప్రతినిత్యం నమక చమకాలతో అభిషేకాలు

జరుగుతాయి. ఇక్కడ మరోదేవత ఎనిమిది చేతులు గల మాధవీశక్తి, తన హృదయాన్ని చీల్చి సీతారాముల్ని చూపిస్తున్న ఆంజనేయుడు, ఆ చెంతనే వీరభద్రస్వామి విగ్రహాలను చూసి భక్తులు, ఆరాధిస్తారు.

**సంతాన దేవత :** రేణుకాదేవి సంతానదాయిగా ప్రసిద్ధి చెందినది. దీనికి సంబంధంగల ఓ కథ వుంది.

ఒకప్పుడు జమదగ్ని – భార్య రేణుకాదేవి ఇక్క ఒక ఆశ్రమంలో ఉండేవారట. రేణుకాదేవి పతివ్రత. ప్రతిరోజు నదికి వెళ్ళి స్నానంచేసి యిసుకతో కుండను చేసి ఆ కుండలో నీటిని తెచ్చి భర్తకు పూజకు యిచ్చేది – ఇలా కొన్నేళ్లు జరిగాక, ప్రతిరోజు వలె, తుంగభద్రకు వెళ్లగా, ఆ ప్రాంతానికి చెందిన రాజుగారు, రాణులతో జలకమాడుతున్నారు. ఆ ప్రభువుయొక్క రాణుల వైభవాన్ని చూచి మనస్సు చలించిన రేణుకాదేవి, యథావిధిగా ఇసుకతో కుండ చేయగా అది కుదరలేదు. అందోళన చెందిన రేణుకాదేవి రిక్త హస్తాలతో రావడం చూశాడు. తన దివ్యదృష్టితో జరిగిన దంతా గ్రహించి తన చిన్న కుమారుడైన పరశురాముణ్ణి పిలిచి తల్లి తలనరికి తెమ్మన్నాడు. తండ్రిమాట జవదాటని పరశురాముడు అలాగే చేశాడు. తల్లి తలతెగిపడింది. కొడుకును ఏం వరం కావలో కోరుకొమ్మన్నాడు. తల్లిని బ్రతికించమన్నాడు. ఆమె అలాగే ఆలంపురానికి గ్రామ దేవతగా పూజలందుకుంటుంది. ఆమెను సంతాన దేవతగా పిలుస్తారు. ఆమె నిత్యజీవురాలు మరణం లేదు. ఇదే నా వరం అన్నాడు జమదగ్ని మహర్షి.

ఈ దేవత ఆనాటి నుండి యీనాటి వరకు తలలేని, మొండెముతో క్రింది భాగముగల దేవతను పసుపు కుంకుమలతో పూజిస్తే సంతానం కలుగుతుందని నమ్మకంతో మ్రొక్కుతారు. ఇలా జోగులాంబ అమ్మవారు, అనేక రూపాలతో అర్చింపబడుతున్న ఆలంపురం దేశంలోని 18 శక్తి పీఠాలలో ఐదవ శక్తి పీఠంగా పేరుపొందింది.



## 20. శ్రీరంగం

తమిళనాడు రాష్ట్రంలోని తిరుచిరాపల్లి జిల్లాలో, చెన్నైకి 337 కి.మీ. దూరంలో – తిరుచ్చి రైల్వేస్టేషనుకు 12 కి.మీ. దూరంలో శ్రీరంగక్షేత్రం ఉభయకావేరీ నదుల మధ్య ద్వీపంగా విరాజిల్లుతున్నది. ఊర్ధ్వ పుండ్రములు రెండునదులైతే, మధ్య శ్రీచూర్ణభాసితం ఈ శ్రీరంగక్షేత్రం. ఈ క్షేత్రంలో విశిష్టాద్వైత సిద్ధాంత ప్రవక్త జ్ఞాన భాస్కరులైన శ్రీమద్రామానుజాచార్యులు ఏర్పాటు చేసిన నిత్యకైంకర్య ఆరాధనానివేదనా పద్ధతులే జరుగుతున్నాయి. శ్రీరంగం, విష్ణు కంచిలో ఒకే విధమైన సంప్రదాయ విధులు జరగడం విశేషం. శ్రీవైష్ణవులకు యిది పరమోత్కృష్ట క్షేత్రం – సాక్షాత్తు దీనిని 'భూలోక వైకుంఠమని పేరు. ఆళ్వారులందరూ స్వామిని పలువిధాలుగా కీర్తించారు.

**శ్రీరంగనాథః శ్రీరంగే దివ్యసూరిభిరర్చితః**
**శ్రీమత్సుందర జామాత్రా నిచుళాపురనాయకః**

శ్రీరంగక్షేత్ర వైభవం యింతా అంతా కాదు. ఇది 108 దివ్యదేశ తిరుపతులలో ప్రథమగణ్యము. ఈ క్షేత్రం తర్వాతనే మిగతాక్షేత్రాలను చెప్పుకోవాలి. చెన్నైనుండి చేరవచ్చు. తిరుచ్చి రైల్వే స్టేషనులో దిగి వెళ్లవచ్చు. శ్రీరంగంలో అడుగుపెడుతూనే, యాత్రికులను ఆశ్చర్యపరచేది, అబ్బురపరచేది అత్యంత ఎత్తైన రాజగోపురం. దీని ఎత్తు 236 అడుగులు. 75 మీటర్లు వైశాల్యం 150 ఎకరాలు 7 ప్రాకారాలు. ఇంత వైశాల్యం గల పెద్ద దేవాలయప్రాంగణం ప్రపంచంలోనే లేదంటారు.

పవిత్రమైన కావేరీ తోయ శీకరాశ్రితచందనవాయుసంస్పర్శతో చల్లగా ఉండే శ్రీరంగనాథుని దివ్యమందిరం చూడడం జీవితంలో గొప్పభాగ్యంగా భావించాలి. శ్రీస్వామివారి అపూర్వవిమాన గోపురం చూడాలంటే తన ఆకాశంవైపే శిరస్సు మళ్లాలి. ఒకటి కాదు రెండు కాదు 236 అడుగులు. క్రమంగా ఒక్కొక్క ప్రాకారం దాటాలి. 7 ప్రాకారాలు దాటాలి. చివరగా

శ్రీరంగధాముని వైకుంతం ఒక్కొక్క ప్రాకారం మధ్య, ఇండ్లు దుకాణాలు, జనావాసం, వర్తక వ్యాపారస్థులు, బేహారీల కోలాహలం వుంటుంది. ప్రాకారాల చట్టు కొలత 4 మైళ్లు మొత్తం ప్రాకారాలలోపల 21 గోపురాలు 156 ఎకరాల విస్తీర్ణంలో అనేక సన్నిధులు ఉన్నాయి. ఆళ్వారుల ప్రపన్నతకు, ప్రబంధాలకు, శ్రీమద్రామానుజాచార్యుల ప్రబోధాలకు, ప్రవచనాలకు పట్టుగొమ్మ శ్రీరంగం. శ్రీరంగం ఉనికి ఈ శ్లోకంలో యిలా ఉంది.

**"కావేరీ పరిపూతపార్శ్వయుగళే పున్నాగసాలాంచితే**
**చంద్రాఖ్యాయుత పుష్కరిణ్యనుగతే రంగాభిధానేపురే**
**వైమానే ప్రణవాభిదే వేదాఖ్య శృంగోజ్జ్వలే**
**దేవం ధర్మదిశాముఖం ఫణిశయం శ్రీరంగనాథం భజే."**

ఉభయ కావేరీల పార్శ్వం గలది. పున్నాగచెట్ల గుంపులతో, చంద్రపుష్కరిణి గల, ఓంకార రూపంలో కనిపించే విమాన గోపురం, వేదములే శిఖరాలుగా వర్థిల్లుతూ, దక్షిణ దిశవైపు చూస్తున్న శ్రీరంగనాథ దేవునికి నమస్కారమని దీని యర్థం.

ఇన్ని గోపురాలతో విరాజిల్లుతున్న మండపంలో శ్రీరంగనాథుడు ఐదు తలల శేషునిపై శయనించి, భక్తుల హృదయాలను దోచుకుంటున్నాడు. లంకాధిపతి రావణుని సోదరుడైన విభీషణుడే, శ్రీరంగని ప్రతిష్ఠించి మండప నిర్మాణాలు చేసి స్వామిప్రత్యక్ష దర్శన సౌభాగ్యం కలిగించాడని పురాణప్రసిద్ధి. అలాగే భక్తులు ధర్మవర్మ – రవివర్మలకు సాక్షాత్కారం లభించింది. అధినాథుడు శ్రీరంగనాథుడు. అమ్మవారు గోదారంగనాయకి – శ్రీరంగనాథ గోదాదేవిల పరిణయగాథ, అనేక తమిళ ప్రబంధాలతో పాటు, తెలుగులో విజయనగర ప్రభువు శ్రీకృష్ణదేవరాయలు "ఆముక్తమాల్యద"లో చక్కగా వ్రాశాడు. శ్రీకాకుళాంధ్రమహావిష్ణువు రాయలకు (చిన్న శ్రీకాకుళం – కృష్ణాజిల్లా) కలలో కనిపించి, "రంగమందయిన నప్పిన్నది పరిణయగాథ" వ్రాయుమని



ఆదేశించగా, ఆ కావ్యం వ్రాసి, శ్రీమద్వేంకటనాథునికి తిరుపతిలో అంకితం చేశాడు. ఆ కావ్యంలో గోదారంగనాథుల కల్యాణకథ కమనీయంగా, రమణీయంగా, కవనీయంగా, స్తవనీయంగా వ్రాయబడింది. అందుకే శ్రీరంగనాథుని తలచినపుడల్లా కావేరీస్మరణ చేయాల్సిందే.

**"కావేరీ విరజాసేయం వైకుంఠం రంగమందిరం**
**స వాసుదేవో రంగేశః ప్రత్యక్షం పరమం పదం"**

అనగా కావేరియే విరజానది. శ్రీరంగమే వైకుంఠం. శ్రీరంగనాథుడే పరవాసుదేవుడు. ముముక్షుక్షేత్రం కల్పతరువే శ్రీరంగధాముడని అర్థం. ద్వాదశాళ్వార్లు యీ క్షేత్రాన్నే గొప్పగా కీర్తించారు. ప్రతి శ్రీవైష్ణవుడు ప్రాతః కాలనిత్యాను సంధానంలో శ్రీరంగాన్నే స్మరిస్తారు శ్రీమన్ శ్రీరంగశ్రియ మనుపద్రవామనుదినం సంవర్ధయ' అని శ్రీరంగం ఏ ఉపద్రవాలకు లోనుగాకుండా ప్రతి దినం, భక్తుల అర్చనారాధనలతో వర్ధిల్లాలని కోరుకుంటారు. "నాలాయిరం" దివ్య ప్రబంధంలోని నాలుగు వేల పాశురాలలో 247 పాశురాలు తిరువరంగం" (శ్రీరంగం)కు చెందినవే. శ్రీవైష్ణవుల పవిత్ర గురుప్రార్థన "శ్రీశైలేశ దయాపాత్రం"అనే శ్లోకాన్ని మణవాళ మహామునికి శ్రీరంగనాథుడే స్వయంగా ఉపదేశించాడని చెబుతారు.

పరమపదంలో పరవాసుదేవునిగా వేంచేసియున్న శ్రీమన్నారాయణుడు క్షీరసాగరంలో వ్యూహవాసుదేవునిగా ఆదిశేషునిపై శయనించియుంటాడు. ఈ వ్యూహ వాసుదేవమూర్తినుంచే, విభవావతారాలైన, శ్రీరామ కృష్ణాదులు, వామన, నృసింహ, బలరామ, పరశురామ, అవతారాలలో కనిపించి భక్తులను అనుగ్రహిస్తాడు. అదే విధంగా అర్చావతారానికి మూలము శ్రీరంగనాథుడు. ఎవరు ఏ ఆలయంలో ఏ గృహంలో విగ్రహాన్ని ప్రతిష్ఠించినా, అందులోని భగవచ్ఛక్తి శ్రీరంగనాథుని నుండే వస్తుంది. కనుక శ్రీరంగానికి ఏ ప్రమాదాలు రాకుండా సురక్షితంగా ఉండాలని ప్రతి శ్రీవైష్ణవుడు కోరుకుంటాడు.

భగవంతుడు వేంచేసియుండే ఆలయాలు నాలుగురకాలు. ఒకటి 'స్వయం వ్యక్తం'. రెండవది 'ఆర్షం'. మూడవది 'దివ్యం'. నాల్గవది 'మానుషం'. భగవంతుడు తానుగా వరించి తనంతటతానుగా వేంచేసిన స్వయంవ్యక్త స్థలాలు ఎనిమిది. అందులో మొదటిది శ్రీరంగం, రెండవది తిరుమల, మూడు శ్రీముష్ణం, నాలుగు తిరునీర్మలై. ఈ నాలుగు క్షేత్రాలలో స్వామి విగ్రహరూపంలోను, పుష్కరంలో తీర్థరూపంలో, నైమిశంలో వనరూపంలో, బదరికాశ్రమంలో పర్వత రూపంలో, సాలగ్రామంలో సాలగ్రామ రూపంలో స్వామి స్వయంగా వేంచేసి యుంటాడని పెద్దలు చెబుతారు. శ్రీవైష్ణవ సంప్రదాయంలో నాలుగుక్షేత్రాలకు అత్యంత ప్రాముఖ్యం ఉంది. ఈ నాలుగు వేదాల వంటివి. వానిలో అత్యంత ప్రధానమైనది 'కోయల్' అంటే శ్రీరంగం. దీనికి భోగమండపం అని పేరు. రెండవది తిరుమలై దీనికి పుష్పమండపం అని పేరు. మూడవది పెరుమాళ్‌కోయిల్ అంటే కాంచీపురం. దీనికి త్యాగమంటపం అని పేరు. నాల్గవది తిరునారాయణపురం దీనికి జ్ఞానమండపం అని పేరు. శ్రీరంగం సప్త ప్రాకార శోభితం. ఒక్కొక్క ప్రాకారంలో విభిన్న రూపాల దైవ సన్నిధులు దర్శనమిస్తాయి. ముఖ్యమైన ప్రాకారంలో గర్భాలయం ఉన్నది. దీనినే ధర్మవర్మ ప్రాకారం అంటాం. ఇది 240 అడుగులపొడవు – వెడల్పు 188 అడుగులు. ఇది సత్య లోకానికి సంకేతం. గర్భ గృహంలో శ్రీరంగనాథుడు శయనించియుంటారు. ద్వారపాలకులు, యాగశాల విరజాబావి, విష్వక్సేనుల సన్నిధి, చిలకల మండపం, కణ్ణన్ సన్నిధులు యీ ప్రాకారంలో వున్నాయి. ఇక్కడ శయనించియున్న మూర్తికి 'పెరియపెరుమాళ్' అని పేరు. ఉత్సవమూర్తికి నంబెరుమాళ్ అని పేరు. తురుష్కుల దాడిలో శ్రీరంగానికి క్షతి కాకుండా, ఉత్సవ విగ్రహాన్ని చంద్రగిరి ద్వారా తిరుమల శ్రీవారి ఆలయానికి చేర్చబడిందనీ, గర్భాలయాన్ని పెద్ద పెద్దబండలతో మూసివేసి ఆలయాన్ని రక్షించారని చెబుతారు. అలజడి తగ్గిన తర్వాత, మళ్లీ సుమారు 50 ఏళ్ల



తర్వాత తిరుమలనుండి యథాప్రకారంగా శ్రీరంగనాథుని ఉత్సవ విగ్రహం తిరుమలక్షేత్రం నుండి శ్రీరంగక్షేత్రానికి తరలింపబడి పూజింపబడుతున్నదని పెద్దలమాట! ఈ గర్భాలయానికి ముందుండే స్థలానికి చందన మండపం అంటారు. గర్భాలయ ప్రదక్షిణానికి తిరువణ్ణాళి ప్రదక్షిణం అని పేరు. ప్రక్కనే వున్న చిలకల మంటపం నుంచి చూస్తే విమానం ప్రణవాకారంలో కనిపిస్తుంది. అందుకే శ్రీరంగనాథుని గోపురాన్ని ప్రణవగోపురం అంటారు.

ఇక రెండవ ప్రాకారంలో "విరజా మండపం వుంది దీని క్రిందనే విరజానది ప్రవహిస్తుందంటారు. హయగ్రీవపెరుమాళ్‌కు, సరస్వతీ దేవిని సన్నిధులున్నాయి. అక్కడే 'ఉళ్‌కోడై' మండపం, దీనికే దొర మండపమని పేరు. నాల్గవది వేదవిణ్ణప్పమ్ – ఇదే ప్రబంధగోష్ఠి జరిగే మండపం. ఇక్కడే ఊంజల్ మండపం, ధ్వజారోహణ స్థలాలున్నాయి. ఇక మూడవ ప్రాకారానికి ఆలినాడన్ తిరువీధి అని పేరు. ఇక్కడే అతి పెద్ద గరుడాళ్వార్ సన్నిధి వుంది. దీని గురించి 'ఆముక్తమాల్యద'లో రాయలువారు వ్రాసిన పెద్ద గద్యలో గరుడుని విశేష వర్ణన వుంది. ఇది తప్పకుండా చూడ తగింది. ఈ ప్రాకారంలోనే, వాలి, సుగ్రీవులేకాక ప్రపన్న జనకూటస్థులైన శ్రీనమ్మాళ్వార్ల సన్నిధి వుంది. ఈ ప్రాకారంలోనే ఉగ్రాణముంది. మేల్ పట్టాభిరామన్ సన్నిధి, మొదలు ఆళ్వార్లు, చంద్రపుష్కరిణి, పున్నాగ వృక్షం, వేదవ్యాస సన్నిధి, వైకుంతనాథన్ సన్నిధులను చూడవచ్చు.

నాల్గవ ప్రాకారానికి "అకళంక నాట్టాళ్వాన్ తిరుచ్చి" అని పేరు. ఇక్కడే "కూరత్తాళ్వాన్" సన్నిధి కలదు. పరాశరభట్టర్ వారి సన్నిధిలో వారి పాదముల చెంత నంజీయర్‌వారు వేంచేసియున్న దృశ్యం చూడవచ్చు. ఇక్కడే శ్రీనాథ మునుల సన్నిధి, తర్వాత చూడ తగింది. శ్రీరంగవిలాసమంటపం వుంది. దీనిపై 'తిరుమంత్ర ద్వయం చరమశ్లోకం' అవతరించిన చిత్రం దృశ్యమానంగా వుంది. అఖిల జగన్మాతయైన శ్రీరంగనాచ్చియార్ (ఆండాళ్) సన్నిధి యీ ప్రాకారంలోనే వుంది. మీన మాసంలో ఉత్తరానక్షత్రంనాడు,

శ్రీరంగనాథుడు, రంగనాయకి ఒకే ఆసనంపై వేంచేస్తారు. ఆ సమయంలో 'శరణాగతి' గద్యం వినిపిస్తారు. ఇక్కడే వున్న వేయికాళ్ల మండపానికి తిరుమామణి మండపం అని పేరు. ఈ ప్రాకారంలో గల ప్రధానమైనది, తప్పక చూడవలసినది ఉడయవర్ సన్నిధి. ఇదే భగవద్రామానుజాచార్యుల సన్నిధి. ఇక్కడ రామానుజులవారు తానే స్వయంగా తిరుమేని 'చరమ శరీరం'తో వేం చేసి యున్నారు. ఈ తిరుమేనికి ఔషధీయుక్తమైన పసర్లు, యితర సుగంధ ద్రవ్యాలను పూస్తారట. మానవ శరీరానికివలె, వెంట్రుకలు, గోళ్లను చూడవచ్చు. ఈ సన్నిధి ప్రక్కనే వారి గురువు ఆళవందార్ (స్తోత్రరత్నమాల) సన్నిధి కూడా వుంది. శ్రీమద్రామానుజాచార్యులవారు శ్రీరంగని కోరికపై నాలాయిర ప్రబంధగానం చేయగా శ్రీరంగనాథుడు బాలుని రూపంలో వచ్చి విని ఆనందించారట. అదే సభలో శ్రీరంగనాథుడే స్వయంగా ఈ శ్లోకం చెప్పారట.

**"శ్రీశైలేశదయాపాత్రం ధీభక్త్యాది గుణార్ణవమ్**
**యతీంద్ర ప్రవణం వందే రమ్యజామాతరం మునిమ్"**

ఈ శ్లోకాన్ని ప్రతివైష్ణవుడు ప్రబంధ కాలక్షేపానికి ముందు అనుసంధిస్తాడు. శ్రీరంగని క్షేత్రంలో రామానుజులు ఎక్కువకాలం నివసించారు. వీరు శ్రీపెరంబూదూరులో క్రీ.శ.1017లో జన్మించి 120 సం॥ జీవించి క్రీ.శ. 1137లో పరమపదం చెందారు. వీరు నిరంతరం శ్రీరంగపాదసేవా పరాయణులు. ఇక్కడే వరదరాజస్వామి, విఠల్ కృష్ణన్ సన్నిధులు కూడా వున్నాయి.

ఈ క్షేత్రం నుండి పిళ్లైలోకాచార్యులు "శ్రీవచన భూషణం" వ్రాశారు. పరాశరభట్టర్ "రంగరాజ స్తుతి". వేదాంతదేశికుల "పాదుకాసహస్రం" వంటి స్తోత్రకావ్యాలు వెలువడ్డాయి. ఇది తమిళవేద, సంస్కృత వేద సాహిత్య నిలయం. ఉభయ వేదాంత పండిత ప్రకాండమండలికి విశిష్టాద్వైతసిద్ధాంత ప్రపంచానికి కేంద్రభూమి. శ్రీరంగం దర్శనం అంటే మోక్ష ప్రాప్తియే.



ఇక్కడి నుండి వెల్లివిరిసిన భక్తి సాహిత్యం – ఆ సాహిత్యకర్తల వివరాలు

1. శ్రీమద్రామానుజాచార్యుల బ్రహ్మ సూత్రాలకు భాష్యం గద్యత్రయం – శ్రీ భాష్యం వేదార్థ దీపిక, శరణాగతిగద్య, వేదార్థ సంగ్రహం.
2. నమ్మాళ్వార్ – తిరువాయ్‌మొళి
3. గోదాదేవి – తిరుప్పావై
4. పెరియాళ్వార్ – తిరుప్పళ్లి ఎళుచ్చి
5. తొందరడిప్పొడి యాళ్వార్ – తిరుమాలై
6. తిరుప్పాణియాళ్వార్ – అమలనాదిపిరాన్
7. శ్రీపరాశరభట్టర్ – 1. శ్రీరంగరాజ స్థలం
   2. గుణరత్న కోశం
8. పిళ్లైలోకాచార్యులు – శ్రీవచన భూషణం
9. వేదాంతదేశికులు – పాదుకాసహస్రం
10. కంబమహాకవి – కంబరామాయణ కావ్యం
11. స్తోత్రరత్నం – కాంతా చతుః శ్లోకి ఆళవందార్ (యమునాచార్య)
12. కూరత్తాళ్వార్ – శ్రీస్తవం
13. శ్రీవేదాంతదేశికులు – శ్రీస్తుతి, అభీతిస్తవం భగవద్ధ్యానసోపానం, శ్రీస్తుతి న్యాస తిలకం,
14. శ్రీఆదిశంకరాచార్యులు – శ్రీరంగనాథాష్టకం
15. కులశేఖరాళ్వార్ – ముకుంద విలాసం.

## 21. తిరుపతి

భారతదేశంలోకెల్ల ప్రసిద్ధమైన క్షేత్రం తిరుపతి. ఇది ఆంధ్రప్రదేశ్‌లోని చిత్తూరు జిల్లాలో వున్న అతి ప్రసిద్ధమైన, పౌరాణిక, చారిత్రక, నేపథ్యంగల క్షేత్ర రాజము. ఈ తిరుపతి దీనిని తిరుమల ఏడుకొండలు, సప్తగిరి, వృషాద్రి, అంజనాద్రి, వేదాద్రి, నీలాద్రి, శేషాద్రి, వరాహాద్రి యిలా అనేక పేర్లతో పిలువబడే యీ క్షేత్రాన్ని మించిన క్షేత్రం లేదంటారు. క్షేత్ర ఆధినాయకుడు, జగదారాధ్యుడు వాసిష్ఠ, సనక సనందాదులచేత దేవతలచేత నిత్యం – ఆరాధింపబడుతున్న శ్రీపద్మావతీ, అలవేలుమంగా సమేత శ్రీవేంకటేశ్వరస్వామి. ఏడుకొండలవాడా! యని సప్తగిరివాసా! యని భక్తులు కీర్తిస్తారు. స్వామి వైభవము, ఇంతా అంతా కాదు. వీరి వైభోగము నిత్యకల్యాణము – పచ్చతోరణము, ప్రతిరోజు స్వామివారికి కల్యాణం జరుగుతుంది. ఈ కల్యాణోత్సవము భక్తుల సమక్షంలో జరుగుతుంది. ప్రతివారికి స్వామివారి అనుగ్రహప్రాప్తి కొరకు, దేవస్థానం వారు, నిత్యార్చనలతోపాటు నిత్యకల్యాణం చేయిస్తారు. అపూర్వతేజో విరాజమానమైన స్వామివారి కల్యాణకాంతులు కమనీయమై, నయనానందకరమై వ్యాపిస్తాయి.

**వందే నీలోత్పలస్య శశినం**
**శేషాచలాధీశ్వరమ్**
**బ్రహ్మాద్యర్చిత పాదపద్మ యుగళం**
**లోకైక నేత్రోత్సవం**
**వాసిష్ఠైః సనకాది భిర్మని గణైః**
**సంసేవితాస్సదైః**
**భక్తా నామాధి కార్థ దాయినమహం**
**శ్రీవేంకటేశం గురుమ్** – అని

స్వామిని ఒకసారి తలచినా చాలు. స్మరణాన్ముక్తిః అన్నది నిజమౌతుంది.



స్వామివారి మూలవరులకు నవనీతహారతి, విన్న పాలుంటాయి. నిత్యపంచాంగ శ్రవణము. ఆదాయవ్యయ వివరాలపట్టిక చదివి వినిపిస్తారు. మొదట మొదట సహస్రనామార్చన – ఉదయమే – బలిహరణము శాత్తుముఱై – సర్వదర్శనము – శుద్ధి – అష్టోత్తరనామార్చనము – మాధ్యాహ్నిక నివేదనము – సాయంకాలం దీపారాధనము – ఊంజల్ సేవ – మొదలగు ఎన్ని రకాల ఆరాధనలో చెప్పలేము. అందుకే ఈ స్వామిని ఉత్సవాలదేవుడంటారు. ఇవేగాక, తీర్థోత్సవాలు పుష్కరిణీ ఉత్సవం, కుమారధార తీర్థోత్సవం, తుంబుర రామకృష్ణ, జాబాలి తీర్థోత్సవాలు చూడవలసిందే.

**వాహనాలు :** శ్రీనివాసుని వైభవమేమి చెప్పాలి. సర్వలోకైక రక్షకుడు నిరంతరం క్షీరాబ్ధిలో యోగ నిద్రాముద్రాభిరాముడై, ఆదిశేషపర్యంకవిలాసియై ప్రభుత్వము నిర్వహించే సర్వరక్షాదక్షుడు – చిటికె మాత్రంలో సృష్టి, స్థితి, లయ కార్యనిర్వహణా సామర్థ్యం గల జగదేక చక్రవర్తి – కనుసన్నలలో లోకమర్యాదలు జరుగుతాయి. ఆనపాయినిగా లక్ష్మీదేవి, కౌస్తు భోరస్థయై వుండగా, భక్తులందరిని బిడ్డల్లాగా పోషిస్తూ, కలియుగంలో శ్రీదేవి, భూదేవీ సమేతుడైన ఆప్తశిఖామణి – దైవమణి – శ్రీవేంకటేశ్వరుడు. శ్రీనివాస వల్లభుడు–

**ఉత్సవాలే ఉత్సవాలు :** కృతౌ రంగనాథస్య త్రేతాయాం రఘునందనం, ద్వాపరే కృష్ణదర్శనం కలౌ వేంకటనాయకః – అన్నట్లుగా, కలియుగాంతం వరకు నిలిచే, భక్తులను అనుగ్రహిస్తానన్నాడు ఆయన భక్తులకు కొంగు బంగారం. అడిగిన వరాలనిచ్చే ఆప్తబాంధవుడు. పాప సముదాయాన్ని సంహరింపజేసేవాడని కీర్తి పొందిన శ్రీశ్రీనివాసుని నిరంతరం పద్మావతీ దేవి ఆనపాయినిగా వుంటూ కాపాడుతూ వుంటారు. స్వామివారికి ఉత్సవాలు ఎన్నో – నిత్యోత్సవ, వారోత్సవ, పక్షోత్సవ, మాసోత్సవ, వార్షిక బ్రహ్మోత్సవాలు తప్పకుండా నిర్వహించవలసినవే – ఇవిగాక, దసరా, ఉగాది, శ్రీరామనవమి, గోకులాష్టమి వంటి పండుగలలో ప్రత్యేక ఆరాధనా

ఉత్సవాలు, కైంకర్యాలు, సేవలు జరుగుతాయి. తెల్లవారుజామున సుప్రభాతం నుండి శయనోత్సవం వరకు వివిధ రకాల స్తోత్ర పారాయణం, అర్చనావిధులు జరుగుతాయి. మేలుకొలుపు పాటలు, అన్నమయ్యగారి కీర్తనలతో స్వామివారికి ప్రభాత సేవలుంటాయి. సరిగ్గా సుప్రభాత సమయంలోనే అన్నమయ్య వంశీకులు తంబురామీటుతూ మేలు కొలుపు పాడుతారు.

**మేదిని జీవుల గావ మేలుకోవయ్యా**
**నీదయే మాకు రక్ష నిద్ర మేలుకోవయ్యా**

అని పాడుతారు. అర్చకులు, ద్రావిడ ప్రబంధ గానంతో మేల్కొల్పుతారు.

**"శ్రవణాత్సర్వదోషఘ్నం రోగఘ్నం మృత్యునాశనమ్**
**దారిద్ర్య భేదనం ధర్మం సర్వైశ్వర్యఫలప్రదమ్**
**కాలాహి విషవిచ్ఛేది జ్వరాపస్మార భంజనమ్**
**శత్రుజయంకరం రాహుగ్రహ నివారణమ్**
**బ్రహ్మరాక్షస కూష్మాండ భేతాళ భయ భంజనమ్.**

శ్రీ స్వామివారిని ఒక్కసారి తలచినంత మాత్రాన సకలపాపాలు, జ్వర, రోగాలు, మృత్యుభయం నాశనమౌతాయని ఈ స్తోత్రముల అర్థం. శ్రీనివాస పరవాసుదేవుడు ముక్తులను కాపాడుతాడు స్వామివారు పెద్ద శేషవాహనం మీద, బ్రహ్మోత్సవాలలో మొదటి రోజున ఊరేగుతారు, తరువాత చిన్నశేషవాహనంమీద ముత్యాల పల్లకి మీద, హంస, సింహ, సర్వభూపాల, గరుడ, అశ్వ, ఆంజనేయ, అందోళిక వాహనాలమీద నాలుగు మాడవీధులలో ఊరేగి ఆశేషభక్త జనవాహినని అనుగ్రహిస్తారు. చివరి రోజు రథస్థుడై, అందరి మనోరథాల్ని తీరుస్తాడు. స్వామి సేవలో తరించే వారెందరో – ఆగమశాస్త్రనిధులు, అర్చకోత్తములు, జియ్యరులు, ఊర్ధ్వపుండ్ర తేజోవిరాజమానులైన శ్రీవైష్ణవ పుంగవులు – శ్రీవిల్లిబుత్తూరు నుంచివచ్చే నిత్యులు, రాష్ట్ర, రాష్ట్రేతర ప్రాంతాల నుంచి వచ్చే, గాయకులు,



నృత్యకళాకారులు, జానపదుల కోలాహలం, భక్త దాస బృందాల మధురగానాలతో సప్తగిరులు అపరవైకుంఠంగా వెలిగిపోతుంది. అందుకే బ్రహ్మాండపురాణంలో స్వామిని మించిన దైవం లేదని చెప్పబడింది.

**"వేంకటాద్రి సమం స్థానం బ్రహ్మాండే నాస్తి కించన,**
**వేంకటేశ సమోదేవో న భూతో న భవిష్యతి"**

శ్రీనివాసుని ఆవిర్భావం గురించి, అర్చారూప వైభవం గురించి బ్రహ్మాండ, భవిష్య, వరాహ, విష్ణుపురాణాలలో వివరింపబడివుంది– స్వామి, వ్యూహ, పర వ్యూహ, విభవ, అర్చా, రూపాలలో దర్శనమిస్తారని పురాణాలు చెప్పాయి. ఇక్కడ సప్తగిరులపై వెలసి కొన్ని యుగాలు గడిచినా, వైభవం అణుమాత్రం తగ్గలేదు.

ఇక్కడి అర్చనాది, కైంకర్య కార్యక్రమాలు, విశిష్టాద్వైత సిద్ధాంత స్థాపకులు శ్రీమద్రామానుజాచార్యులవారు ఏర్పాటు చేసిన విధానమే నేటికీ అమలులో వుంది – శ్రీరంగం, శ్రీ తిరుపతిలలో ఆరాధన, సేవలు ఒకే విధంగా వుండేలా రామానుజులు రూపొందించారు. సప్తగిరులు సాలగ్రామ శైలముండుటచేత రామానుజాచార్యులు పాదస్పర్శతో దోషంకలుగుతుందని మోకాళ్లపై ఎక్కారంటారు. స్వామిని ఎందరో సేవించారు. తొండమాను చక్రవర్తి కురువనంబి, అన్నమయ్య, రాయలవారు ఇలా ఎందరో తరించారు. రాయలవారు తన ఆముక్తమాల్యదా గ్రంథాన్ని వేంకట విభునికే అంకితమిచ్చారు.

శ్రీ వేంకటేశ్వరుని వారి విలాసవైభవాలను టి.టి.డి దేవస్థానం యీ వరకే ఎన్నో గ్రంథాలు ప్రచురించింది. శ్రీనివాసుని గురించి ఎంత వ్రాసినా యింకా వుంటుంది.

# 22. ఉడిపి - శ్రీకృష్ణదేవాలయం

కర్ణాటక రాష్ట్రం దక్షిణ కన్నడ జిల్లాలో మంగళూరు – మాడ్‌గావ్ రైలు మార్గంలో మంగళూరుకు సుమారు 87 కి.మీ దూరంలో అరేబియా సముద్రతీరాన ఉడిపి అనే పవిత్ర పుణ్యక్షేత్రం ఉంది. బాలకృష్ణుణ్ణి ప్రధాన దైవంగా పూజించే శ్రీకృష్ణ మఠం ఇచటనే కలదు.

'ఉడుప' అంటే చంద్రుడు. తన మామగారైన దక్ష ప్రజాపతి వల్ల శాపం పొందిన చంద్రుడు. ఇక్కడ చంద్ర పుష్కరిణి అనే కోనేటి పక్కన ఉన్న చంద్రమౌళీశ్వరుని గూర్చి తపస్సు చేసి శాపవిమోచనం పొందాడని అందుకే 'ఉడిపి' అని పేరు వచ్చినట్లు స్థలపురాణం. ఉడిపి పూర్వపు పేరు శివళ్ళీ. ఈ ఆలయం 13వ శతాబ్దంలో నిర్మించారు. ఈ ఆలయంలోని చిన్ని కృష్ణుని విగ్రహం ద్వాపరయుగం నాటిదని ప్రతీతి. దీనిని ద్వైతమతాచార్యులైన మధ్వాచార్యులవారు ప్రతిష్ఠించినట్లు తెలుస్తుంది. ఈ ఆలయంలోని మూలవిరాట్ బాలకృష్ణుడు. ఈయన చేతిలో ఒక త్రాడు, మరొక చేతిలో కవ్వముతో వివిధ ఆభరణాలు ధరించిన మంగళరూపంతో దర్శనమిస్తాడు. ముఖమండపం, గర్భాలయంతో కలిపి ప్రధానాలయం ఉంటుంది. ఈ ముఖమండపం నుండే స్వామివారు దర్శనమిస్తారు. దీనిని భక్త కనకదాసు మండపంగా పిలుస్తారు. తూర్పు, అభిముఖంగా ఉండే బాలకృష్ణుడు కనకదాసు అనే భక్తుని కరుణించుటకు వెనక్కి తిరిగి దర్శనమిచ్చాడని అందుకే పశ్చిమాభిముఖుడైనాడని భక్తుల విశ్వాసము. గర్భాలయం నందలి తూర్పు ద్వారములు ఎప్పుడూ మూసి వుంటాయి. పశ్చిమవైపు గల కిటికీ యొక్క 9 చతరస్ర గదుల రంధ్రముల నుండి మాత్రమే స్వామిని దర్శించగలము. ఈ కిటికీ వెండి తొడుగుతో అలంకరింపబడి ఉంటుంది. శ్రీకృష్ణ విగ్రహం కేవలం రెండున్నర అడుగుల ఎత్తు మాత్రం ఉన్నప్పటికీ, ఎంతో సుందరంగా, ఆకర్షణీయంగా ఉంటుంది.



జగదేకపతి, నందనందుడు, గోపికావల్లభుడు, రాక్షససంహారి అయిన ఆ శ్రీకృష్ణుడు వెనుదిరిగి దర్శనమివ్వటం ఇక్కడి ప్రత్యేకత. ఇక్కడ నిత్యం శ్రీకృష్ణనామ స్మరణ, పారాయణం జరుగుతుంది. భక్తులందరూ పారవశ్యంతో భజనలతో, కీర్తనలతో ఆ స్వామివారిని స్మరిస్తారు. శ్రీకృష్ణ జన్మదినమైన కృష్ణాష్టమి నాడు ఇక్కడ వేడుకలు ఎంతో వైభవంగా నిర్వహిస్తారు. ఈ సందర్భంగా స్వామిని మోహినీ అవతారంతో అలంకరిస్తారు. ఇది గాక శ్రీరామనవమి, విజయదశమి, నరసింహజయంతి, భాగీరథీ ఉత్సవము, దీపావళి, హోళీ మొ॥న పర్వదినాల్లో విశేషపూజలు, ఉత్సవాలు జరుగుతాయి. శ్రీకృష్ణునికిచ్చట రోజుకు 9 సార్లు అర్చనలు జరుగుతాయి. కిలో బంగారం, మూడువేల వజ్రాలు, ఇతర విలువైన రాళ్ళతో తయారైన కిరీటం శ్రీకృష్ణునికి అలంకరిస్తారు. ఇంకా ఇక్కడ అనంతశయనుడు, చంద్రమౌళీశ్వరస్వామి, దుర్గాలయాలు, నాగమందిరాలు మొ॥గు ఆలయాలు ఉన్నాయి.

## 23. శ్రీవిల్లిపుత్తూర్

తమిళనాడు రాష్ట్రం, విరూధ్‌నగర్ జిల్లాలో, శ్రీ విల్లిపుత్తూర్ అనే పుణ్యక్షేత్రం ఉంది. ఇది మధురై నగరానికి సుమారు 74 కి.మీ దూరంలో, శివకాశి నుండి 18 కి.మీ. దూరంలో ఉంది. 108 దివ్య తిరుపతులలో ఒకటిగా ఈ క్షేత్రము ప్రసిద్ధి చెందింది. ఇందు (గోదాదేవి) శ్రీ మహాలక్ష్మీ ఆండాళ్ ఆలయం ఉంది. సాక్షాత్తూ శ్రీరంగనాథుణ్ణే మెప్పించిన మహాభక్తురాలు గోదాదేవి. ఆండాళ్‌గా పూజలందుకుంటున్న ఆ తల్లి ఆవిర్భవించిన పుణ్యధామమే శ్రీవిల్లిపుత్తూర్. ఈ అపురూప దివ్యాలయాన్ని 7వ శతాబ్దంలో వల్లభదేవ పాండ్యన్ అనే రాజు నిర్మించినట్లు చరిత్ర ద్వారా తెలుస్తున్నది. కాలాంతరంలో అనేక మార్పులు చేర్పులూ జరిగినప్పటికీ, పురాతనత్వాన్ని చెక్కుచెదరకుండా మిగుల్చుకున్న ఆలయం ఇది. నిత్యం వేలాదిమంది భక్తులు ఈ ఆలయాన్ని దర్శించుకుంటారు.

**స్థలపురాణం :** పూర్వం విష్ణుచిత్తుడనే శ్రీహరి భక్తుడు రోజూ శ్రీహరినే సేవిస్తూ జీవనం సాగించేవాడు. ఒకనాడు విష్ణుచిత్తునకు తులసీవనంలో ఓ ఆడశిశువు దొరికింది, అది శ్రీమన్నారాయణుని కటాక్షంగా ఆ శిశువును చేరదీసి గోదాదేవి అని నామకరణం చేసి అల్లారుముద్దుగా పెంచాడు. ఆ శిశువు కూడా పెరిగి పెద్దదవుతూ ఆ శ్రీరంగనాథుణ్ణే అమితంగా సేవించేది. శ్రీరంగనాథుడే తన ప్రత్యక్ష దైవమని, ఎప్పటికైనా ఆ స్వామిని చేరాలని, అతనినే వివాహమాడాలని ఆకాంక్షించేది. రోజూ పుష్పహారాలను చేసి ముందుగా తన మెడలో ధరించి ఆ తర్వాత స్వామివారి కైంకర్యానికి పంపేది. ధనుర్మాసంలో తిరుప్పావై వ్రతాన్ని ఆచరించేది. భక్తి మాలగా అల్లి తిరుప్పావై ప్రబంధాన్ని రచించి ఆండాళ్‌గా ప్రసిద్ధి చెందింది. ఇందులో 30 పాశురాలున్నాయి. ఆ పాశురాలను భక్తితో గానామృతం చేసి తను తలచినట్లే స్వామిని వివాహమాడి చివరికి శ్రీరంగనాథునిలోనే ఐక్యం అయింది.



గోదాదేవి దొరికిన తులసీవనం ఇప్పటికీ భక్తులకు దర్శనమిస్తుంది. ఈ తులసీవనంలో అమ్మవారికి గుర్తుగా ఓ చిన్న మందిరాన్ని నిర్మించి పూజిస్తున్నారు. గోదాదేవి అమ్మవారి ప్రధానాలయ ప్రాంగణం లోపలి ప్రాకారంలో ఎడమవైపు లక్ష్మీనారాయణ పెరుమాళ్ మందిరం ఉంది. గర్భాలయం వెలుపల తులసీవనంలో బావి ఉంది. అమ్మవారు రోజూ ఈ బావిలోనే తన ముఖారవిందాన్ని చూచుకునేదంటారు. గర్భాలయంలో రంగమన్నార్ దర్శనమిస్తారు. స్వామికి దక్షిణభాగంలో ఆండాళ్ అమ్మవారు, ఉత్తర భాగంలో గరుత్మంతుడు కొలువుదీరి ఉన్నారు. శ్రీ విల్లిపుత్తూరు గోదాదేవి అమ్మవారిని దర్శించుకునే కన్యలకు వివాహయోగం తప్పక కలుగుతుందని భక్తులు ప్రగాఢంగా నమ్ముతారు. అలాగే వివాహం కాని కన్యలు ఇక్కడ ధనుర్మాస వ్రతాన్ని ఆచరిస్తే వెంటనే వివాహం జరిగి సౌభాగ్య సిద్ధి కలుగుతుందంటారు. ఈ దివ్యాలయంలో ధనుర్మాసం చివరిరోజున గోదాదేవి కళ్యాణం నిర్వహిస్తారు. మహిమాన్విత ఈ క్షేత్రంలో ఒక్కరోజు నిద్రచేస్తే పుణ్యఫలాలు సిద్ధిస్తాయంటారు. ఈ దివ్యాలయ ప్రాంగణం సదా గోదా, వటపత్రశాయి నామస్మరణంతో మారుమ్రోగుతుంది. గోదాదేవి 'తిరుప్పావై' పాశురాలు పాడుతూ భగవన్నిష్ఠతో చేసే 'కాత్యాయని' వ్రతం. గోపికలు మధురానగరంలో శ్రీకృష్ణుని కొరకై భక్తి పూర్వకంగా ఇలాగే కాత్యాయని వ్రతం చేసినట్లు భాగవతంలో ఉంది. ఆటలతో పాటలతో గోపికా పరివేష్టిత బృంద నాట్యాలు, హల్లీసకం లాగా శ్రీ విల్లిపుత్తూరులో గోదాదేవి తన స్నేహితులతో, ఆ వటపత్రశాయిని సేవించింది.

ప్రతిరోజు తెల్లవారుఝామునే వటపత్రశాయి మందిరం ముందు వేసే రంగవల్లులలో శ్రీకృష్ణుని బాల్య క్రీడలు, అవతార వైభవాలను, చిత్రించేది.

గోదాదేవి వ్రాసిన తిరుప్పావై పాశురాలు భక్తి వాహినిలో తేలియాడే మధుర వాక్కులు. ఆమె తన పాశురాలలో దేశం సుభిక్షంగా ఉండాలని కోరింది.

**"కాలే వర్షతు పర్జన్యః, పృథివీ సస్యశాలినీ**
**దేశోఽయం క్షోభరహితో బ్రాహ్మణా స్సంతు నిర్భయాః ॥"**

30 పాశురాలలో భక్తి పరాధీనత తప్ప వేరే ఏ మార్గం గోచరించదు. చివర శ్రీస్వామి కళ్యాణ కాంతులతో తులతూగి ఉండాలని మంగళాశాసనం కూడా చేస్తుంది. పెరియాళ్వార్ కూడా స్వామికి "పల్లాండు – పల్లాండు" అని పెరుమాళ్ళకు మంగళాశాసనం చేశాడు. ఏదైతే శ్రీవైష్ణవులు శ్రీరంగనికి నిరుపద్రవంగా సుభిక్షంగా ఉండాలని కోరుకున్న అచంచల శ్రీవిష్ణుపాద లగ్నచిత్తుడు ఈ విష్ణుచిత్తుడు. పన్నిద్దరు ఆళ్వారులలో శ్రీవైష్ణవులైన పెరియాళ్వార్, ఆండాళ్‌లు నివసించిన శ్రీ విల్లిపుత్తూర్ దర్శించిన వారికి తప్పక ముక్తి పదం లభిస్తుందని ఎక్కువ మంది శ్రీవైష్ణవులు ఈ ప్రాంతాన్ని సందర్శిస్తారు.



## 24. ఆళ్వార్ తిరునగరి

108 దివ్యతిరుపతులలో ఎక్కువభాగం తమిళదేశంలోనే వున్నాయి. ఇందులో యింకా ప్రసిద్ధమైన తొమ్మిది దివ్యతిరుపతులలో ఆళ్వార్ తిరునగరి (తీన్ తిరుప్పేర్) ఒకటి. ఇది తామ్రవర్ణీ నదీ తీరంలో వెలసిన క్షేత్రం. దీనికి అతిసమీపంలోనే 'శ్రీవైకుంఠక్షేత్రం వుంది. ఈ స్వామికి అందమైన మకరకుండలాలుంటాయి. అందుచేత స్వామిని 'మకరనెడుం కుళక్కాడన్' అని పిలుస్తారు. నీరదవర్ణదేవుడు కనుక "ముగిల్‌వణ్ణన్ – అని కూడ పిలుస్తారు. శుక్ర సరస్తీరంలో వెలసి నందున శుక్రదోషములు గల వారీస్వామిని పూజిస్తే శుక్ర దోషాలు తొలగిపోతాయట. శుక్రునికి, బ్రహ్మకు ప్రత్యక్ష దర్శనమిచ్చాడట. తిరునల్వేలినుండి యిక్కడికి వెళ్లవచ్చు. దీనిని దర్శించిన నమ్మాళ్వార్ 'మానగర్' అంటే మహానగరమని ప్రస్తుతించారు.

నమ్మాళ్వార్లు ఈ స్వామిని సుమారు "పదకొండు పాశురాలలో, తిరువాయిమొళి"లో కీర్తించారు. స్వామిని అందమైన మకరకుండలాల కాంతిని వైభవాన్ని వర్ణించాడు. ఆ మకరకుండలాలు అంత అందంగా ఉన్నాయనడాని కో కథ ప్రచారంలో ఉంది.

ఒకప్పుడు భూదేవికి తపస్సు చేయాలనిపించింది. స్థలంకోసం వెదకి వెదకి యీ తామ్రపర్ణీ నదీ తీరమే బాగుందని నిర్ణయించుకొని ఒక చోటికి వచ్చింది. కూర్చునే సమయానికి భూమిమీద తళతళామెరిసే మకరకుండలాలు కనిపించాయి. వెంటనే చేతిలోకి తీసుకొని వాటి అందచందాలను చూచి ముగ్ధురాలై యివి మా శ్రీవారికి (హరికి) సమర్పిస్తే ఎంత బాగుంటుందని అనుకున్నదో లేదో – సంకల్పమాత్రుడైన శ్రీమహావిష్ణుమూర్తి ప్రత్యక్షమయ్యాడు. దేవి నమస్కరించి యివిగో యీ కుండలాలు చూడండి ఎంత బాగున్నాయో అంటూ చెవులకు అలంకరించింది. స్వామి దేహకాంతి కుండలాల జ్యోతిలో మెరిసిపోయింది. కనుక స్వామి మకరకుండల దేవుడని ప్రసిద్ధి చెందాడు.

ఈ నగరానికి తేన్ తెరుప్పేర్ అని కూడా పేరుంది. దీనికి ఓ కథ వుంది.

పూర్వం వరుణదేవుడు ఒక రాక్షసునితో యుద్ధం చేయవలసి వచ్చింది. యుద్ధంలో విజయంకొరకు శత్రువిజయ యజ్ఞం తలపెట్టాడు. ఋత్విక్కులను, బ్రాహ్మణులను ఆహ్వానించాడు మరచిపోయాడేమో గురువు గారిని పిలువలేదు. యజ్ఞం పూర్తయింది. తన పాశంతో యుద్ధరంగలోకి వెళ్లాడు. కొద్దిసేపటికే తన చేతిలోని పాశం మాయమైపోయింది. గురువుగారి ఆగ్రహం వల్లనే యిలా జరిగిందని గ్రహించి మరునాడు గురువుగారిని సేవించి, తప్పు క్షమించి దారి చూపమని వేడాడు.

అనుగ్రహపూర్ణులైన గురువుగారు యిలా ఆశీర్వదించాడు. దక్షిణ దేశంలోని తామ్రపర్ణి నదీ తీరస్థులైన శ్రీతీన్ తెరుప్పేర్ మకరకుండల స్వామిని సేవించితే, పాపాలు తొలగి, పూర్వవైభవం వస్తుందని గురువుగారు చెప్పినట్లె, శత్రువిజయం, కీర్తి వరుణుని వశమైపోయాయి. ఈ క్షేత్రవైభవాన్ని, గురించి స్వామివారిని గురించి నమ్మాళ్వార్ ఒక పాశురంలో యిలా పేర్కొన్నారు. స్వామియొక్క ఆకారాన్ని, వినీలకుంత లాలని, దొండపండు వంటి పెదవి, నునుపైన చైకిళ్లసోయగాన్ని అద్భుతంగా వర్ణించారు.

**"శెజ్ఞనివాయ్ ఎన్‌తిరత్తదాయుమ్**
**శెఙ్గందర్ నీణ్ముడిత్తాళన్దదాయుమ్**
**శఙ్గాదుశ్కకరమ్ కణుగన్దుమ్ తామరక్కైళు**
**క్కుత్తీరున్దుమ్**
**తిఙ్గళునాళుమ్‌విళవరాద**
**తెన్ తిరుప్పేరల్‌వీత్తీరున్ద**
**నఙ్గళ్ పిరానక్కు ఎన్‌నెఞమ్ తోళ్**
**నాణు నిపైయమ్ ఇళన్దనే ॥**



ఇదంతాస్వామివారి సర్వావయవసౌందర్య సౌకుమార్య వర్ణన. చూచి తీరవలసిందే. ఇక్కడ మరోవింత వుంది.

సాధారణంగా విష్ణుక్షేత్రాలలో ఎదురుగా గరుడాళ్వార్లు సిద్ధంగా వేచియుంటారు. శ్రీరంగంలో గరుడాళ్వారు కూర్చున్న తీరు చాలా అద్భుతంగా వుంటుంది. శ్రీకృష్ణదేవరాయలు ఆముక్తమాల్యదలో గరుడ విగ్రహాన్ని స్వయంగా చూచి గొప్పగా వర్ణించాడు. ఇక్కడి గరుడాళ్వార్ల తీరును నమ్మాళ్వార్ కూడ వర్ణించారు.

ఈ దేవాలయంలో నిరంతరం వేదఘోష వినిపిస్తుంది. అక్కడే పిల్లలంతా కలిసి అల్లరిచేస్తూ ఆటలాడుకుంటారట. ఈ వేదఘోపల మధ్య, పిల్లల అల్లరి ఆటపాటలను స్వామి ఆలకిస్తూ ఆనందిస్తారట. ఎదురుగా 'గరుడాళ్వార్లు ఉండడంతో పిల్లల ఆటలు చూడడానికి ఆటంకమైనందున, యీ స్వామివారు గరుత్మాంతా కొంచెం ప్రక్కకు తప్పుకోవయ్యా, నేను పిల్లల ఆటలు చూడాలన్నాడట. అలాగే యని స్వామి అజ్ఞప్రకారం అక్కడ దూరంగా వున్న ఒక ఆలయం వద్ద నిలిచాడట. ఈ విషయాన్ని కూడా నమ్మాళ్వార్లు వ్రాశారు.

ఇలా తామ్రపర్ణీనదీతీరంలోని యీ క్షేత్రంతోపాటు కొద్ది దూరంలో వున్న మరో నవతిరుపతులలోని శ్రీవైకుంఠం గూడ దర్శించవచ్చు.

**శుభం**

# 25. తిరుక్కోట్టియూర్

## (శ్రీమద్రామానుజులు తిరుమంత్రార్థాన్ని లోకానికి చాటిన స్థలం)

ఇది చాలాప్రసిద్ధమైన క్షేత్రం. మధురకు 70 కి.మీ. దూరంలో ఉన్న యీ దేవాలయ అధిదేవత శ్రీసౌమ్యనారాయణస్వామి. ఈ స్వామిని పెరియాళ్వార్లు. మంగళాశాసనం చేశారు. తిరుమంగైయాళ్వార్లు కూడా స్వామిని సేవించారు. శ్రీమద్రామానుజులవారు తమ గురువులలో ఒకరైన తిరుక్కోట్టియూర్‌నంబి ద్వారా చరమ శ్లోకార్థము తెలిసికొన్నారు. ఎన్నో పర్యాయాలు ప్రయత్నాలు చేసినా గురుసందర్శనం జరుగలేదు. చివరికి గురువుగారి దర్శనం లభించింది.

తిర్కుకోట్టియూర్ అదే దేవాలయంలోనే వుంటున్నారు కనుక అక్కడే వేచియుండి ఒకరోజు అడిగారు. చరమ శ్లోకార్థము వివరింపుమని, ఎవరికీ చెప్పనని మాట తీసికొని, గురువు గారు వివరించారు

**"సర్వధర్మాన్ పరిత్యజ్య మామేకం శరణం వ్రజ**
**అహం త్వాం సర్వపాపేభ్యో మోక్షయిష్యామి మా శుచః**

ఇది అందరూ ఆచరించవలసిందే. అన్ని ధర్మాలు వదలిపెట్టి నన్నే శరణువేడిన వారికి మోక్షమిస్తాను అన్నది శ్రీకృష్ణభగవానుడు. తిర్కుకోట్టియూర్ నంబి, రామానుజాచార్యులకు ఉపదేశ గురువు. శ్రీమద్రామానుజుల వినయ విధేయతలను చూచి ముచ్చటపడి, విశ్వసనీయతకు ముగ్ధుడై 'అతిరహస్యమైన తిరుమంత్రార్థమును చెప్పి యీ విషయం. ఇతరులకు చెప్పరాదని ఒట్టు తీసుకున్నాడు. అందరికీ మోక్షమిచ్చే యీ తిరుమంత్రాన్ని లోకానికి తెలియజేస్తానని' తిరుక్కోట్టియూర్ గోపురం మొదటి అంతస్థుపైన క్షీరాబ్ది ద్వారం వద్ద నిలబడి అందరినీ సంబోధిస్తూ యిలా అన్నాడు. ఓ భక్తులారా! మీకో మంత్రం ఉపదేశిస్తున్నాను. ఇదిగో తీసుకోండి దీనిని మననం చేసికోండి. ఇది చాలా రహస్యమైన మంత్రం.



మీ అందరికీ అందిస్తున్నాను. వెంటనే యిది తెలిసి 'నంబి'గారు ఎందుకిలా చేశావు. నీవు నరకానికి వెళ్తావు అని శపించాడు. అలాగే! గురువుగారు యీ మంత్రానుష్ఠానం ద్వారా నాకు నరకమొస్తే రానీ. కానీ యావత్ప్రజానీకం మోక్షానికి పోతారు గదా. అదే నాకు కావలసిందని శ్రీమద్రామానుజాచార్యులు ముముక్షు జన ప్రియులకు యీ రహస్య మంత్రార్థం వినిపించి, తాను ధన్యుడై లోకులను ధన్యులను చేశారు.

ఇంతటి చరిత్ర ప్రసిద్ధిగల సౌమ్యనారాయణస్వామి మూడంతస్థుల దేవాలయం. మొదటి అంతస్థుపేరు క్షీరాబ్ధి. ఇక్కడ శ్రీదేవి, భూదేవి సమేతులై స్వామి వేంచేశారు. రెండవ అంతస్థు పేరు ఇంద్రలోకం. మూడవ అంతస్థు పేరు పరమపదము. అష్టాంగవిమానమని ఈ గోపురాలకు పేరు. ఒకసారి పురూరవుడు విమానంమీద పోతూ, యీ గోపురాలను చూచి, దిగి ఆశ్చర్యపడ్డాడట. దేవాలయమంతా తిరిగాడట. స్వామి సౌమ్యనారాయణను సందర్శించి ప్రసాదాలు స్వీకరించాడు. ఆ చక్రవర్తి అక్కడి అర్చకులకు, భక్తులకు 1500 యిండ్లు కట్టించి యిమ్మని అధికారులకు చెప్పినాడట. భక్తులకు వసతి సౌకర్యం అప్పటి నుంచే మొదలయిందని పెద్దలు చెబుతారు.

ఈ దేవాలయంలో ఆళ్వార్ల సన్నిధి, ఆంజనేయస్వామి సన్నిధి, తాయారు సన్నిధితో పాటు తిరుక్కోట్టియూర్‌నంబి, శ్రీమద్రామానుజార్యుల సన్నిధులను పూజిస్తున్నారు. దేవాలయ గోపురంమీద శ్రీమద్రామానుజాచార్యుల విగ్రహాన్ని ప్రతిష్ఠించారు. తిరుక్కోట్టియూర్ గొప్ప క్షేత్రం. లోకానికి తిరుమంత్రాన్ని బోధించిన పవిత్రక్షేత్రంగా విఖ్యాతం. అందరూ చూడతగిన స్థలం.

## 26. శ్రీకాణిపాక గణపతి దేవాలయం

ఇది భారతదేశంలోని గణపతి దేవాలయాలలో సుప్రసిద్ధమైనది. ఆంధ్రప్రదేశ్ చిత్తూరు జిల్లాలో తిరుపతికి సమీపంలో ఉన్న ఈ కాణిపాక క్షేత్రములో స్వయంభువుగా వరసిద్ధి వినాయకుడు వెలసిన ప్రసిద్ధ పుణ్యస్థలము. తిరుపతి – బెంగుళూరు జాతీయ రహదారి; చిత్తూరుకు 12 కి.మీ దూరంలో వెలసిన పుణ్యక్షేత్రం. దీని ప్రక్కనే బాహుదానది ప్రవహిస్తుంది. శివభక్తులలో ఒకడైన న్కతీరుని కథ చదివేటప్పుడు బాహుదానది ప్రసక్తి వస్తుంది. చేతులు లేని ఒక భక్తుడు ఈ నదిలో భక్తి ప్రపత్తులలో మునిగి స్వామిని అర్చించినంత మాత్రాన తిరిగి చేతులు వచ్చాయి. అందువల్ల ఇది 'బాహుదా' నదిగా ప్రసిద్ధి చెందిందని ఒక కథ ప్రచారంలో వుంది. అలాంటి ప్రశస్తమైన 'బాహుదా' నదీజల నిత్యాభిషేక శీకరాహ్లాదంతో చల్లబడే యీ ప్రదేశంలో 'కాణిపాకం' వుంది. ఈ వినాయకుడు కోరిన కోర్కెలు తీర్చే వర ప్రదాత. అందుచేతనే వరసిద్ధి వినాయకుడుగా సార్థక నామధేయుడైనాడు. ఈ దేవాలయం గురించి కొన్ని కథలు కూడా ప్రచారంలో వున్నాయి. దేవాలయం చోళదేశ ప్రభువు కుళోత్తుంగ చోళుడు 11వ శతాబ్దంలో నిర్మించాడని, తరువాత 15వ శతాబ్దంలో విజయనగర రాజులు, దేవాలయప్రాకారాలు నిర్మించి, యితోధికంగా నిత్యధూపదీప నైవేద్యాల కోసం అనేక వస్తువాహన స్వర్ణదానాలు చేసి స్వామికి నిత్యకైంకర్య సేవలో అంకితమయ్యారు ఆ ప్రభువులు. దీనికి తార్కాణంగా వారు వేయించిన శాసనాలు లభించాయి. ఆ తరువాతి కాలంలో దేవాదాయశాఖలు, ధర్మకర్తలు, యీ స్వామియొక్క వైభవాన్ని దశదిశలలో చాటే విధంగా నిత్యోత్సవ, వక్షోత్సవ, మాసోత్సవ, బ్రహ్మోత్సవాలు నిర్వహిస్తున్నారు. శ్రీ తిరుపతి క్షేత్రాన్ని సందర్శించిన భక్తయాత్రికులు, తిరిగి వెళ్లేటప్పుడు తప్పకుండా 'కాణిపాక వరసిద్ధి వినాయక ప్రభువును సందర్శించి ఆశీస్సులు తీసికొని వెళ్తారు. తిరుపతిలో ఏటా



జరిగే బ్రహ్మోత్సవాల మాదిరే కాణిపాకంలో కూడ వినాయకచవితి సందర్భంలో బ్రహ్మాండంగా బ్రహ్మోత్సవాలు జరుగుతాయి.

**శ్రీవినాయకస్వామి ఆవిర్భావం :** వరసిద్ధి వినాయకస్వామి ఆవిర్భావం మహత్తరమయినది. దీనికి సంబంధించిన కథలు. ప్రచారంలో వున్నాయి. ఒకప్పుడు ఈ గ్రామంలో ముగ్గురు అవిటి సోదరులుండేవారట. వారు ఒకరు గుడ్డి, ఒకరు చెవిటి, ఒకరు మూగ. అయినా వారికి ఉన్న చిన్నకమతం పొలంలో స్వంతబావిలో నీరు లభించకపోవడంతో త్రవ్వడం మొదలుపెట్టారు. కొంత సేపటికి గడ్డపార లోపల ఒక రాయికి తగిలి శబ్దం వచ్చిందట. వెంటనే మరికొంత త్రవ్వి చూచారు. అక్కడ దెబ్బతగిలిన రాయినుండి రక్తం కారుతుందట. ఆ రక్తం చిమ్మి ఆ ముగ్గురుమీద పడడంతో, వారికున్న అంగవైకల్యం పోయిందట. దానికి ఆశ్చర్యపడ్డ, గ్రామస్థులు, తండోపతండాలుగా వచ్చి, అక్కడ వెలసిన నీటిలోని గణపతికి పూజలు చేశారట. వెలసినది స్వయంభువే అని భావించి వందలకొద్ది కొబ్బరికాయలు కొట్టారట. ఆ కొట్టిన కొబ్బరికాయల నీరు కాలువల ద్వారా, పావు ఎకరం మడిని తడిపాయట. తమిళులు యీ ప్రాంతాన్ని అప్పటి నుండి "కాణిపరకం", "కాణిపారకం" అని పిలిచేవారట. అంటే నీటిపారుదల వున్న పావు ఎకరం స్థలమని యర్థం. అదే క్రమంగా వ్యవహారంలో 'కాణిపాకం'గా మారిందని ఆ స్వయంభువుని కొలవడం చేత కోరికలు తీర్చే కల్పతరువుగా భావించారు. ఆయనే భక్తుల కొంగుబంగారమై, "వరసిద్ధి వినాయకుడిగా ప్రసిద్ధి చెందాడు. ఆ భక్తుల కోర్కెలు తీర్చే మోదక ప్రియునికి అనేక పదార్థాలను సమర్పిస్తారు. ఇప్పటికి స్వామి ఆనాటి "బావిలో" వుండే అనుగ్రహిస్తున్నాడు. అక్కడే మరో బావి వుంది. అందులో 'మోదక ప్రియుని వాహనమైన' మూషికం (ఎలుక) కూడా ఉంది.

ఆపదలు తీర్చే స్వామిని యిలా కూడా ప్రార్థిస్తారు. భక్తపోతనగారు భాగవతంలో యిలా స్తుతించారు. గణపతిని

**"ఆదరమొప్ప మ్రొక్కుదురు నద్రిసుతాహృదయానురాగ సం
పాదికి దోషభేదికి ప్రసన్న వినోదికి విఘ్నవల్లికా
చ్ఛేదికి మంజువాదికి నశేష జగజ్జననంద వేదికిన్
మోదక ఖాదికిన్ సమదమూషక సాదికి సుప్రసాదికిన్.**

అలాంటి మోదకఖాది (భక్ష్యప్రియుడు) బావిలో కూర్చొని ఆరగిస్తూ బొజ్జను పెంచుతూ స్వామి సర్వాంగ సమేతంగా పెరుగుతూ వుంటాడని దీనికో కథ కూడా చెబుతారు.

**స్వామివారే సత్యప్రమాణం :** తప్పుడు ప్రమాణాలు చేసినా, సత్యప్రమాణం చేశాక తప్పు చేసినా శిక్షింపబడతారని, ప్రమాణం చేశాక సత్యవర్తనులైతే, రక్షింపబడతారని, యిక్కడి దేవుడిపైన నమ్మకం ఎక్కువ. ఏదైనా వస్తే – మధ్యేమార్గ పరిష్కారానికి, "వరసిద్ధి వినాయకుని మీద సత్యప్రమాణం చేస్తారా? అని కూడా అడుగుతారు. భక్తులకు ఈ స్వామిపైన అపారవిశ్వాసం. ఈ స్వామి నీటిలో నుంచి కొంచెమే కనబడతాడు. ఎంత త్రవ్వినా తుది కనిపించలేదట. వెలసిన స్వయంభువుల గురించి ఎవరూ లోతులు తెలిసికోకూడదంటారు. దేవతలు, నదులు, మునుల ఉనికి గురించి వారి మూలాల గురించి వెదకడం అప్రశస్తం. ఇక్కడ ఓ భక్తుడు 50 సంవత్సరాలక్రితం స్వామికి చేయించిన, వెండి తొడవులు యిప్పుడు సరిపోవడం లేదట. పైగా, పుట్టినప్పుడు లేని బొజ్జ యిపుడు పెరుగుతూ వుందట. ఇది వారి అస్థిత్వానికి, సత్యప్రమాణమునకు నిదర్శనమని భావిస్తారు.

**ఇది శివక్షేత్రమే కాదు విష్ణుక్షేత్రం కూడా :** శివకేశవులకు భేదంలేదని పురాణాలు, శాస్త్రాలు చెప్పినా కొందరికి అర్థం కాదు. ఒకే ఆలయ ప్రాంగణంలో శివరూపమైన మణికంఠేశ్వరస్వామివారు, ఈశాన్యమూలలో వరదరాజస్వామివారు ఉండడంతో యిది శివవిష్ణుక్షేత్రమయింది. క్షేత్రపాలకుడుగా, శ్రీ వీరాంజనేయస్వామి, యిరువురు స్వాములను ఎల్లవేళల దుష్టశక్తుల నుండి కాపాడుతూవుంటాడు.



ఆంధ్రప్రదేశ్‌లోని చిత్తూరు జిల్లాలో ఉన్న ఈ క్షేత్రానికి భక్తులు ఎక్కువ సంఖ్యలో వస్తుంటారు. తమ పిల్లలకు 'కాణిపాక, సిద్ధివినాయక, గణపతి పేర్లు పెట్టుకుంటారు. ఇక్కడ నిత్యార్చనలు హోమాలు జరుగుతాయి. గణపతి హోమాలు, పెళ్లిళ్లు జరగుతాయి. గణపతిని సామాన్యంగా విద్యాదేవతగా పూజిస్తారు. గణపతిని సేవిస్తే వ్రాతలో వేగం, విద్యయందు ఆసక్తి. శ్రద్ధగా వినే అలవాట్లు వస్తాయట. వ్యాసమహర్షి చెబుతుండగా, ఆగకుండా, ఏకబిగిన 18 పురాణాలు వ్రాసి పెట్టాడట. వ్యాసమహర్షిని మించిన వేగవంతమైనదీ గణపతి రచనా సామర్థ్యము. అందుకే గణపతికి మ్రొక్కి ఏదైనా శుభకార్యం మొదలు పెడతాం. 'విద్యారంభే వివాహేచ, ప్రవేశే నిర్గమే తథా సర్వదా సర్వకార్యేషు – విఘ్నస్తస్య నజాయతే ॥" అని పూజిస్తే సర్వకార్యసిద్ధి కలుగుతుంది. వినాయకచవితితో ప్రారంభమయ్యే బ్రహ్మోత్సవాలలో పాల్గొని విశేషమైన నెమలి, మూషిక, హంస, గజ, శేషవాహనాలపై ఊరేగే స్వామిని దర్శించి, చివరకు రథోత్సవ దృశ్యంతో భక్తులు పులకించిపోతారు.

**చేరుకునే మార్గాలు :** తిరుపతినుండి ఆర్.టి.సి బస్సులు ఉన్నాయి. హైదరాబాద్, బెంగుళూరు, చెన్నై, కలకత్తాల నుండి తిరుపతికి రైలుమార్గం వుంది. కాణిపాకం చుట్టు ప్రక్కల దేవాలయాలను కూడా దర్శించవచ్చు.

## 27. మధుర శ్రీమీనాక్షీ సుందరేశ్వరాలయం

మధుర తమిళదేశంలో యిది చాలా పురాతనమైన క్షేత్రం. సుందరనాథుడు, సుందరేశ్వరుడనే పేరుగల శివదేవునికి. మీనాక్షి రూపంలో వున్న పార్వతీదేవేరుల పవిత్ర దేవాలయం. ఆలయం 2000 సంవత్సరాలనాటి దని చరిత్ర చెబుతుంది.

నలువైపులా నాలుగు ఎత్తైన మహాగోపుర ప్రవేశాద్వారాలతో నిర్మింపబడిన మధుర సుందరేశ్వరుల ఆలయంలో ముఖ్యమైన రెండు ఎత్తైన బంగారు గోపురాలు ఎత్తు 51.7 అడుగులు కాగా, యింతకంటె చిన్నవైన 14 గోపురాలున్నాయి అద్భుత శిల్పకళారీతులు. చిత్రకళారీతులతో వెలుగుతున్న యీ దేవతా ప్రాంగణానికి భక్తుల రద్దీ కూడ ఎక్కువే. ఈ దేవాలయానికి పౌరాణిక ప్రాశస్త్యం చాలా ఉంది. అందులో ఇదొకటి

శ్రీమహావిష్ణువు సోదరి మీనాక్షిని శివుడికిచ్చి పెళ్లి చేయాలని నిర్ణయించాడు. ఆ విషయం శివునికి చెప్పగా, సరేనని సుందరాకారుడై, “సుందరేశ్వర్” రూపంలో భూమ్మీదకు దిగివచ్చాడు. అలాగే పార్వతిపేరు మీనాక్షి పేరుతో మధురనాయక రాజుల యింట్లో పుట్టి పెరిగింది. యుక్తవయసు వచ్చింతర్వాత కొంతకాలం మధురై రాజ్యాన్ని పరిపాలించింది. అప్పుడు సుందరేశ్వరుడు యీమెను చూచి వివాహం చేసుకుంటానన్నాడు. దీనికి దేవతలంతా తరలి వచ్చారు. పెళ్లి జరిపించాలనుకున్న విష్ణువే సమయానికి రాలేకపోయాడు. దేవతలాడిన నాటకం ద్వారా ఇంద్రుడు అడ్డుపడడంవల్ల విష్ణురాక ఆలస్యమయింది. ముహూర్తపు వేళ సమీపించడంతో తిరుప్పురంకుంద్రంకి చెందిన స్థానిక దేవుడు పవలాకనైవాల్ పెరుమాళ్ ద్వారా పెళ్లి జరిగిపోయింది. ఈ పెళ్లి గురించి ప్రతి యేటా మధురైలో “చిత్తిరి తిరువిళక్కు”గా ఉత్సవం జరుపుకుంటారు. మధురై పాలకుడు తిరుమలై నాయకర్ “అలకళ్ తిరువిళక్కు”, యీ మీనాక్షి పెళ్లికి కలిపి ఉత్సవాలను నిర్వహించాడు.



ఈ ఆలయ మూలనిర్మాణం సుమారు 2000 సంవత్సరాలనాటిదని చారిత్రకుల అంచనా. తమిళ సాహిత్యంలో ఈ ఆలయం గురించి విరివిగా వ్రాయబడింది. సుప్రసిద్ధ శైవతత్త్వవేత్త తిరుజ్ఞాన సంబంధర్ 7వ శతాబ్దంలోనే యీ ఆలయం గురించి ప్రస్తావించాడు. ఈ సుందరేశ్వరుణ్ణి అలవాయి యిరవన్ అని పేర్కొన్నాడు. ఈ దేవాలయం గోడలమీద శివుణ్ణి సుందరేశ్వర్‌గా చెక్కిన శిల్పాలున్నాయి. క్రీ.శ.1310లో మాలిక్‌కపూర్ చేసిన విధ్వంసం వల్ల పాత ఆనవాళ్లు కనబడడం లేదు. ఈ ఆలయాన్ని తిరిగి మధురనాయక రాజులు విశ్వనాథ నాయకుడు పునర్నిర్మాణం చేయాలనుకున్నాడు. ఇది 1559-1600 మధ్య జరిగింది - ఆలయ పునర్నిర్మాణానికి దోహదపడిన వారిలో ప్రముఖుడు, నాయకరాజుల ప్రధానమంత్రి అరియనాథ ముదలియార్, మరియు తిరుమలైనాయకర్ 1623 నుండి 1659 వరకు, ఆలయం కొరకు ఎంతో సహాయం చేశాడు. ఇతడే వీరవసంతరాయ మండపం కట్టించాడు. వసంతోత్సవాలు నిర్వహించాడు. మధుర, తంజావూరు నాయకులు స్వయంగా కవులు, కళాపోషకులు. వారి సాహిత్య సభపేరు శారదాధ్వజము - రఘునాథరాయలు. విద్వత్కవి, మధుర దేవాలయం, రంగమన్నార్ దేవుని గుడిని అద్భుతంగా నిర్మింప చేశాడు. ప్రముఖ రచయిత్రి రంగాజమ్మకు కనకాభిషేకం చేయించాడు. అలా కనకాభిషేకగౌరవం పొందిన తొలి రచయిత్రిగా చరిత్ర కెక్కింది. ఇక్కడి పాలకురాలు రాణి మంగమ్మ, మీనాక్షి నాయకర్ మండపాన్ని విశాలమైన రహదారులను నిర్మించింది.

**భౌగోళిక సంప్రదాయనిధి :** అనేక శివాలయానికి సంబంధించిన సంప్రదాయ విలువలను కాపాడుతుంది మీనాక్షి ఆలయం. ఆలయం చుట్టూ చతురస్రప్రాకారాలు కలిగి తామరచుట్టు రేకులవలె. నడి బొడ్డున ఆలయం - చుట్టూ వీధులు ఉండేవని ప్రాచీన కావ్యగ్రంథాలు వెలువరించాయి. నాలుగు ముఖాల్లో, నాలుగు ప్రాచీన ద్వారాలు ఉన్న అతిప్రాచీన ఆలయాలలో ఇదొకటి.

ఆలయ సముదాయం సుమారు 45 ఎకరాల స్థలంలో వుంది. ఇతర సన్నిధులు కూడా పూజింపబడుతున్నాయి. అతిపొడవైన భారీ నిర్మాణములోని ప్రాకారాలు. 170 అడుగుల ఎత్తుగల గోపురంతో విరాజిల్లుతూ ఉన్న ప్రధాన దేవతా మండపం దక్షిణాపథంలో అతి పెద్దది.

ఆలయం వెలుపల గణపతి భారీవిగ్రహం చూపరులను ఆకర్షిస్తుంది. లంబోదరునికి, గుడి బయట శృంగి, భృంగి ద్వారపాలకులకు మ్రొక్కి లోపలికి ప్రవేశించాలి. ఈ గణపతిని ముఖురున్ వినాయకర్ అని పిలుస్తారు. ఆలయ కోనేరును త్రవ్వుతున్నపుడు ఈ గణనాథుని విగ్రహం దొరికిందట. తర్వాత దీనిని మంత్ర పూర్వకంగా ప్రతిష్ఠించారు. శివుని విగ్రహం వద్దనే మీనాక్షి విగ్రహాన్ని ప్రతిష్ఠించారు.

**వెళ్లి అంబాలమ్ :** శివునియొక్క రాజమందిరాలు ఐదింటిలో యిదొకటి. ఇక్కడో భారీనటరాజ విగ్రహం వుంది. ఇది అసాధారణ శిల్ప విరాజితం. ఇక్కడ శివుడి నటరాజు నృత్యరూపంలో కుడి పాదము లేపి వుంటుంది. సాధారణంగా ఎడమ పాదము లేపి ఉన్న శిల్పాలే చాల చోట్ల కనిపిస్తాయి. ఇక్కడ మాత్రం కుడి పాదము. శివభక్తుడైన రాజపాండ్యన్, దేవుడిని కుడిపాదమే లేపి ఉండమన్నాడట. ఎంతసేపూ ఎడమపాదము లేపడం వలన శ్రమ, అలసట అవుతుందని అడిగాడట. శివుడు కూడా సరేనని కుడి పాదమే లేపాడని ఓ కథ.

మీనాక్షీ అమ్మవారిని, సుందరేశ్వర స్వామివారిని భక్తి పూర్వకంగా అర్చిస్తారు తమిళ దేశస్థులు. ప్రాచీన సాహిత్యంలోను, యితర పురాణాలలోను శాసనాలలోను, గుడియొక్క సంప్రదాయపు విలువలు స్థానిక భక్తుల కథలను చెక్కిన శిల్పాలతో కూడిన యీ దేవాలయ ప్రశస్తి ప్రపంచప్రసిద్ధి. కంచిలో కామాక్షి, మధురైలో మీనాక్షి, కాశిలో విశాలాక్షి దేవతలందరూ మహామహిమాన్వితమైన పార్వతీ దేవి రూపాలే. అంబా త్ర్యంబకీ, మృడానీ,



శాంకరీ భవానీ, సర్వమంగళా అనే సహస్రనామాలతో పార్వతిని సంస్మరించాలి. మధుర మీనాక్షి అనుగ్రహం పొందిన వారికి, ఇహలోక బాధలుండవని పౌరాణికులు చెబుతారు. అద్భుత చోళ శిల్పకళా ప్రాభవానికి యీ దేవాలయ నిర్మాణమే త్కారాణం. ఈ దేవాలయం కూడ మహమ్మదీయుల ఆగ్రహానికి గురై, తర్వాత మధురనాయక రాజుల కాలంలో పునరుద్ధరింపబడింది.

**పాప సంచయమును బాపు పార్వతియును**
**సుఖములను గూర్చు మధుపుర సుందరేశు**
**డెలవి కాపాడు గాక భక్తులను యెపుడు**
**నాల్గు ద్వారాలు ముక్తిమార్గాలు గాగ.**

## 28. చిదంబరం

ఇది తమిళదేశంలోని ప్రసిద్ధ పరమేశ్వరాలయం. అనిర్వచనీయమైన శిల్పశోభతో రమణీయంగా అందరినీ ఆకర్షిస్తున్న యీ దేవాలయం సుమారు 40 ఎకరాల వైశాల్యంలో వుంది. తమిళనాడుకు తూర్పు భాగాన గల కడలూరు జిల్లాలోని కారెకల్ కి ఉత్తరంగా 60 కి.మీ దూరంలో ఉన్న 'చిదంబరం' నగరం నడిబొడ్డున చిదంబరాలయం ఉంది. తమిళసంఘం రచనల ప్రకారం, సనాతన విశ్వకర్మల యొక్క వంశీకుడైన విడువేల్విడు పెరుంతకన్, ఈ ఆలయం యొక్క పునః సృష్టికి రూపశిల్పి. ప్రాచీన మరియు పూర్వమధ్యస్థ కాలంలో, ప్రత్యేకించి పల్లవ, చోళరాజుల కాలంలో ఈ ఆలయంలో పలునూతన రూపకల్పనలు జరిగాయి.

హిందూమత సాహిత్యం ప్రకారం 'చిదంబరం' అనేది 'శివునియొక్క అయిదు పవిత్ర ఆలయాలలో ఒకటి. పంచభూతాలకు ఒక్కొక్క ఆలయం కట్టబడింది. 'చిదంబరేశ్వరుడు' ఆకాశతత్త్వానికి, తిరువనైకవల్, జంబుకేశ్వరుడు జలతత్త్వానికి, కంచి ఏకాంబరేశ్వరుడు భూమితత్త్వానికి, తిరువణ్ణామలై అరుణాచలేశ్వరుడు. అగ్ని తత్త్వానికి మరియు శ్రీకాళహస్తీశ్వరస్వామి వాయుతత్త్వానికి నిదర్శనం.

ఈ ఆలయాల సముదాయం నగరం నడిబొడ్డున వ్యాపించియున్నది. శైవుల మరియు శ్రీవైష్ణవులు దేవతలు కొలువున్న అతికొద్ది క్షేత్రాల్లో ఇది ఒకటి. ఇక్కడ గోవిందరాజస్వామి, నటరాజు (శివుడు) వెలసి ఉండడంవల్ల ఉభయులకు భక్తిక్షేత్రమయింది. వైష్ణవులకు శ్రీరంగం ఎలా స్మరణకు వస్తుందో. అదే విధంగా శైవులకు చిదంబరం స్మరణకు వస్తుంది.

'చిదంబరం' అనే పదానికి అర్థం చైతన్యం. అదే చిత్. ఆకాశానికి పేరు అంబరం. ఇది పరమేశ్వర తత్త్వానికి చిహ్నాము. 'అంబళం' అనగా



కళలను ప్రదర్శించడానికి వీలయ్యే వేదిక అని అర్థం. చిదాకాశం – చిద్విలాసం అనే పరమార్థ పరమాత్మ తత్త్వాన్ని తెలిపే యీ పదాలు ఆధ్యాత్మిక భావసముద్రాలు. చిదంబరాన్ని దర్శిస్తే ముక్తి కలుగుతుందని శైవుల నమ్మకం. సర్వాలంకృత భూషితుడైన నటరాజు విగ్రహం ఈ ఆలయంలో ప్రత్యేకత. అన్ని శివాలయాల మాదిరిగా లింగ రూపానికి భిన్నంగా, మనుష్యరూపాన్ని ఆరోపించి ప్రతిష్ఠించిన అతి కొద్ది దేవాలయాలలో ఇది ఇకటి.

అయిదు ప్రాకార ఆవరణాలున్న యీ దేవాలయం 12, 13 శతాబ్దాలలో పునర్నిర్మాణం జరిగింది. ఇందలి శిల్ప రీతులు పల్లవ, చోళ రాజులకు చెందింది. అద్భుతమైన శిల్పకళా వేదికలు ఎన్నోవున్నాయి. ఇక్కడ నృత్యోత్సవాలుకూడా జరుగుతాయి.

వనకోవరయ్యన్ క్రీ.శ. 1213లో చిదంబరంలోని శివాలయాన్ని పునర్నిర్మాణం చేశాడు. తిరువణ్ణామలై ఆలయాన్ని కూడా యితడే నిర్మించాడు. ఇక్కడ సనాతనంగా పూజలు చేస్తున్న 'దీక్షితర్' – అనే శైవబ్రాహ్మణులు అధికారిక పురోహితులు.

చిదంబరం యొక్క పురాతన చరిత్ర పురాణాలలోవుంది భగవంతుడు భక్తికి మాత్రమే సులభసాధ్యుడు, మంత్ర తంత్రాలు క్రతువుల వలన కాదని చెప్పడానికి ఓ కథ ప్రచారంలో వుంది.

పూర్వం తమిళదేశంలోని చిదంబరం వద్ద 'తిలైవనం' ఉండేది. తిల్లై వృక్షాలతో నిండిన వనం అది. 'తిల్లై' చెట్లు నీటి చలమలలో పెరుగుతాయి. దీని వృక్షశాస్త్రం పేరు Exocaria Agallocha ఇది నీటి చెట్లు. ఈ చెట్లువుండే వనంలో కొంతమంది ఋషులు, మునులు ఉండేవారు. భగవంతుణ్ణి క్రతువులు, మంత్ర తంత్రాల వల్ల స్వాధీనపరచుకోవచ్చని యీ మునులు భావించారు. ఈ మునుల గర్వభంగం చేయాలని తలచిన శివుడు, 'యాచకుని రపంలో, విష్ణువు అందమైన మోహిని' రూపంలో ఆ అడవిలో

తిరుగుతుండగా అచ్చటి మునులు, ముని పత్నులు చూచి ఆశ్చర్యపోయారు. శివ, విష్ణువులు అడవిలో ఆనందంగా తిరగడం, మునిపత్నులు వారిని చూచి ముగ్ధులైపోవడం మునులకు ఆగ్రహం కలిగించింది. వెంటనే మునులు వారిపై అసంఖ్యాకమైన 'పాములను సృష్టించి విసరి వేస్తారు. భగవంతుడైన శివుడు ఆ పాములను – వంటినిండా దట్టంగా ధరిస్తాడు. మెడకు, చేతులకు నడుముకు ఆభరణాలుగా ధరించగా, మునులు మరింత ఆగ్రహులై ఒక భయంకరమైన పులిని సృష్టించి ఆమంత్రిస్తారు. తిరిగి యాచకుని రూపంలోవున్న శివుడు ఆ పులిని చీల్చి దాని చర్మాన్ని నడుము చుట్టూ శాలువా లాగా ధరిస్తాడు. మరింత విసుగు చెందిన మునులు, వారియొక్క శక్తిని కూడ కట్టుకొని, గర్వానికి, అజ్ఞానానికి చిహ్నమైన ఒక రాక్షసుడిని ముయాలకన్‌ను అనే రక్కసుణ్ణి ఆమంత్రిస్తారు. పరమేశ్వరుడు చిరునవ్వుతో, ఆ రాక్షసుడి వెన్నుమీద కాలుపెట్టి కదలకుండాచేసి, ఆద్యంత రహితమైన ఆనందతాండవం చేసి, స్వామి తనయొక్క నిజస్వరూపాన్ని దర్శింపచేస్తాడు. అప్పుడు మునులు, భగవంతుడే వాస్తవమని, అతడు మంత్రాలకు, తంత్రాలకు, క్రతువులకు లొంగడని గ్రహించి, లొంగిపోతారు. నటరాజు చేసిన యీ ఆనంద తాండవ ముద్రను ప్రపంచంలోని భరతనాట్య భంగిమలలో ఒకదానిగా గుర్తించారు. రాక్షసుడని అజ్ఞానిగా, గుర్తించారు. శివుని చేతిలో వుండే 'అగ్ని' దుష్టశక్తులను నాశనం చేయునదిగా, ఎత్తిన చేయి, సర్వజగత్తుకు రక్షణగా చేతిలో వుండే ధమరుకం జీవునియొక్క పుట్టుకను, వెనుకనున్న 'వలయం' విశ్వాన్ని సూచిస్తుందని పెద్దలు భక్తులు విశ్వసిస్తారు.

శివక్షేత్రాలలో ప్రసిద్ధమైన చిదంబరం ఆధ్యాత్మికభావానికి ప్రతీకగా భావిస్తారు. ఈ ఆలయం పరిసర ప్రాంతాలలో అనేక ఉపదేవాలయా లున్నాయి. యాత్రికులు ఎంతో భక్తిగా యీ స్వామిని సేవిస్తారు.



చిదంబరం ఆలయం యొక్క బంగారపు పై కప్పుకలిగిన గర్భగుడిలో దైవం మూడు రూపాలలో సాక్షాత్కరిస్తాడు. మనిషిరూపంలో ఉండే స్వామిని సకలతిరుమేని, చంద్రమౌళీశ్వరులైన అర్ధనారీశ్వర మానుషరూపాన్ని సకలనిష్కళ తిరుమేని, చిదంబరం గర్భగుడిలోని శూన్యస్థలాన్ని, నిష్కళతిరుమేనిగా, మూడు రూపాలలో సాక్షాత్కరిస్తాడు.

# 29. హంపీ విరూపాక్ష స్వామి

ఇది కర్ణాటక రాష్ట్రంలో బళ్లారికి 75 కి.మీ. దూరంలో వుంది. బళ్లారి నుంచి బస్సులో, కార్లలో వెళ్లవచ్చు. విజయనగర రాజులు పాలించిన సామ్రాజ్యానికి 'హంపి' రాజధాన్ని – విశాలమైన రాజవీధులు, ఎత్తైన భవనాలతో కళకళలాడిన నగరం, ప్రస్తుతం శిథిలాల మధ్య పాత జ్ఞాపకాలను నెమరువేసుకుంటుంది. పట్టణ వైశాల్యం 40 కి.మీ. రాతికాల్వల ద్వారా తుంగభద్ర నీటిని, త్రాగు నీటికి, సాగునీటికి వాడుకున్నా రానాడు. ఇది అప్పటి ఇంజనీర్ల ఘనత అని చెప్పకొంటారు.

పూర్వం ఒక మహానుభావుడు – భూత భవిష్యత్ జ్ఞాని, వాస్తు, జలార్గళ శాస్త్రాల వైదుష్యం గల విద్యారణ్యస్వాములవారు ఈ నగర నిర్మాణానికి భూమిపూజ చేశాడు. ఒకసారి ఆయన గుఱ్ఱంపై వెళుతుండగా, వేట కుక్కలను తరుముతున్న కుందేళ్లను చూచి విస్మయం పొందారు. ఇది వీరభూమి గొప్ప కళాక్షేత్రమవుతుందని చెప్పి, అప్పటి ప్రజలకు చాటి చెప్పాడు. విజయనగర ప్రభువులు హరిహరరాయలు, బుక్కరాయలు వీరులు ఆనాడే. మహానగరానికి పునాదులు వేశారు హరిహరరాయలు. నగరాన్ని కాపాడి, విశాలమైన వీధులను నిర్మించారు. ఈయన కాలంలోనే శ్రీవిరూపాక్ష స్వామి ఆలయనిర్మాణం జరిగింది. ఎత్తైన విమాన గోపురం, అంతరాలు, ఉప సన్నిధులు ప్రాకారాల మధ్య, ఇండ్లు – నిర్మించారు. బయట విశాలమైన రాచవీధులు, రథాలు, గుర్రాలు, ఏనుగుల సైన్యంతో కిటకిటలాడేవట ఆనాటి వీధులు.

శ్రీవిరూపాక్షస్వామి క్షేత్రం అధి దేవుడు పరమేశ్వరుడు. మొదట వీరంత శివభక్తులు లింగాభిషేకం, నిత్యార్చనలు హారతులుసాగేవి తర్వాతి కాలంలో విజయ నగరరాజులు స్వామికి భూరివిరాళాలు సమర్పించారు. ఈ దేవాలయాన్ని దర్శించిన వారిలో కవిసార్వభౌముడు శ్రీనాథుడు ప్రసిద్ధుడు.



ఇక్కడే పండిత వాగ్వివాదములో గౌడ డిండిమభట్టు కంచు ఢక్క పగల గొట్టింది శ్రీనాథుడు. తన పాండితీ ప్రతిభతో అప్పటి ప్రభువు ప్రౌఢదేవరాయల ఆస్థానంలో శ్రీనాథకవి కనకాభిషేక గౌరవం పొందాడు విరూపాక్షస్వామి సన్నిధిలో.

**పంపావిరూపాక్ష బహుజటాజూటికా**
**స్రగ్వధ ప్రసవసౌరభ్యములకు –**

అని శ్రీనాథుడు విరూపాక్షస్వామిని కొనియాడాడు.

శ్రీకృష్ణదేవరాయలు విరూపాక్షస్వామి అంగరంగ వైభవానికి, కమ్మని నేతి నైవేద్యాలకు గాను యిచ్చిన భూరివిరాళాల గురించి ఒక శాసనంలో వుంది.

**శ్రీశుభమస్తు**

**స్వస్తి శ్రీ విజయాభ్యుదయ శాలివాహ**
**నశకవరుశ 1436 యగునేంట**
**ధాత వత్సర శ్రీమన్మ**
**హారాజాధిరాజ రాజ పర**
**మేశ్వర శ్రీవీరప్రతాప శ్రీకృష్ణదేవరాయమ**
**హారాయలు శ్రీవిఠల దేవునికి**
**కట్టించిన నూరుస్తంభాలమం**
**టపము....................**

అని శాసనంలో వుంది. ఇలాంటి శాసనములు, కన్నడ, తమిళ భాషలలో లభించాయి. శ్రీవారికి ఏటా చైత్రమాసములో రథోత్సవం జరుగుతుంది. హంపి అనే గ్రామంలో దొరికిన శాసనము కన్నడ భాషలో ఉంది. స్వామి వారికి రథోత్సవ అలంకార ఆభరణాలు, నిత్య నైవేద్య నిమిత్తం సమర్పించిన వివరాలిలా వున్నాయి.

**శ్రీవిరుపాక్ష దేవరిగ నవరత్నఖచిత**
**వాద సువర్ణ కమల వనూ నాగాభరణ**
**సమా సమర్చసి దరు దేవర నైవేద్య**
**ఆరోగణమాడు వదకి సమర్పిస్త**
**చింన్నద హరివాణ ఆరతి హోలఖ బెళియ**
**ఆరతి 24 ఇష్టనూ సమర్పిసిదరు-**

అనే కన్నడ శాసనాన్ని బట్టి 'సింగనాయకన్' హళ్ళి అనే గ్రామాన్ని దానం చేశాడని తెలియచున్నది. ఈ గ్రామ ఆదాయంలో కొంతభాగం దేవునికి సమర్పించవలసి వుంటుంది. తుళువ వంశ క్రమంతోపాటు రాయలపట్టాభిషేక పుణ్యకాలంలో చేసిన భూహిరణ్య దానవివరాలున్నాయి.

ఈ హంపీ నగరానికి సొగసులు దిద్దినవాడు శ్రీకృష్ణదేవరాయలు. విరూపాక్షస్వామి దేవలయానికి భూరి విరాళాలతోపాటు, హజార రామస్వామి దేవాలయం కట్టించాడు. రంగమండపం - కృష్ణస్వామి దేవాలయం, వర్తక వీధులు, తులాభార మండపం, రాయలు, కట్టించినవే. హోస్పేట తాలూకాలోని 'హంపి' తుంగభద్రానదీ తీరంలో జేగీయమానంగా వెలిగింది. ఈ నగరానికి ఉత్తరాన కిష్కింధ, మతంగ, ఋష్యమూక పర్వతాలున్నాయి. ఋష్యమూక్ పర్వతంమీద సుగ్రీవుని గుహవుంది. ఈ కొండపైననే సుగ్రీవునికి శ్రీరామచంద్రునకి మైత్రి కుదిరింది. సీతాదేవి తన నగలను మూట కట్టి భూమిమీదకు, ఈ కొండమీదకే విసిరింది. అది సుగ్రీవుని ద్వారా రాముడు, లక్ష్మణులు చూచి తమదే అని గ్రహించారు.

1380 నాటి శాసన ప్రకారం 'ఇది' విజయ విరూపాక్ష నగరంగా పేరు కలదట. ఇక్కడ విజయ నగర రాజులకు సంబంధించిన 400 శాసనాలు లభించాయి. అత్యంత ప్రాచీనమైన దేవలయంగా శ్రీవిరూపాక్షస్వామి దేవుడు చరిత్రకెక్కాడు. హంపిలోని విరూపాక్షస్వామికి రాయలవారు తమ తండ్రి నరసనాయకులు, తల్లి నాగజిదేవమ్మగార్ల జ్ఞాపకార్థం అనేక దానాలు, సుమారు 10 గ్రామాలను అరణంగా యిచ్చినట్లు- రాయలవారి సతీమణులు, చిన్నాదేవి, తిరుమల దేవి గారలు, విరూపాక్షస్వామివారి ఆలయ గోపురం కట్టించి అనేక బంగారు ఆభరణాలు సమర్పించారు.



ఇవిగాక చూడతగినవి, విఠలదేవాలయం, సంగీత మంటపం, రాయలవారి దసరా దిబ్బ, 'భువనవిజయం' శిథిలాలు, కమలాభవన్ రాతిరథం, తులాభారం, దారిపొడుగునా రత్నాలు అమ్మిన విపణి వీథుల ఆనవాళ్లు చూడవచ్చు. ఇక్కడికి సమీపంలోని కమలాపురంలో రాయలనాటి రసికతా సామ్రాజ్యానికి సంబంధించిన రాచరికపు దుస్తులు నగలు, ఆయుధాలు, నాణాలు, శాసనాలు, పలువిగ్రహాలను భద్రపరిచారు. గైడ్ సహాయంతో చూడవచ్చు. శ్రీ విరూపాక్ష స్వామి దేవాలయానికి పశ్చిమభాగాన ఒక భవనం వుంది. ఆ భవనం గోడమీద, విరూపాక్షస్వామి దేవాలయం చిత్రం తలక్రిందులుగా కనిపిస్తుంది. గోడకు సన్నని రంధ్రపు వెలుగు దారులు కన్పిస్తాయి. ఆ బొమ్మ ఎలా తలక్రిందులుగా ఆ రంధ్రాల ద్వారా పడి కనిపిస్తుందో ఎవరికీ తెలియదు. ఇది ఆనాటి భవన నిర్మాణ కౌశలమే మరి. అక్కడే పెద్దకోనేరు ఉంది. కోనేరు నుండి ఎడమ ప్రక్కనుండి చక్కగా, తుంగభద్రకు దారి వుంది. అది రాచకుటుంబీకులు వెళ్లే దారిమాత్రమే. తుంగభద్రానది ఒడ్డున శిథిలమైన "పురందరదాసు" మండపం వుంది. కన్నడ దాస సాహిత్య శిరోమణి పురందరదాసు అనేక కీర్తనలు వ్రాసి పాడిన వాగ్గేయకారుడు.

శ్రీకృష్ణదేవరాయలు, కృష్ణపురం, సంగనూరు గ్రామాలను దానం చేసి, ఆ గ్రామ ఆదాయాన్ని యిక్కడ ప్రతిష్ఠించిన అష్టలక్ష్మీ సమేత యోగానంద నరసింహస్వామికి అర్పించవలసిందిగా శాసనం వేయించారు. ఏది ఏమైనా చూడతగ్గవి యింకా చాలా వున్నాయి. కనీసం 3 రోజులు చూసినా తరగని దృశ్యాలున్నాయి. భూలోక అమరదేశంగా వర్థిల్లింది. కవులకు, పండితులకు పట్టుగొమ్మ శిల్పకళాకారులకు నిలయం. దానధర్మాలకు కేంద్రం. సంగీతానికి విహారభూమి. ఒక విధంగా రాయల కళాహృదయమే హంపి.

## 30. ధర్మపురి శ్రీలక్ష్మీ నరసింహస్వామి క్షేత్రం

ఇది కరీంనగర్ జిల్లాలోని ప్రసిద్ధ క్షేత్రాలలో ఒకటి. లక్ష్మీ సమేతుడైన నరహరి వెలసిన క్షేత్రం... కృతయుగం నాటి నృసింహుడు, తెలంగాణాలో అనేక ప్రదేశాలలో వెలసి ప్రహ్లాదవరదుడై భక్తజనకోటిని అనుగ్రహిస్తున్నాడు. నల్లగొండ జిల్లాలో ప్రసిద్ధమైన శ్రీ యాదగిరిలక్ష్మీ నరసింహస్వామిగా, మట్టపల్లి. అర్వపల్లి ప్రాంతాల్లో వెలసినాడు. కరీంనగర్ జిల్లాలోని ధర్మపురిని 7వ శతాబ్దంలో విష్ణువర్ధన రాజు ధర్మబద్ధంగా పరిపాలించాడు. ప్రజలను కన్నబిడ్డల వలె సాకినాడని యితని పేరనే యీ వూరికి 'ధర్మపురి' అని పేరు వచ్చింది. కరీంనగర్ 80 మైళ్ల జగిత్యాలకు 57 కి.మీ. దూరంలో వుంది యీ క్షేత్రం.

క్రీ.పూ. 8వ శతాబ్ది కాలం నాడే, చాళుక్య ప్రభువుల ఏలుబడిలో వున్న యీ గోదావరీ సలిలము ప్రవహించిన ప్రదేశంలో లక్ష్మీసమేత నరహరికి దేవాలయం కట్టించి ప్రతిష్ఠ చేశారు. జైనులు, బౌద్ధులు కూడ యీ స్వామిని యిలవేల్పుగా పూజించారు. జినవల్లభుని కాలంలో కూడా యిది ప్రసిద్ధి చెందింది. గోదావరి తీరాన వెలసిన ధర్మపురి ఈ క్షేత్రంలో శ్రీ రామలింగేశ్వర స్వామిని ప్రతిష్ఠ చేయబడినందువల్ల శివవిష్ణుక్షేత్రంగా విరాజిల్లుతున్నది. గోదావరీ తీరాన గల యీ హరిహరిక్షేత్రం. భక్తుల మనోభీష్టాన్ని తీర్చే కొలువు కూటం. నరసింహస్వామిని, అర్చించి స్వామి ప్రసాదం తీసికొన్న వారికి కోర్కెలు తీరుతాయట. ఇది పౌరాణికంగా, చారిత్రకంగా పేరు గాంచిన స్థలం. ఈ గ్రామంలో పూర్వం 'శేషప్ప' అనే కవి నివసించేవాడు. స్వామివారిపై అచంచల భక్తి గల శేషప్ప రచించిన "నరహరిశతకం" చాలా ప్రసిద్ధిగాంచినది. తెలంగాణ ప్రాంతంలో ఇందలి పద్యాలు తెలియని వారుండరు. సమాజానికి వెలుగు నిచ్చే పద్యాలు వ్రాశాడు.

**"పశువులు బందైన పసులకాపరి తప్పు**
**తనయుడు చెడ్డైన తండ్రి తప్పు**
**భార్య గయ్యాళైన ప్రాణేశ్వరుని దప్పు"**



వంటి పద్యాలు, పరద్రవ్యములకొరకు భ్రాంతిపడెడివాడు, పరకాంతలను, బాధపెట్టెడివాడు, దానము చేసేవారిని అడ్డగించేవాడు. భక్తికి దూరమైనవాడు పాతకుడని శేషప్పకవి నిరసించాడు. ఎవడైనా లవణమన్నమే భుజిస్తాడు కాని మెరుగు బంగారంబు మ్రింగబోడు – వంటి వాక్యాలను యిక్కడ సామెతలుగా ప్రజలు వాడుతుంటారు. ఇది గొప్ప నీతి శతకం.

**యమధర్మరాజుకు పూజలు**

నిరంతరం, నియమబద్ధంగా ఆయుఃప్రాణముల లెక్కలు చేయడంలో, తేల్చడంలో సమవర్తిగా పేరు తెచ్చుకున్న దేవ ప్రముఖుడు యమధర్మరాజు. ఒకరోజు తీరిక చేసికొని ధర్మపురి వద్దగల గోదావరిలో స్నానంచేసి, నరసింహస్వామిని దర్శనం చేసుకున్నాడట. అందుకు తార్కాణంగా ఈ దేవాలయంలో ప్రవేశించగానే 'యమధర్మరాజు విగ్రహం వుంటుంది. అతనికి నిత్యపూజలు, ఆరాధనలు దీపారాధనలు జరుగుతాయి. అపమృత్యు దోషాల నుండి కాపాడుమని వేడుకుంటారు. యమధర్మరాజుకు అర్చన జరగడం అపూర్వ విషయం.

ఇక్కడ దక్షిణ వాహినిగా గోదావరి ప్రవహిస్తుంది. ధర్మపురి దర్శించిన వారికి మరణం వుండదనే సామెత యిక్కడ పుట్టిందే. శేషప్పకవి వ్రాసిన శతక మకుట చరణాలు 'భూషణవికాస శ్రీధర్మపురినివాస! దుష్ట సంహార నరసింహ దురిత దూర!!' – దేవాలయ ముఖద్వారం వద్ద చెక్కివుంటాయి. భక్తులు శేషప్పకవి శతకాలను కొని భద్రపరచుకుంటారు.

**ఆలయ పునరుద్ధరణ :** అన్ని దేవాలయాలమీద జరిగినట్లే యిక్కడ కూడ ఔరంగజేబు సైన్యంవల్ల దాడి జరిగింది. దేవాలయాలకు క్షతి జరిగింది. కొన్ని శతాబ్దాల తర్వాత యించుమించు 7వ శతాబ్దం. దీనికి పునరుద్ధరణ జరిగింది. గోదావరినదిలో నరసింహస్వామి విగ్రహం దొరికింది. దీనిని పాతనరసింహ స్వామిగా కొలుస్తున్నారు. ఇక్కడ యోగానందస్వామి

రూపంలో దర్శనమిస్తాడు. ఇదే దేవాలయంలో శ్రీవేంకటేశ్వరస్వామి, రామలింగేశ్వరస్వామి, ప్రసన్నాంజనేయస్వామి సన్నిధులున్నాయి. నిత్యార్చనలు, ధూప దీప నైవేద్యాలు అంగరంగ వైభవంగా జరుగుతున్న యీ దేవాలయం దగ్గరగల గోదావరీ తీరమంతా, స్వచ్ఛంగా, పచ్చగడ్డి మైదానాలతో స్నానఘట్టాలను అందంగా తీర్చి దిద్దారు.

ఇక్కడ గౌతమీశ్వరాలయం, సత్యవతీ ఆలయాలు కూడా నెలకొన్నాయి. గౌతమీనదీ తీరం కనుక, గౌతమీనదికి పూజలు జరుగుతాయి. అన్నదానాలు, పిండప్రదానాలు, తర్పణాలు యిక్కడ ఎక్కువ సంఖ్యలో జరుగుతాయి.

**పూజలు :** ప్రతినిత్యం తెల్లవారుజామున, సుప్రభాత సేవ, నిత్యార్చనలు, పంచామృతాభిషేకములు, జరుగుతాయి. ఉదయం 5 గం. నుండి మధ్యాహ్నం 2 గం. వరకు తిరిగి సాయంత్రం 4 గం. నుండి 8 గం. వరకు దర్శనాలుంటాయి. గుడికి దగ్గరిలోనే బ్రహ్మపుష్కరిణి వుంది. దక్షిణాన శ్వేత వరాహతీర్థం, పశ్చిమాన పుష్పసరోవరం, తూర్పున గోదావరి కలవు. ఇది సర్వతీర్థములకు నిలయం, ఎక్కడ స్నానం చేసినా, ఏ నమస్కారమైనా కేశవునికే చెల్లుతుంది–

ధర్మపురిలో గోదావరి స్నానం, మోక్షమార్గానికి తొలిసోపానం!



## 31. రామేశ్వరం

తమిళనాడు రాష్ట్రంలో రామనాథపురం జిల్లాలోని ఒక దివ్యక్షేత్రం రామేశ్వరం. చెన్నైకి 572 కి.మీ. దూరంలో ఉన్న ఈ రామేశ్వరంలో ద్వాదశ జ్యోతిర్లింగాలలో ఒకటైన రామేశ్వర లింగం ఇక్కడ ఉన్నది. హిందూ ఇతిహాసాల ప్రకారం శ్రీరాముడు సేతువును ఇక్కడే నిర్మించాడని తెలుస్తుంది. అదే రామసేతు. రామేశ్వరం శైవులకు, వైష్ణవులకు పుణ్యక్షేత్రం. శ్రీరాముడు రావణుని వధించాక తనకు అంటిన బ్రహ్మహత్యా పాతకాన్ని తొలగించుకొనుటకు ఇచ్చటనే రామనాథేశ్వరస్వామిని ప్రతిష్ఠించాడని అంటారు. ఇచ్చట సముద్రం లోతు చాలా తక్కువగా ఉంటుంది. మొదటగా సముద్ర స్నానం చేసిన తరువాత గుడిలో ఉన్న 22 బావులలో స్నానం చేయాలని చెబుతారు. రామేశ్వర దేవాలయం క్రీ.శ.12వ శతాబ్దంలో నిర్మింపబడినట్లు తెలుస్తుంది. సింహద్వారం సుమారు 100 అడుగుల ఎత్తున ఉంటుంది. ఈ పరమ పవిత్ర పుణ్యక్షేత్రానికి మూడు ప్రాకారాలున్నాయి. మొదట ప్రాకారంలో శ్రీరామచంద్రుడు ప్రతిష్ఠించిన జ్యోతిర్లింగం ఉంది. హిందువులు అనేకమంది కాశీయాత్ర రామేశ్వరం చూసిన తరువాత కాని పూర్తి కాదని విశ్వసిస్తున్నారు. కాశీ గంగా తీర్థం తీసుకువచ్చి రామేశ్వరునికి అభిషేకం చేసినట్లయితే కాశీయాత్ర పూర్తవుతుందని దేశంలోని సకల తీర్థములు చూసిన ఫలం దక్కుతుందని హిందువుల నమ్మకం. గర్భాలయాన్ని 10వ శతాబ్దంలో శ్రీలంక చక్రవర్తి అయిన పరాక్రమబాహుచేత నిర్మించబడినట్లు తెలుస్తుంది. 12 వ శతాబ్దం నుండి ఈ ఆలయ నిర్మాణం వివిధ రాజుల చేత నిర్మించబడింది. దేశంలోని చతుర్ధామాల్లోని మొదటి ధామంగా ఈ ఆలయం భావింపబడుతుంది. ఈ నాలుగు ధామాలు దర్శిస్తే, దేశం నలుమూలలా దర్శించినట్లే. మొదటిది రామేశ్వరం, 2. ద్వారక, 3. పూరిజగన్నాథ్, 4. బదరీనాథ్ ధామం. ఉత్తరాన కాశీ వెళ్తామని వెళ్లకపోయినా ఫరవాలేదట. కానీ దక్షిణాది రామేశ్వరం

వెళ్తామని అనుకొని వెళ్ళకపోతే మహాపాతకమట. మన మనసులోకి వెళ్ళామనే సంకల్పం కలగగానే మన పితృదేవతలు మన రాక కోసం స్వర్గంలో నిరీక్షిస్తారట. కనుక ప్రతీవారు కనీసం ఒక్కసారైనా కాశీ క్షేత్రాన్ని దర్శించాలి. మొదటగా కాశీ క్షేత్రాన్ని దర్శించి గంగా జలం తెచ్చి రామేశ్వరంలోని శ్రీరామలింగేశ్వరుని అభిషేకించి అర్చించాలనీ అలాగే రామేశ్వరంలోని సముద్రం ఇసుకను కాశీ, ప్రయాగల్లో కలిపితేనే కాశీరామేశ్వరయాత్ర పూర్తవుతుందన్నది పెద్దలమాట!

ఈ శివక్షేత్రంలో మూడు ప్రాకారాలతో, మొదటి ప్రాకారంలో గర్భాలయంలోని శివలింగం రామ ప్రతిష్ఠితం. ఈ జ్యోతిర్లింగమునకు ప్రతిదినం గంగా జలాభిషేకం జరుగుతుంది. పక్కనే కాశీవిశ్వనాథ లింగము ఉన్నది. ఈ ప్రాకారంలో కోటితీర్థము, సర్వతీర్థములు ఉన్నాయి. రెండవ ప్రాకారంలో అమ్మవారి దేవాలయం ఉంది. మూడవ ప్రాకారం ఒక మహల్ మాదిరిగా నిర్మించబడింది. ప్రాకారంలోని మంటపము 4000 అడుగుల పొడవు 21 అడుగుల వెడల్పు, 30 అడుగుల ఎత్తులో అందంగా నిర్మించబడినది. ఈ ప్రాకారంలో రామలింగ విగ్రహములు, శ్రీకోదండరామస్వామి, నటరాజ మందిరం, సేతుమాధవస్వామి ఆలయం, కోనేరు, ఇతర తీర్థాలు ఉన్నాయి.

ఈ ఆలయ పరిసరాలలో కోదండరామస్వామి, పార్వతి అమ్మవారు పర్వతవర్ధని, గంధమాదన పర్వతం, దర్భశయనం, ఆది జగన్నాథ మందిరం, దేవీపట్నం చూడవలసినవి. హనుమంతుడు సముద్రం దాటింది కూడా ఈ పర్వతం మీది నుంచే అని చెప్తారు. దర్భశయనం పక్కనే ఆదిశేషువు మీద విశ్రమిస్తున్న ఆదివిష్ణువు విగ్రహం ఉంటుంది. దీనినే జగన్నాథ మందిరం అంటారు.

**ధనుష్కోటి :** తమిళనాడు రాష్ట్రంలోని తూర్పు తీరమున ఉన్న, రామేశ్వరము దీవి యొక్క దక్షిణపు అంచునగల చిన్నగ్రామం ధనుష్కోటి. రామేశ్వరము



నుండి 35 కి.మీ. దూరంలో ఈ క్షేత్రం ఉంది. ధనుష్కోటి వరకూ ఉన్న రైల్వేలైను 1964లో సంభవించిన పెనుతుఫానులో, శిథిలం అయింది. మళ్లీ ఆ రైల్వేలైనును పునరుద్ధరించినా, పెద్ద ఇసుకతిన్నెలు పట్టాలను కప్పివేయగా దాన్ని ఉపయోగించడం నిలిపివేశారు. పూర్వము కాశీతీర్థయాత్ర, రామేశ్వరములో పూజచేసి, ధనుష్కోటి వద్ద మహోదధి (బంగాళాఖాతము) మరియు రత్నాకర (హిందూ మహాసముద్రము)ల సంగమ స్థలంలో పవిత్ర స్నానం చేయనిదే యాత్ర పూర్తికాదని భావించేవారు రామసేతుకు ఉపయోగించిన రాళ్ళు (నీటిపై తేలే రాళ్ళు) ఇప్పటికీ ఇక్కడ కనిపిస్తాయి. ఇక్కడి నుండే రామసేతువంతెన నిర్మించి లంకకు కలిపేలా చేయబడింది. ఒకప్పుడు పైకి కనిపిస్తూ ఉండే ఆ దారి తుఫానుల ప్రభావం వల్ల సముద్రంలో మునిగిపోయింది. ధనుష్కోటిని దర్శించే పిల్లలు లేని దంపతులకు సంతానం కలుగుతుందని ఓ నమ్మకం నేటికీ భక్తులలో ఉంది. రావణవధ అనంతరం వానరులు తాము కట్టిన సేతువును పగులుగొట్టినట్లు తెలియుచున్నది. శ్రీరాముడు కూడా తన ధనస్సు కొనతో వంతెనన పగుల గొట్టుటచే 'ధనుష్కోటి' అని పేరు వచ్చినది. అందుకే ఇచ్చట ఇసుకతో ధనస్సు ప్రతిమ చేయించి పూలతో పూజించి దూరంగా కన్పించే సేతువు అవశేషాలకు మొక్కుతారు.

ప్రస్తుతం ఈ క్షేత్రం పూర్తిగా సముద్రంలో మునిగిపోవుటచే ఇచట చేయగల్గే స్నానములు, పూజలు మొ॥వి రామేశ్వరంలోనే పురోహితులచే చేయబడుచున్నవి. ప్రస్తుతం ఈ స్థానంలో కేవలం 9 రాతిబండలు వరుసగా కనిపిస్తాయి. వాటిని నవగ్రహాలుగా భావిస్తారు. బృహస్పతి మహర్షి ఇక్కడ మనోదోష నివారణకై ప్రాయశ్చిత్తాన్ని ప్రకటించాడట. అందుకే పర్యాటకులందరూ ఇక్కడ స్నానం చేసి తమ పాపాల్ని కడిగేసుకుంటారు. ఇక్కడ కళ్యాణ జగన్నాథ స్వామి మందిరం ఉంది. ఆ స్వామి దర్భశయనుడై ఉంటాడు.

# 32. ధర్మస్థల

కర్ణాటకలోని పశ్చిమ కనుమల మధ్యగా మంగళూరు నుంచి సుమారు 25 కి.మీ దూరంలో షిరాది అనే ప్రాంతం ఉంది. ఆ షిరాధి నుంచి 15 కి.మీ. దూరంలో ధర్మస్థలక్షేత్రం ఉంది. ఇచ్చట మంజునాథస్వామివారి దేవాలయం ఉంది. ఈ క్షేత్రం హిందువులనేగాక అన్ని మతాలవారిని ఆకర్షిస్తూ వైష్ణవ పూజారుల చేత పూజలు నిర్వహించబడుచున్నవి. అమ్మవారు మంజునాథేశ్వరి.

మంజునాథుడు అనే పేరు గలవారు జైనదేవతలలో ఒకరు. కాని ఆదిదేవుడైన శంకరుడు సర్వసృష్టిలోని అందానికి అధిదేవత గనుక ఈ స్వామికి మంజునాథుడు అనే పేరు సార్థకమైంది. 'మంజు' అంటే అందమైనది. అలాగే కన్నడంలో 'మంజు' అంటే మంచు అని అర్థం. మంచుతో నిండిన కైలాస పర్వతం మీద నివసించేవాడు గనుక ఈ స్వామికి 'మంజునాథుడు' అనే పేరుతో పిలుస్తారు. ఆలయంలో ఉన్న స్వామివారి మూర్తి శివలింగ రూపంలో ఉండుట వలన హిందువులకూ స్వామి పేరు మంజునాథుడు అనేది జైనతీర్థంకరులలో ఒకరిపేరు అయినందున, రెండు సంప్రదాయాల వారికి ఒక పవిత్ర పుణ్యక్షేత్రమైనది.

ధర్మస్థలం ఆలయంలోని స్వామి శివుడు. పూర్వం ఉన్న శివలింగాన్ని మధ్వాచార్య ప్రవర్తకులైన శ్రీవాదిరాజాచార్యులవారు సంప్రదాయ బద్ధంగా పునః ప్రతిష్ఠించడమే గాక, ఆ స్వామికి "మంజునాథుడనీ", ఆ దివ్యస్థలం "ధర్మస్థలం" అనీ నామకరణం చేశారు. తరతరాలుగా హెగ్గడే వంశీయులచేత ధర్మబద్ధంగా పర్యవేక్షింపబడుతున్న క్షేత్రం "ధర్మస్థలం". ఈ క్షేత్రంలోని మంజునాథస్వామి మాటను నిలబెట్టుకొనే దేవుడు అని ప్రసిద్ధిని పొందాడు. అంటే భక్తుడు ఏదైనా కోరిక కోరితే, లేదా మనవి చేసుకొంటేచాలు, ఆ స్వామి అనుగ్రహించి, కోరికను తప్పక తీరుస్తాడని భక్తుల విశ్వాసం. ఈ



ఆలయంలో మరో విశిష్టత ఏంటంటే చుట్టుప్రక్కల ప్రాంతాలలో ఉండే ప్రజలలో ఎవరికైనా ఏ విషయంలోనైనా వివాదం లేదా ఒక సమస్యపై ప్రతిష్టంభన వస్తే ఈ మంజునాథస్వామి వద్దకు వచ్చి విషయం తెలియజేస్తారు. ఆలయ నిర్వాహకుడైన హెగ్గడేగారు ఇచ్చిన ఆ తీర్పు ఆ మంజునాథుని తీర్పుగా ఇరువర్గాలవారు భావించి, ఆ తీర్పుకు ఇరువురు కట్టుబడతారు.

ఇక్కడి ఆలయంలో ఉదయం 7.గం.ల నుండి మధ్యాహ్నం 1.గం. వరకు, తిరిగి సాయంత్రం 6.గం.ల నుండి 8.30 వరకు స్వామివారి దర్శనం లభిస్తుంది. ధర్మస్థలానికి 11/2 కి.మీ. దూరంలో నేత్రావతి నది ఉంది. భక్తులు మొదట ఈ నదిలో స్నానం చేసి వచ్చి తర్వాత ఆలయంలో స్వామివారి దర్శనం చేసుకోవడం ఇక్కడి ఆనవాయితీ.

## 33. గో కర్ణం

కర్ణాటక రాష్ట్రం ఉత్తర కన్నడ జిల్లాలో బెంగుళూరుకు 545 కి.మీ. దూరంలో గోకర్ణ క్షేత్రం ఉంది. ఇది గొప్ప శైవక్షేత్రంగా చాలా ప్రసిద్ధి చెందింది. ఇక్కడ స్వామి మహాబలేశ్వరుడు, అమ్మవారు తామ్రగౌరిగా పిలవబడుతుంది.

**స్థలపురాణం :** త్రేతాయుగంలో రావణాసురుడు గొప్ప తపస్సు చేసి శివుణ్ణి మెప్పించి ఆత్మలింగాన్ని భూలోకానికి తెస్తాడు. కానీ శివుడిచ్చిన ఆత్మలింగం స్వభావం ప్రకారం భూమిమీద ఎక్కడ పెడితే అక్కడ స్థాపితం అయిపోతుందని శివుడు ముందుగానే చెప్తాడు. రావణాసురుడు ఆ ఆత్మలింగాన్ని లంకలో ప్రతిష్ఠించాలని భావించాడు. దేవతలందరూ శ్రీ మహావిష్ణువును వేడుకోగా విష్ణువు తన మాయతో సూర్యాస్తమయం అయిందని భావించి సంధ్య వార్చుకోవడానికి ప్రయత్నించగా నారదుని కోరికమేరకు వినాయకుడు బ్రాహ్మణ బాలకునిగా రావణుని వద్దకు వస్తాడు. సంధ్య వార్చుకొని వచ్చే వరకు ఆత్మలింగాన్ని అతని చేతిలోనే ఉంచకోవలసిందని రావణాసురుడు వెళ్ళెను. మూడుమార్లు పిలిచేలోగా రాకపోతే ఆ లింగాన్ని భూమిపై నిలుపుతానని చెప్తాడు ఆ బాలకుడు. దానికి అంగీకరించి, వెళ్ళిన రావణాసురుడు, మూడుమార్లు పిలిచినా రాకపోయేసరికి నేలపై ఆత్మలింగాన్ని ఉంచుతాడు. రావణుడు పరుగున వచ్చి ఆత్మలింగాన్ని తీసుకోవడానికి ప్రయత్నిస్తాడు. తన మహాబలంతో ఆ శివలింగాన్ని పైకి లాగగా అది ఆవు చెవి ఆకారంవలె అరిగిపోయింది, కాని పైకి రాలేదు. అంతట శివుడు భక్తుని దీనావస్థను చూసి, జాలిపడి రావణుణ్ణి ఆత్మలింగాన్ని ఆ ప్రాంతంలోనే ఉంచి పూజించుకోమని చెప్తాడు. ఆ విధంగా ఈ క్షేత్రం గొప్ప పవిత్రతను పొందింది.

అక్కడ వెలసిన శివ ఆత్మ లింగానికి పడమర ముఖంగా చక్కని ఆలయం నిర్మించారు. ఈ ఆలయంలోని స్వామియే మహాబలేశ్వరుడు. రావణుడు



వంటి మహాబలవంతుడు కూడా ఈ ఆత్మలింగాన్ని పైకి ఎత్తలేకపోయాడు కనుక ఇక్కడ స్వామికి 'మహాబలేశ్వరుడు' అనే పేరు వచ్చింది. ఆలయంలో ఉన్న లింగం యొక్క సగభాగం భూమిలో దిగబడిపోయి ఉన్నది, పైన ఉన్న సగభాగం, శివుని యొక్క ఆత్మలింగం కనుక ఆ లింగం చుట్టూ నాలుగువైపులా కప్పివేస్తే ఒకదాని మీద ఒకటిగా రాళ్ళు పేర్చుకుంటూ వచ్చారు. అన్నిటికన్నా పైన ఉన్న రాయికి ఆవు చెవి (గోకర్ణం) ఆకారంలో ఉండే ఒక రంధ్రం ఉంది. ఈ రంధ్రం నాలుగు అడుగుల చదరంగా ఉంటుంది. మనం ఆ రంధ్రంలో చెయ్యిపెట్టి చూస్తే లోపల ఉన్న లింగం యొక్క కొనభాగం చేతికి తగులుతుంది. భక్తులు ఆ రాతి చుట్టూ కూర్చుని, రంధ్రంలోనుండి లోపల పడేటట్లు, స్వామివారికి స్వయంగా అభిషేకం చేస్తారు. ప్రతి 60 సం॥లకు ఒకసారి ఆత్మలింగం చుట్టూ ఉన్న రాళ్ళను తొలగించి, సంపూర్ణ లింగాన్ని అందరూ దర్శించుకొనేటట్లు చేస్తారు. ఈ సందర్భంలో ఇక్కడ గొప్ప ఉత్సవం జరుగుతుంది. దేశం నలుమూలల నుండి లక్షల సంఖ్యలో భక్తులు వస్తారు. మనం దేశంలో ఉన్న అందరు పీఠాధిపతులు కూడా వస్తారు. ఇది 60 సం॥లకు ఒకసారి జరగుతుంది కనక చాలామంది తమ జీవితకాలంలో స్వామివారి నిజరూపాన్ని దర్శించుకొనే అవకాశం కలగకపోవచ్చు. అందువలన ఇక ముందు 12 సం॥ల కొకసారి నిర్వహించాలనే ఆలోచన ఉన్నట్లు ఇక్కడి అర్చకులు తెలియజేస్తున్నారు.

ఆలయంలోకి ప్రవేశించగానే కుడివైపున వినాయకుని ఆలయం ఉంది. రావణాసురుడు మొట్టికాయ మొట్టాడు అనడానికి గుర్తుగా గణపతి మాడు మీద బొప్పిలాగా, ఒక గుంట ఉంటుంది. ఆ గణపతిని అందరూ తాకవచ్చు, అభిషేకం చేయవచ్చు. భక్తులు ఆ బొప్పికి వెన్నె పూస్తారు. ముందుగా వినాయకుడిని దర్శించుకొని తరువాత ప్రధాన ఆలయంలోని మహాబలేశ్వరుడిని దర్శించుకోవటం ఇక్కడి ఆలయ పద్ధతి. దానికి ప్రక్కనే

పార్వతీ దేవి ఆలయం కూడా ఉంది. ఆత్మలింగంలో ఉన్న పరమేశ్వరుడిని వెతుకుతూ, ఈ క్షేత్రంలో ఉన్నాడని తెలుసుకొని గౌరీదేవి వచ్చి ఆమెకూడా ఇక్కడే ఉండిపోయింది. అందువల్ల ఈ అమ్మవారిని 'తామ్రగౌరి' అని పిలుస్తారు. ఆ ప్రాంతాన్ని తామ్ర పర్వతమంటారు. గోకర్ణం ప్రాంతంలో నాగలింగం పూలుగా పిలిచే శివలింగ పుష్పాలు ఎక్కువగా దొరుకుతాయి. ఈ క్షేత్రం భూకైలాసంగా ప్రసిద్ధిచెందింది. సముద్ర స్నానం చేసి వస్తూ ఒక పాత్రలో సముద్రపు నీరు వెంట తెచ్చుకొని ఆ నీటితో స్వామికి అభిషేకం చేయటం ఇక్కడి పద్ధతి.



## 34. ద్రాక్షారామం (దక్షిణకాశి)

ఆంధ్రప్రదేశ్‌లోని పవిత్ర శివక్షేత్రాలలో యిది ఒకటి. పంచారామాల్లో యిదొకటి. సోమారామం క్షీరారామం (పాలకొల్లు) ప్రక్కనే ద్రాక్షారామం. దీనిని దక్షవాటికయని శ్రీనాథుడు పేర్కొన్నాడు. ఈ దేవాలయ అధినాథుడు భీమనాథుడు. పూర్వం కుంభకర్ణుని కొడుకు భీముడు పాపపరిహార నిమిత్తం యీ దేవాలయం నిర్మించాడట. రాజమండ్రికి 50 మైళ్ళ దూరం, రామచంద్రపురానికి 5 కి.మీ. దూరంలో వుంది.

చారిత్రకంగా యిది చాళుక్యులనాటి దేవాలయం. శిల్పం చాళుక్యులదే. ఇది రెండంతస్థుల దేవాలయం. ఇక్కడి శివలింగం 14 అడుగుల మొదటి అంతస్థులో మూలంవుండగా రెండవ అంతస్థులో లింగాకారం వుంటుంది. రెండవ అంతస్థు నుండి కూడా అభిషేకం చేస్తారు. ప్రక్కనే ఉన్న గోదావరిని సప్తగోదావరి అంటారు. కవిసార్వభౌముడు శ్రీనాథుడు యిక్కడ కొంతకాలం నివసించాడు. ఇక్కడే 'భీమేశ్వరపురాణం వ్రాశాడు. ద్రాక్షారామం చుట్టూ తోటలు 64 రకాల వరిపంటలు కొబ్బరి తోటలు పండేవట. దారిలో ద్వారపూడి కడియం గ్రామాలను పేర్కొన్నాడు. 'కడియం'ను పూలకడియం అని పేర్కొన్నాడు. అది ఇప్పటికీ పూలకడియమే పూలతోటలు, నర్సరీలు పరిశోధన మొక్కలు విస్తారంగా లభిస్తాయి. ఇక్కడ పూలమొక్కల వ్యాపారం ఎక్కువ.

ఈ క్షేత్రం గురించి శ్రీనాథుడు చెప్పిన చాటువు అనేకం ప్రచారంలో వున్నాయి.

**ద్రాక్షారామ చళుక్య భీమవర గంధర్వాప్సరో భావినీ**
**వక్షోజద్వయ కుంభికుంభములపై వాసించు తద్వాసనల్**
**అక్షయ్యంబగు సాంపరాయని తెలుంగాధీశ కస్తూరికా**
**భిక్షాదానము సేయరా సుకవిరాట్ బృందావన శ్రేణికిన్.**

ఆనాటి చాళుక్య ప్రభువును సాంపరాయని ప్రభువును, కస్తూరి భిక్షం పెట్టమని అడిగిన తీరు చమత్కారంగా చెప్పాడు. శ్రీనాథుడు భీమఖండములో, భీమేశ్వరునికి జరుగు నిత్య పూజలను, అర్చనలను, అభిషేకాల గురించి వ్రాశాడు. అలాగే పమ్మి వీరభద్రస్వామి, కుక్కుటేశ్వర స్వామి, అంతర్వేది నృసింహస్వామిని గూర్చి కూడా వ్రాశాడు.

**ద్రాక్షారామం గురించిన కథ :** ఇక్కడ దక్షయజ్ఞం జరిగింది కనుక దక్షారామం, దక్షపురి, దక్షవాటి అనే పేర్లు ప్రసిద్ధమైనాయి. చారిత్రకంగా దీనిని 9 వ శతాబ్దంలో భీమరాజు భీమనృపతి యీ దేవాలయాన్ని కట్టించాడని శాసనాలున్నాయి. కొన్ని మంటపాలను భీమరాజు కట్టించగా, ప్రదక్షిణ మంటపాన్ని కుమారగిరి రెడ్డి కట్టించాడట – ఇక్కడికి 3 కి.మీ. దూరంలోని రామచంద్రాపురం రాజులు కాకర్లపూడి వంశీయులు యీ దేవాలయానికి ధర్మకర్తలు ఈ శివలింగం క్రింది అంతస్థు నుండి పైదాకా పెరుగుతూ వస్తుండగా, స్వామివారి ఆజ్ఞప్రకారం ఒకమేకు కొట్టడంవల్ల పెరగడం ఆగిపోయిందని అంటారు. పైన కొంతభాగం చిట్లినట్టుంది. ఇక్కడ స్వామివారి దేవేరి మాణిక్యాంబ. ఈమె అష్టాదశ శక్తిపీఠాల్లో ఒక పీఠంగా అధిదేవతగా పూజలందు కుంటున్నది. ప్రధాన దేవాలయానికి తూర్పు భాగాన మాణిక్యాంబ ఆలయం ఉంది. కొంచెం ముందుగా పెద్ద శివలింగం వుంటుంది. సరిగ్గా గుడి ఎదుటనే సప్తగోదావరి కనిపిస్తుంది. ప్రతిశివరాత్రినాడు లక్షల కొలది భక్తులు అభిషేకాలు, దర్శనాలు చేస్తారు. క్రింది అంతస్థు చీకటిగా వుంటుంది. ఈ చీకటి పోవడానికి స్తంభాలకు రత్నాలు, వజ్రాలు, గోమేధిక, పుష్యరాగాలు చెక్కినారు. ఆ రాళ్ల వెలుగులో భక్తులు ప్రదక్షిణలు చేసేవారట కాని కొంతకాలానికి తురుష్కుల దండయాత్రలో ఈ రాళ్లను వజ్రాలను పెకిలించి తీసుకెళ్లిన గుర్తులు కన్పిస్తాయి. ప్రతి శివరాత్రి మహాద్భుతంగా జరుగుతుంది. ప్రతి కార్తిక పౌర్ణమినాడు జ్వాలాతోరణం, ఆకాశదీపాలు వెలిగిస్తారు. మాఘ శుద్ధ ఏకాదశిరోజున భీమేశ్వర కల్యాణం జరుగుతుంది.



ఇదే దేవాలయంలో లక్ష్మీనారాయణ విగ్రహాలకు నిత్యార్చనలు, ఆరగింపులు, హారతులు సమర్పిస్తారు. కనుక యిది శివ – కేశవ క్షేత్రంగా కూడా ప్రసిద్ధి చెందింది. శివుడు వ్యాసుని శపించడం వలన, వ్యాసుడు కాశిని వదలి యిక్కడ గోదావరీ తీరాన భీమవరక్షేత్రాన ఆశ్రమం ఏర్పాటు చేసికొని తపస్సు చేయడంవల్ల వ్యాసుని శక్తి చేతయిది "దక్షిణకాశిగా వర్ధిల్లినదట. ఈ మాణిక్యాంబ సాక్షాత్తు పార్వతీదేవియే. వేలాది మంది భిక్షువులకు పేదలకు నిత్యాన్న దాన సంతర్పణం జరుగుచుండుట వలన, ఈ దేవతను దక్షిణకాశిలో అన్నపూర్ణగా కొలుస్తారు. గోదావరిలో స్నానమాచరించి స్వామికి అభిషేకం చేసి భస్మధారణ చేసిన వారికి, అపమృత్యు, జరావ్యాధి, పాప, భయనాశనం అవుతుందని భక్తుల విశ్వాసం. కుమారారామం, క్షీరారామం సోమారామం, తదితర ఆరామాలకెల్ల శ్రేష్ఠమైనదిగా ద్రాక్షారామం. అదే దక్షారామం భావిస్తారు. దక్షవాటీ పురముగా ప్రసిద్ధి చెందిన ద్రాక్షారామం గురించి శ్రీనాథుడు వ్రాసిన యీ రెండు పద్యాలలో వుంది. అగస్త్యుడు శివుని స్థానమైన దక్షవాటిని యిలా వర్ణించాడు.

**అహరారంభములందు ప్రస్రవణ**
**శైలాధిక్యకాకందరా**
**కుహరక్రోడకటాహ వాగద్గద**
**నదద్గోదావరీ సింధువా**
**ర్లహరీ వవమాలికాశిరముల్**
**పంపాసరుల్ దండకా**
**గహనగ్రహవాయువుల్ తపసికిం**
**గావించె నాహ్లాదముల్**

ఆ నదద్గోదావరీ నదీ జలములపైన వీచే చల్లని గాలులు అగస్త్యునికి ఆహ్లాదం కలిగించాయట.

**ప్రాతః కాలము తీవ్రభానుడుదయింపన్**
**సప్తగోదావరీ**
**స్రోతః పూరమునన్ మునింగె యభవున్**
**సోమార్థ చూడామణిన్**
**జ్యోతిర్లింగమయస్వరూపు గొలిచెన్**
**శుద్ధాంతరంగంబునన్**
**పాతివ్రత్య మహాప్రభావనిధి లో-**
**పాముద్ర భీమేశ్వరున్**

అని మరోచోట "దక్షవాటిక సప్తగోదావరమున మునిగి భీమేశ్వరు గొలిచె మునివరుండు" – అని చెప్పడంలో అటు గోదావరి, యిటు భీమేశ్వరుని ప్రశస్తి ఎంతదో ఊహించవచ్చు.



# 35. కురుక్షేత్రం

ఉత్తర దేశయాత్రలకు వెళ్లినవారు, ఢిల్లీ నగరాన్ని దర్శిస్తారు. ఢిల్లీలోని ఎర్రకోట, స్వామినారాయణ్ మందిరం, బిర్లా మందిరం, గాంధీ సమాధి, జంతర్‌మంతర్, ఆగ్రాలో తాజ్‌మహల్, ఫతేపూర్‌సిక్రీ యివన్నీ చూచి వస్తారు. చక్కగా ఢిల్లీ నుండి జ్ఞాపకాలను మోసుకుంటూ హరియానా రాష్ట్రంలోని 'కురుక్షేత్రం' చూడడానికి ఉబలాట పడుతుంటారు. ఎందుకా ఆతురత, అంటే!

అది కురుక్షేత్రం – ధర్మానికి, అధర్మానికి పోరాటం జరిగిన స్థలం. యుద్ధం జరగకూడదనే ప్రయత్నాలు చేయడం మొదటి ఘట్టం. యుద్ధం అని వార్యం ఆయిన ఘట్టం రెండవది. ఇది కౌరవుల పాండవుల, రెండు కుటుంబాలకథ. రాజ్యకాంక్ష యిక్కడ బలమైన విషయం. కౌరవులకు పెద్ద ధృతరాష్ట్రుడు. ఆయన నూర్గురు కొడుకులలో పెద్ద సుయోధనుడు. కోపము – అసూయ మూటగట్టుకున్నవాడు. యౌవరాజ్యాభిషిక్తుడై సమస్త భూతలాన్ని ఏలిన చక్రవర్తి కావాలని ఆకాంక్ష. కాని పాండురాజు పుత్రులు అయిదుగురిలో పెద్దవాడు ధర్మరాజు – యమధర్మరాజు అంశాన పుట్టినవాడు. శాంతమూర్తి, ధర్మమూర్తి, సహనం శాంతికి నిలయం. ఆడినమాట తప్పని అపర శ్రీరాముడు. పైగా శ్రీకృష్ణ విధేయుడు.

ఇంతటి గొప్ప వంశం వీరిది. పాండవులలో భీముడు, అర్జునుడు, నకుల, సహదేవులు అంతా వీరులే. వీరందరికీ ప్రాతఃస్మరణీయుడు, ఆరాధ్యదైవం శ్రీకృష్ణపరమాత్మ, పాండవులకు ఐదూళ్లిచ్చినా చాలు. వారు మీ జోలికి రారు, అని ధృతరాష్ట్రునికి చెప్పి చూచాడు. దుర్యోధనుడు ససేమిరా వినలేదు "వాడిసూది మొన మోపినంత భూమిని కూడ యివ్వనన్నాడు. సంధి మాటలు అందరూ చెప్పి చూచారు. శ్రీకృష్ణుడు పాండవుల పక్షాన రాయబారం నిర్వహించాడు. కృష్ణుని మాటలు వినక

పోగా, త్రాళ్లతో బంధించాలని ప్రయత్నించారు. శ్రీకృష్ణుడు నిండుసభలో విశ్వరూపం చూచి, ధృతరాష్ట్రుని కళ్లు తెరిపించాడు. దుర్యోధనుని దౌర్జన్య దురహంకారాలను నేను చూడలేను కృష్ణా! నాకీ కళ్లు వద్దు – పూర్వపు స్థితినే కలిగించుమన్నాడు. అలాగే తిరిగి గ్రుడ్డివాడయ్యాడు. గుడ్డిలోకం, గుడ్డిపరిపాలన, అదొక గుడ్డియుగం, ధర్మం గుడ్డిదయింది. అప్పుడు శ్రీకృష్ణపరమాత్మ చెప్పాడు. మామా! యుద్ధము అనివార్యమయిన పక్షమున, నేనొక్కడను పాండవుల పక్షాన నిలబడతాను. ఆయుధము పట్టను, యుద్ధము చేయను. కాని అర్జునుని విజయంకొరకు రథసారథ్యము చేసి పార్థసారధి నౌతాను – అని కృష్ణుడు సభలోనే శంఖం పూరించాడు.

వాళ్లది నిజంగా భూమిపోరాటమే కౌరవుల రాజ్యదాహం క్రింద ధర్మశీలురైన పాండవులు బలైపోయారు. అంతకు ముందే ఎన్నో యిబ్బందులకు గురిచేశారు. లక్క యింట్లో వారిని బంధించి కాల్చారు. తెలివిగా పాండవులు బయటపడ్డారు. త్రాటం గట్టిరి. నీట నెట్టిరి, విషాన్న ముం బెట్టిరి. చివరకు మాయా జూదంలో శకుని దుష్టవ్యూహంవల్ల పాండవులు 12 ఏండ్లు వనవాసం, ఒక సంవత్సరం అజ్ఞాతవాసం గడిపారు. చివరకు విరాట రాజు కొలువులో వున్నప్పుడు ద్రౌపది పడిన బాధలు వర్ణనాతీతం. కీచకుని భీముడు చంపిన తర్వాత పాండవులకు ఊరట కలిగింది. వెంటనే ఉత్తరగోగ్రహణంలో అర్జునునికే విజయం. ఇన్ని జరిగాక దుష్టకౌరవులకు పాండవుల మీద జాలి కలుగలేదు. అన్నిటికీ జవాబు కురుక్షేత్రమే ఆనుకున్నారు.

కౌరవపాండవం రణశూరులు, అతిరథమహారథులు సమరభూమి కురుక్షేత్రం ఎంచుకున్నారు. సైన్యాలను మోహరించారు. "భీష్మద్రోణ కృపాది ధన్వినికరాభీలంబు యుద్ధ రంగాన మోహరించగా అర్జునుడు ఒక్కసారి తేరిపార జూచి భయపడ్డాడు – తాతలు, తండ్రులు, గురువులు, అన్నదమ్ములు,



హితులు, స్నేహితులతోనా, నేను పోరాటం చేసేది? అని భావించి శ్రీకృష్ణునితో బావా! నే నీ యుద్ధం చేయలేను అన్నాడు అర్జునుడు. ఇంత బలవంతుడివి. గాండీవి, పాశుపతాస్త్రాలు సధించితివి – అర్జున, ఫల్గుణ, కిరీట, శ్వేతవాహన, ధనుంజయ, విజయ, గాండీవి అను పేర్లు గల నీవు సమరంలో వెన్ను జూపుతావా! అని వాసుదేవుడు చెప్పి, నేను నీ రథంలో కూర్చుని వున్నాను. విజయం నీ వైపేవుంది, అని ధైర్యం చెప్పి యుద్ధానికి పురికొల్పిన క్షేత్రం కురుక్షేత్రం.

**"కర్మణ్యేవాధికరస్తే మాఫలేషు కదాచన"**

కర్మ – పని చేయడమే నీవంతు. ఫలితాన్ని ఆశించకు. ఇది యుద్ధరంగం, యుద్ధంలో వీరుడేం చేస్తాడు. శస్త్రాస్త్రాలు ధరించి శత్రుమూకను చీల్చి చెండాడి విజయబావుటాను ఎగుర వేస్తాడు. ఇది ధర్మక్షేత్రం యుద్ధానికి సిద్ధం కమ్మని శ్రీకృష్ణ పరమాత్మ అర్జునుని మూలంగా యావత్ప్రపంచమానవాళికి కర్తవ్యబోధాంశం గల భగవద్గీతను ఉపదేశించిన "కురుక్షేత్రం కృష్ణం వందే జగద్గురుమ్ అని పేరు రావడానికి కారణమైనది ఈ క్షేత్రం. కనుక జగద్గురువైన శ్రీకృష్ణుడు బోధామృతం పంచినాడు కనుక యిది గురుక్షేత్రం. యుద్ధరంగంలో కౌరవులవైపు భీష్ముడు, ద్రోణుడు, కృపుడు, ఆశ్వత్థామ, శల్యుడు, శకుని ఇంకా గాంధార, కుకుర, సౌరాష్ట్ర అధిపతులుండగా, పాండవులవైపు శ్రీకృష్ణుడు, సాత్యకి, కాగా ధర్మరాజు రాజసూయయాగం చేసినపుడు సాయంచేసిన సామంతరాజులు తమ తమ సైన్యాలతో వచ్చి చేరారు. మొత్తం యుద్ధరంగంలో 18 అక్షౌహిణుల సైన్యంతో 18 రోజులు యుద్ధం జరిగింది. భగవద్గీతను చెప్పింది 18 అధ్యాయాలు, 18వేల శ్లోకాలు. ఎంతో విశాలమైన స్థలంలో యుద్ధకాండ జరిగింది. లక్షలమంది నిహతులైన రణక్షేత్రం కురుక్షేత్రం. ఒక్క అర్జునుడే కౌరవులసైన్యాన్ని ఢీ కొన్నాడు. ఆయన బాణాలు కురుక్షేత్రంలో వర్షపు జల్లులై కురిశాయట.

**"నరచాపప్రవిముక్తదారుణ బృహన్నారాచధారల్ భయం**
**కరదైతేయ నికాయ కాయములపై గప్పెన్ దిశల్నిండ బం**
**ధుర ధాత్రీధర తుంగశృంగతటసందో హంబుపై కప్పుదు**
**ర్ధర ధారాధరముక్త సంతతి పయో ధారావళిం బోలుచున్"**

మేఘాలనుండి జారిన వర్షపు జల్లుల్లాగా బాణాలను శత్రుమూకల మీద ఫల్గునుడు కురిపించాడు. అలాంటి విజయక్షేత్రమే కురుక్షేత్రం.

ఇదే క్షేత్రంలో "భీష్మాచార్యుడు – శిఖండిని చూచి యుద్ధం చేయనని అంపశయ్యను ఏర్పాటు చేయమన్నాడు. అర్జునుడు తన గాండీవ పాండిత్యంతో అంపశయ్యను నిర్మించాడు. భీష్ముడు పవ్వళించి చూస్తున్నాడు. ఆతనికి తెలిసిపోయింది, అర్జునుని మీద ఎవడూ గెలవలేడు అని. ఇది భీష్ముని అభిప్రాయం. అలాంటి యోధుడు పవ్వళించి ధర్మరాజుకు కొన్ని జీవన ధర్మాలను తెలిపిన ధర్మక్షేత్రంలో "విష్ణు సహస్రనామాలను" లోకానికి అందజేసిన జ్ఞానక్షేత్రం యీ కురుక్షేత్రం. జ్ఞానానికి, అజ్ఞానానికి, సత్యానికి, అసత్యానికి పోరు జరిగిన సమరక్షేత్రం. ఇంతటి చరిత్ర కలిగిన క్షేత్రమైన "కురుక్షేత్రాన్ని దర్శిస్తేచాలు. మనస్సు నిర్మాలమౌతుంది. హృదయం ధర్మక్షేత్రమౌతుంది.



# 36. యాదగిరిగుట్ట శ్రీలక్ష్మీనరసింహస్వామి క్షేత్రం

నల్లగొండ జిల్లా, యాదగిరిగుట్ట మండలం, భువనగిరి నుండి 9 కి.మీ. దూరంలో గల యాదగిరిగుట్ట మీద శ్రీలక్ష్మీనరసింహస్వామి వారు కొలువై ఉన్నారు. ఇది హైదరాబాదుకు సుమారు 60 కి.మీ. దూరంలో ఉంది. సృష్టికి పూర్వం శ్రీమహావిష్ణువు నరసింహరూపంలోనే బ్రహ్మకు దర్శనం ఇచ్చి, "ఉగ్రంవీరం మహావిష్ణుం జ్వలంతం సర్వతోముఖం, నృసింహం భీషణం భద్రం మృత్యోర్మృత్యుం నమామ్యహం" అని మంత్రోపదేశం చేశారట. దీనివల్లే బ్రహ్మకు వేద దర్శనమై, ఆ తరువాత సృష్టి మొదలు పెట్టాడట. అంతటి ప్రాముఖ్యం ఉన్న అవతారం నరసింహావతారం. అలాంటి నరసింహుడు వెలసిన పుణ్యక్షేత్రం యాదగిరి. మన రాష్ట్రంలోని ప్రముఖ దేవాలయాల్లో ఒకటిగా త్రేతాయుగంలోనే ఇక్కడ స్వామి వెలిశారని ప్రతీతి. ఇది స్వయంభువు నరసింహస్వామి ఆలయంగా భాసిల్లుతున్నది. శ్రీ వేదవ్యాస మహర్షి రచించిన నరసింహపురాణంలోనే కాక స్కాంద, బ్రహ్మాండ, మాహాత్మ్యం పురాణాల్లో కూడా యాదగిరి క్షేత్ర ఉంది. క్రీ.శ.1148 సంవత్సరంలో త్రిభువన మల్లుడు ఆంధ్రదేశంలోని రాజులను ఓడించి భువనగిరిలోని ఏకశిలా పర్వతం పై కోటను నిర్మించి యాదగిరి లక్ష్మీనరసింహస్వామివారిని సేవించినట్లు కొలనుపాకలోని జగద్దేవుని నారాయణస్వామి ఆలయంలో గల శాసనం ద్వారా తెలుస్తుంది. క్రీ.శ.15వ శతాబ్దంలో శ్రీకృష్ణదేవరాయలు దండయాత్రకు వెళ్తూ మార్గ మధ్యలోగల ఈ క్షేత్రాన్ని దర్శించినట్లు చరిత్ర వల్ల తెలుస్తుంది.

స్థలపురాణం ప్రకారం అహోబిల క్షేత్రంలో హిరణ్యకశిపుని వధించిన తరువాత ఉగ్రరూపం చల్లారని నరసింహస్వామిని బ్రహ్మాది దేవతలు, మహర్షులు ప్రసన్నుని చేసుకోలేకపోయారు. వారంతా లక్ష్మీదేవిని ప్రార్థించి

ఆయనను శాంతపరచవలసిందిగా కోరారు. లక్ష్మీదేవి కోరిక మేరకు స్వామి శాంతించిన క్షేత్రంగా భావిస్తారు అందుకే ఈ క్షేత్రానికి శ్రీలక్ష్మీనరసింహస్వామి వారి దేవస్థానంగా పేరు గాంచింది. ఈ క్షేత్రానికి సంబంధించిన కథకు మూలం వాల్మీకి రామాయణంలోని విభాండక రుషి. అతని కుమారుడు రుష్యశృంగుడు. ఈతని కుమారుడు యాదరుషి (యాదర్షి). చిన్నప్పటినుండి నరసింహుడి భక్తుడైన అతనికి ఆ స్వామిని దర్శించాలని బలమైన కోరిక ఉండేదట. ఆ స్వామికోసం అడువులు, కొండలు, కోనలూ తిరిగాడు. కాని దర్శనం కాలేదు. అలా తిరుగుతూ ఒకరోజు యాదర్షి ప్రస్తుత యాదగిరి అరణ్య ప్రాంతానికి చేరుకుని అలసిపోయి ఒక రావిచెట్టు కింద నిద్రించగా అపుడు కలలో ఆంజనేయస్వామి కనిపించి, 'నీ పట్టుదల నాకు నచ్చింది. నీకు తోడుగా నేనుంటాను. కఠోర తపస్సు చేస్తే స్వామి తప్పక ప్రత్యక్షమౌతాడు' అని చెప్పాడట. నిద్రలేచిన యాదర్షి వెంటనే అక్కడే తపస్సు మొదలుపెట్టాడు. కొన్నాళ్ళకు ఉగ్రనరసింహుడు ప్రత్యక్షమయ్యాడట. ఆ తేజస్సును చూడలేక శాంత స్వరూపంతో కనిపించమని కోరాడట. అపుడు లక్ష్మీ సమేతంగా దర్శనమిచ్చి 'ఏం కావాలో కోరుకో' అని అడిగాడు. "నీ దర్శనం కోసం ఇంత ఘోర తపస్సు సామాన్యులు చేయలేరు కావున నీవు ఈ శాంత రూపంతోనే ఇక్కడ కొలువై ఉండిపోవాలని కోరగా, అపుడు కొండమీద స్వామి ఆవిర్భవించాడు. కొన్నాళ్ళ తరువాత యాదర్షికి మరో కోరిక కలిగింది. స్వామిని ఒకే రూపంలో చూశాను. వేర్వేరు రూపాల్లో చూడలేకపోయాననే అనుకొన మళ్ళీ తపస్సు మొదలుపెట్టాడు. కొన్నాళ్ళకు స్వామి ప్రత్యక్షమయ్యాడు. "నా రూపాలన్నీ నీవు చూడలేవు. అయినా నీ కోసం మూడు రూపాలు చూపిస్తానని జ్వాలా, యోగానంద, గండభేరుండ నరసింహరూపాల్లో దర్శనమిచ్చాడు. తరువాత యాదర్షి తనను స్వామిలో



ఐక్యం చేసుకోమని కోరడంతో అతనిని తనలో ఐక్యం చేసుకున్నాడట స్వామి. ఆ యాదర్షి పేరు మీదే ఇది యాదగిరి గుట్టగా ప్రస్తుతం యాదాద్రిగా కీర్తించబడుతుంది. ఈ విధంగా గుట్టమీద గుహలోనే వెలసిన జ్వాలా నరసింహుడు దేవతలకు, మునులకు ఆరాధ్యుడై చిరకాలం ఆ గుహలోనే ఎవరికీ తెలియకుండా ఉండిపోయాడు. తరువాత కలియుగంలో ఆయనకు ప్రజల్లోకి రావాలనే కోరిక కలిగి అపుడా స్వామి కొండ దిగువున పల్లెలో ఉన్న గ్రామాధికారి కలలో కన్పించి, తాను ఈ ప్రాంతంలో నాలుగు రూపాలలో ఉన్నానని గుర్తులు చెప్పగా, గ్రామాధికారి ఉదయమే కొంతమందితో కలిసి కొండపైకి వెళ్ళి గుహను పరిశీలించి రేఖామాత్రంగా ఉన్న స్వామి రూపాలనూ, గుహనూ, ఆంజనేయస్వామి వారిని కనుగొన్నాడు. ఆనాటినుండి ఆ జ్వాలా నరసింహుడు ప్రజలందరికీ ఆరాధనీయుడై పూజలందుకుంటున్నాడు.

ఇపుడా గుహయందు ఆ నరసింహస్వామితో పాటు ఆంజనేయుడు, గరుత్మంతుడు, ఆండాళమ్మ మొ॥గు విగ్రహమూర్తులు ఉన్నాయి.

స్వామి వెలసిన స్థలం కొండపైన గల గుహలో ఉంది. ఇప్పుడు ఈ ప్రదేశాన్ని తొలచి ఇంకా విశాలంగా తీర్చిదిద్దారు. లోనికి వెళ్ళే ముందు పంచముఖ ఆంజనేయస్వామి వారి ఆలయం ఉంది. ఆంజనేయస్వామి గుడి ఉన్న బండపై గండబేరుండ నరసింహమూర్తి, గర్భగుడిలో జ్వాలా నరసింహస్వామి వారు, మరికాస్త లోపల యోగముద్రలో యోగానంద నరసింహస్వామి, లక్ష్మీనరసింహస్వామి ఉన్నారు.

ఈ క్షేత్రంలో ప్రదక్షిణల మొక్కు ప్రధానమైంది. మండలం (41 రోజులు), అర్ధమండలం, 11 రోజుల ప్రదక్షిణల మొక్కులు మొక్కుకుంటారు భక్తులు. నిత్యం గర్భాలయానికి రెండుసార్లు, ఆంజనేయస్వామికి 16 సార్లు ప్రదక్షిణ

చేస్తారు. ఈ మొక్కు తీర్చుకునే దశలో స్వామి కలలోనే తమకు శస్త్ర చికిత్సలు చేసి శారీరక, బాధల నుండి విముక్తి చేస్తాడని నమ్ముతారు. ఏటా ఫాల్గుణ మాసంలో 11 రోజుల పాటు నరసింహుని బ్రహ్మోత్సవాలు జరుగుతాయి. వైశాఖమాసంలో నరసింహ జయంతోత్సవం కూడా ఇక్కడ ఎంతో వైభవంగా నిర్వహిస్తారు. అన్నవరం తరువాత సత్యనారాయణ స్వామి వ్రతాలకు అంత ప్రసిద్ధి చెందిన క్షేత్రం ఈ యాదాద్రి (యాదగిరిగుట్ట).

ఈ క్షేత్రం గురించి ఎందరో కవులు, కీర్తనలు, పద్యాలు, శతకాలు వ్రాశారు. మరింగంటి కవులలో ఒకరు శ్రీయాదగిరిలక్ష్మీనరసింహశతకం వ్రాశారు. హనుమచ్ఛాస్త్రి అనే భక్తుడు, అపర అన్నమయ్యలాగా, స్వామిమీద అనేక కీర్తనలు రచించాడు. ప్రతి సంవత్సరం ఫాల్గుణ మాసంలో జరిగే బ్రహ్మోత్సవాలు విశేషాలు అనేకం. నిత్యహోమాలు, బలి, ఆరాధనలు గరుడోత్సవం, ధ్వజారోహణం, చూడతగినవే. సంతానార్థులు వచ్చి ధ్వజారోహణంనాడు "గరుడముద్ద" ప్రసాదం తీసుకుంటారు. ఇక్కడ క్షేత్రం ప్రకృతి రమణీయకంగా కనిపిస్తుంది. గుట్టమీదగల బ్రహ్మకుండంలో భక్తులు స్నానాలు చేసి బారులు తీరి, స్వామిని చూచి వారి కటాక్షాన్ని పొంది తృప్తిగా వెళతారు.

ఈ ప్రాంతం వారు, ఏ రకమైనా భాధలున్నా, ఉన్మాదం, భూతప్రేత పిశాచబాధలకు లోనైనవారు స్వామివారి సన్నిధిలోవుంటూ మండల 40 రోజులు ప్రదక్షిణం చేసినవారికి సర్వరోగాలు మాయ మౌతాయని నమ్మకం. కొన్నేండ్ల క్రింద ఒక వైష్ణవస్వామికి విపరీతమైన కడుపు నొప్పిరాగా, దేవుణ్ణి వేడకున్నాడు. ఆ రాత్రే స్వామివారు డాక్టరు రూపంలో వచ్చి ఆపరేషన్ చేసి వెళ్లాడు. తర్వాత, పెద్ద పెద్ద ఆసుపత్రి డాక్టర్లు వచ్చి రోగికి ఆపరేషన్ గుర్తులను బట్టి స్వామివారి మాహాత్మ్యాన్ని కొనియాడారు. స్వామి డాక్టరుగా రోగాలు కుదిర్చిన ఉదంతాలు చాలా వున్నాయి.



ఇప్పుడు తెలంగాణాలో ఈ దేవాలయ అభివృద్ధికి ప్రస్తుత ప్రభుత్వం 100 కోట్ల రూపాయలతో నాలుగు మాడ వీధులను, ఎత్తైన గోపురాలతో సర్వాంగ సుందరంగా తీర్చి దిద్దటానికి, ప్రయత్నాలు చేస్తున్నది. ఇటివల రాష్ట్రపతి ప్రణబ్‌ముఖర్జీగారు స్వామివారిని దర్శించి, ఈ క్షేత్ర అభివృద్ధి పథకాలను అభినందించారు.

ఉగ్రరూపం వదలి పంచముఖ నారసింహ రూపాలతో అనుగ్రహిస్తున్న యీ దేవుడు ముఖ్యంగా తెలంగాణలో దేవాలయ శిరోమణిగా వెలుగగలదని ఆశిద్దాం.

# 37. శ్రీకాళహస్తీశ్వరస్వామి దేవాలయం

ఆంధ్రప్రదేశ్ రాష్ట్రంలోని చిత్తూరు జిల్లాలోని స్వర్ణముఖి నది ఒడ్డున గల ప్రాచీన శైవక్షేత్ర ఈ శ్రీకాళహస్తీశ్వర ఆలయం. ఈ ఆలయమును క్రీ.శ. 12వ శతాబ్దంలో రాజేంద్ర చోళుడనే రాజు కట్టించాడని చరిత్ర చెప్తుంది. పరమేశ్వరుడు ఇక్కడ స్వయంభువుగా అవతరించాడని ఇక్కడి స్థలపురాణం శ్రీకాళహస్తిని 'దక్షిణ కాశి' అని కూడా అంటారు. ఇది దక్షిణభారతదేశంలోనే ప్రాచీనమైనదని మరియ పంచభూత లింగములలో నాల్గవదైన వాయులింగం గల గొప్ప శైవ పుణ్యక్షేత్రము. ఇక్కడ రెండు దీపాలలో ఒకటి ఎప్పుడూ గాలికి రెపరెపలాడుతూ ఉంటుంది. మరోదీపం ఎప్పుడూ నిశ్చలంగా ఉంటుంది. ఈ ఆలయంలోని మూడు గోపురాలు ప్రాచీన భారతీయ వాస్తుకళకు నిదర్శనాలు. వీటిలో ఎత్తైన దాలిగోపురం శ్రీకృష్ణదేవరాయ కాలంలో నిర్విహించబడింది. ఇక్కడి మరో ప్రధాన ఆకర్షణ వెయ్యికాళ్ళ మంటపం.

**క్షేత్రపురాణం :** స్వర్ణముఖి నదీతీరమున వెలసిన శ్రీ కాళహస్తీశ్వరుడు, స్వయంభూలింగము. ఇక్కడ అమ్మవారు జ్ఞాన ప్రసూనాంబా దేవి. అంబా త్రయములో ఈమె ఒకరు. ఇక్కడి శివలింగము వర్తులాకారమువలె గాక చతురస్రముగ ఉంటుంది. ఇచ్చట బ్రహ్మకు జ్ఞానమును ప్రసాదించిన ప్రదేశముగా స్థలపురాణం. ఈ పవిత్రస్థలంలో పరమేశ్వరుని అత్యంత భక్తితో శ్రీ(సాలెపురుగు), కాళ (పాము), హస్తి (ఏనుగు) ఈ మూడు ప్రాణులు పూజించి ముక్తి పొందినవి. అందువలనే ఈ స్థలమునకు 'శ్రీకాళహస్తి' అని పేరు వచ్చింది.

కన్నప్ప అనే వేటగాడు నిత్యం స్వామిని కొలుస్తుండేవాడు. అతని భక్తిని పరీక్షించడానికి స్వామి ఒకరోజు తన కంటి నుండి రక్తం కార్చాడట. వెంటనే కన్నప్ప తన కన్ను పీకి స్వామి కంటికి అమర్చాడట. అపుడు స్వామి రెండవ కంటి నుండి కూడా రక్తం కారడం మొదలైంది. భక్తుడైన



కన్నప్ప వెంటనే తన రెండవ కన్నును కూడా పీకి స్వామికి అమర్చాడట. అపుడు ఆ భక్తికి మెచ్చి స్వామి ప్రత్యక్షమై కన్నప్పని కరుణించి ముక్తిని ప్రసాదించాడు.

కాశీక్షేత్రములో వలె ఇక్కడ చనిపోయేవారికి పరమశివుడు ఓంకారమంత్రమును, తారకమంత్రమును ఉపదేశించి మోక్షము ఇస్తాడని భక్తుల నమ్మకము. దేవాలయమునకు సమీపమున గల కొండపై భక్త కన్నప్ప ఆలయము ఉన్నది. ఆదిశంకరాచార్యుల వారు ఈ క్షేత్రములో అమ్మవారి సన్నిధిలో శ్రీచక్రము స్థాపించారు. ఈ క్షేత్రమునకు దక్షిణకైలాసము, సత్యమహాభాస్కరక్షేత్రము, సద్యోముక్తి క్షేత్రము, శివానందైక నిలయము అని అనేక పేర్లున్నాయి.

మహాశివరాత్రినాడు ఇక్కడ బ్రహ్మాండమైన ఉత్సవం ఎంతో వైభవంగా జరుగుతుంది. ధూర్జటి కవి స్వామి పేరు మీదుగా శ్రీకాళహస్తీశ్వర శతకం ఇక్కడే వ్రాశాడు.

ఈ దేవాలయం దేశంలోని అతి పెద్ద దేవాలయాలలో ఒకటి. రాహుకేతు సర్పదోష నివారణ పూజలు ఈ ఆలయంలో విశేషంగా జరుగుతాయి. దేశం నలుమూలల నుంచి వచ్చిన భక్తులు ఇక్కడ మన దోషనివృత్తి కోసం రాహు, కేతు పూజలు చేయిస్తారు. ఇంకా రుద్రాభిషేకం, పాలాభిషేకం, పచ్చకర్పూరాభిషేకం మొ॥న పూజలు కూడా జరుగుతాయి.

మహాశివరాత్రి సందర్భంగా వారం రోజుల పాటు ఈ క్షేత్రంలో అంగరంగవైభవంగా బ్రహ్మోత్సవాలు జరుగుతాయి. అందంగా అలంకరించిన తెప్పలపై స్వామివారిని మరియు అమ్మవారిని కోనేటిలో విహారం చేయిస్తారు.

సప్తఋషులలో ఒకడైన అగస్త్యుడు ఈశ్వరుని ఆజ్ఞమేరకు ఈ దక్షిణ కైలాసములో శ్రీకాళహస్తీశ్వరుని చెంతకు వచ్చి ఈ ప్రాంతమున నీళ్ళు లేవని మొరపెట్టుకోగా ఈశ్వరుని ఆజ్ఞతో బ్రహ్మ ఆకాశగంగను భూలోకమును తెప్పించెను. అదే స్వర్ణముఖి. ఇక్కడే వినాయకుని మహత్వమును తెలిపే కథ ఒకటుంది. అదే పాతాళ వినాయకుని

మాహాత్మ్యము. స్వర్ణముఖీ నది వినాయకుని కోపముచే ఒకసారి ఎండిపోయింది. దక్షిణ కైలాసమునకు వచ్చిన అగస్త్యుడు వినాయకుని దర్శింపకపోవడం వల్ల ఇలా జరిగింది. అపుడు తన తప్పును గుర్తించిన అగస్త్యుడు వినాయకుని పూజించగా అతని అనుగ్రహమునకు పాత్రుడైనట్లు స్థలపురాణం చెప్తుంది. వినాయకుడు లోతైన స్వర్ణముఖి నదిలో కనిపించడం వల్ల పాతాళ వినాయకుడని పేరు వచ్చింది. 20 మెట్లు కిందికి దిగి ఈ స్వామిని దర్శించాలి. పేరుకు తగ్గట్లుగా స్వామి భూమికి 35 అడుగుల లోతున ఉన్నాడు. కావున ఆది గణపతి, సర్వగణాధిపతి అగు శ్రీపాతాళ వినాయకుణ్ణి తప్పక ముందుగా దర్శించి తీరాలి అన్నది శ్రీకాళహస్తీశ్వర క్షేత్ర గొప్ప కథలలో ఒకటి.

అష్టదిగ్గజాలలో ఒకరైన ధూర్జటి మహాకవి శ్రీకాళహస్తి గ్రామస్థుడే. ఈయన అర్చకుడేగాక గొప్ప శివభక్తుడు. శ్రీకాళహస్తీశ్వరా అనే మకుటంతో ఒక శతకంతో పాటు "శ్రీకాళహస్తీశ్వర మాహాత్మ్యం" కావ్యం వ్రాశాడు. శ్రీకృష్ణదేవరాయల కాలంలో ఈయన అక్కడ పేరు గాంచిన ఎనమండుగురు కవులలో ఒకరని చెప్తారు. శ్రీకాళహస్తీశ్వర శతకంలోని ప్రతి పద్యము శివభక్తి రసామృతమే. ఆయనకు ఈ ప్రపంచమే ఒక మహాలింగంగా కనిపించిందట 'ఉదయగ్రావము పానవట్టము' అనే పద్యం ఆయన అపార శివభక్తికి తార్కాణం. కేవలము శివుడొక్కడే యీ లోకానికి ప్రభువు. ఇతరములైన రాజులందరూ రాచరిక మదోన్మత్తులని నిరసించారు. తన కావ్యాలను శివుడికే అంకితమిచ్చాడు, నరాంకితము చేయలేదు.

**"రాజుల్ మత్తులు వారిసేవ నరకప్రాయంబు,**
**వారిచ్చు నంభోజాక్షే చతురంగ యానములు**

భూషలు, వృధా అంటాడు – శ్రీకాళహస్తీశ్వరుని సందర్శించిన భక్తులు తప్పకుండా శ్రీకాళహస్తీశ్వర శతకాన్ని చదవాలి. చిత్తూరు జిల్లాలో తిరుపతికి వచ్చిన భక్తులు తప్పకుండా శ్రీకాళహస్తిని దర్శించి తరించి వెళ్తారు.



## 38. కోల్హాపూర్ - శ్రీమహాలక్ష్మీదేవి ఆలయం

కర్ణాటకలోని హుబ్లీ నుండి మహారాష్ట్రలోని పూణె వరకు ఉన్న రైల్వే మార్గం మధ్యలో మీరజ్ అనే జంక్షన్‌స్టేషన్ ఉంది. మీరజ్ నుండి సుమారు 48 కి.మీ. దూరంలో కోల్హాపూర్ ఉంది. ఇది మహారాష్ట్రలోనే కాక మన భారతదేశం మొత్తం మీద అత్యంత పురాతనమైన క్షేత్ర నగరాలలో ఈ కొల్హాపూర్ ఒకటి. సిరులతల్లి, శ్రీహరి పట్టపురాణి అయిన ఆ శ్రీ మహాలక్ష్మి వెలసిన దివ్యక్షేత్రం ఈ కొల్హాపూర్. ఇది అష్టాదశ శక్తిపీఠాలలో ఒకటిగా ప్రసిద్ధి చెందింది. ఇక్కడ కొలువైన మహాలక్ష్మి అమ్మవారిని భవాని అంటారు. ఈ అమ్మవారిని కరవీరవాసిని, అమలాదేవి అని కూడా అంటారు. ఇక్కడే సరస్వతి, మహాకాళి విగ్రహాలున్నాయి. కొల్హాపూర్ పట్టణం క్రీ.పూ.నుండే ఉన్నదని తెలిపే చారిత్రక ఆధారాలున్నాయి. ఒకప్పుడు ఈ మహాలక్ష్మి ఆలయం చుట్టుప్రక్కల సుమారు 200పైన చిన్న పెద్ద ఆలయాలు ఉండేవట. భూకంపం కారణంగా నేలమట్టమై పోయినవి. అదికాక, క్రీ.శ.13,14 శతాబ్దాల కాలంలో ఇచ్చటకు దండెత్తి వచ్చిన మహమ్మదీయ రాజులు, మిగిలి ఉన్నవాటిలో చాలా భాగం ధ్వంసం చేశారు. ఎలాగో శ్రీ మహాలక్ష్మి అమ్మవారి ఆలయం మాత్రం వారి బారిన పడకుండా యథాతథంగా నిలిచి ఉంది.

మహాలక్ష్మి అమ్మవారి ఆలయం చాలా విశాలమైన ప్రాంగణంలో ఉంది. ప్రాంగణం చుట్టూ కోటగోడ అంత ఎత్తున ప్రహరీ గోడ ఉంది. ప్రాంగణం చుట్టూ ప్రహరీగోడకు ఆనుకొని లోపల చిన్న, పెద్ద ఉపఆలయాలు చాలా ఉన్నాయి. ప్రాంగణం మధ్యలో ఉన్న మహాలక్ష్మి అమ్మవారి ఆలయం అద్భుతంగా నిర్మించబడింది. ఈ ఆలయం పడమటి ముఖంగా ఉంటుంది. అమ్మవారి గర్భగృహం ముందు ఒక మంటపం, దానికి ఆనుకొని రెండువైపుల ఉత్తరం వైపు మహాకాళి ఆలయము, దక్షిణం వైపు సరస్వతి ఆలయమూ ఉన్నాయి.

అమ్మవారి గర్భగుడి చుట్టూ సన్నని ఇరుకైన ప్రదక్షిణ మార్గం ఉంది. గర్భగుడిలో సుమారు ఆరు అడుగుల ఎత్తైన చదరస్రాకాశిలా వేదిక ఉంది. ఆ వేదిక మీద రెండు అడుగుల ఎత్తు ఉన్న పీఠంపై అమ్మవారి విగ్రహం, నిలిచి ఉన్నట్లు ఉంటుంది. ఈ విగ్రహం చాలా అందంగా, ఆకర్షణీయంగా ఉంటుంది. రాతి శ్రీ చక్రము ప్రత్యేక గదిలో ప్రతిష్ఠింపబడి, పూజలు నిర్వహింపబడుతున్నాయి. ఇక్కడ అమ్మవారికి బంగారు పాదుకలు ఉన్నాయి. ఈ ఆలయంలో ప్రధానంగా నవరాత్రి ఉత్సవాలు ఘనంగా జరుగుతాయి. ముఖ్యంగా ఆశ్వయుజ శుక్ల పంచమినాడు విశేషంగా గొప్ప ఉత్సవం జరుగుతుంది. ఆ రోజున అమ్మవారి ఉత్సవమూర్తిని 5 కి.మీ. దూరంలో ఉన్న ఈ మహాలక్ష్మి అమ్మవారి చెల్లెలిగా భావించే త్రియంబువి అనే అమ్మవారి ఆలయం దగ్గరకు ఊరేగింపుగా తీసుకెళ్తారు. ఒక రోజున ఏదో విషయంలో ఇద్దరకూ మాట పట్టింపు రాగా, త్ర్యంబులి అలిగి అక్కగారి నుండి దూరంగా వెళ్ళి అటువైపు తిరిగి ముఖం పెట్టుకొని ఉండిపోయిందట. నవరాత్రి రోజులలో పంచమినాడు మహాలక్ష్మి అమ్మవారు తానే స్వయంగా వెళ్లి చెల్లెలిని చూసి వస్తుందని ఇక్కడి భక్తుల నమ్మకం.

ప్రతి సంవత్సరం మార్చి 21 నుండి 3 రోజులు, సెప్టెంబరు 21 నుండి మూడు రోజులు గర్భగుడి కిటికీ నుండి సూర్యకిరణాలు అమ్మవారి పాదాలను తాకుతాయి. ఈ సూర్యకిరణాలు సాయంకాలం పడడంతో ఈ సందర్భాన్ని బంగారు స్నానం అంటారు. ఈ నగరానికి ఒక కి.మీ దూరంగా యల్లమ్మ ఆలయం ఉంది. పెళ్లికాని పిల్లలు ఈ ఎల్లమ్మ తల్లికి పూజలు చేస్తే త్వరగా పెళ్ళిళ్ళౌతాయని ఇక్కడి వారి నమ్మకం. ఇక్కడ రెండు ప్రసిద్ధమైన మఠాలు ఉన్నాయి. ఒకటి జైనస్వామి మఠం, రెండవది సంకేశ్వర శంకరాచార్య మఠం.

కొల్హాపురంలో శ్రీమహాలక్ష్మి ఆలయప్రాంగణంలో శ్రీదత్తాత్రేయస్వామి ఆలయంకూడ ఉంది. ప్రతిరోజు మధ్యాహ్నం దత్తాత్రేయుడు మహాలక్ష్మి దగ్గర భిక్షచేస్తాడని ప్రసిద్ధి.



కొల్హాపురం శ్రీమహాలక్ష్మీ దేవికి, తిరుపతి శ్రీ వేంకటాద్రి విభునికి కొంత సంబంధం ఉంది. వైకుంఠం నుండి అలిగివచ్చిన శ్రీమహాలక్ష్మీదేవి యిక్కడికి, వచ్చి స్థిరపడిపోయిందట. వింధ్యపర్వతానికి దిగువ భాగాన గల కొల్హాపురం, మహారాష్ట్రంలో వున్నది. తెలుగు మహాకవి, కవితాసార్వభౌముడు ఈ క్షేత్రాన్ని సందర్శించాడు. ఆయన మాటలలోనే చదువుకుందాం. శ్రీనాథుడీ సమయంలో, క్షీరారామ, సోమారామ, ద్రాక్షారామాదులను చూడడానికి, పట్టిస వీరభద్రేశ్వర స్వామిని చూడాలని వస్తూ దారిలో కొల్హాపురంలో లక్ష్మీదేవిని సేవించాడట. ఆమె

**"శౌరి వక్షస్థఃలీనభశ్చంద్రరేఖ**
**శ్రీమహాలక్ష్మి భక్తి వీక్షించె తపసి -**

ఇంకో పద్యంలో

**"కొల్లాపుర లక్ష్మికి ప్రణ**
**మిల్లిరి పులకాంకురములు మేనుల బొడమన్**
**హృల్లేఖా మంత్రోపని**
**షల్లతికా కుసుమమునకు సతియున్ ప్రతియున్**

అగస్త్యుడు లోపాముద్రతో కలిసి, కొల్హాపురంలోని శ్రీమహాలక్ష్మిదేవికి ప్రణమిల్లిన మహా ఉదంతాన్ని తెలుగుకవి పొగడడం విశేషం

**"క్షీరాబ్ది కన్యకు - శ్రీమహాలక్ష్మికి**
**కమలాయతాక్షికి - కంబుకంఠి**
**కఖిలలోకేశ్వరి కామ్నాయవినుతకు**
**కనకకేతకపుష్పగర్భగౌరి**

**కరుణాధరోష్ఠికి - అమరకోటి కిరీట**
**కోటివిటంక సంఘాతఘటిత**

**రత్నాంకుర ప్రభా - రాజి నీరాజిత**
**శ్రీపాదపద్మపీఠోపకంఠ**

**కంబురుహనాథుదేవికి నాదిశక్తి**
**కిందిరకు లోకమాతకు యిగురుబోడి**
**కలరువిల్కావితల్లికి నా(శితార్థ**
**కల్పవల్లికి మ్రొక్కంగ కంటిమంటి**

యని కొల్హాపురం శ్రీమహాలక్ష్మిని ఘనంగా వర్ణిస్తూ స్తుతించాడు. మనమూ ఆ దేవిని దర్శించి తరిద్దాం.



# 39. శ్రీశైలక్షేత్రం

భారతదేశంలోని ద్వాదశజ్యోతిర్లింగాల్లో మొదటిది 'సౌరాష్ట్రంలోని సోమనాథ క్షేత్రం'కాగా రెండవది 'శ్రీశైలేమల్లికార్జునమ్' అని ఖ్యాతి. ఈ క్షేత్రం అత్యంత ప్రాచీనమైనది. దుర్గమమైన అరణ్యాలు, ఎత్తైన కొండలు, లోయలు, మధ్య అత్యున్నత శిఖరంమీద, ఆకాశంమీద వెలిగే మహాజ్యోతిర్లింగ ప్రభువు, స్వయంభువుగా వెలసిన దివ్యక్షేత్రము. ఈశాన్య భాగాన ఉత్తుంగ తరంగ శీకరాహ్లాదసమ్మోద భరిత నదీమహారాణి కృష్ణవేణి చరియలగుండా ఒయ్యారంగా ప్రవహిస్తుంది. ఆమె కమనీయ, రమణీయ, స్తవనీయ నడక విరజానదిలో రాజహంసలా వుంటుంది. అందరినీ సమ్మోహపరచేశక్తి వుంది కనుకనే, కవి కోకిల జాషువాగారు "కృష్ణావాహినీమోహినీ" అని వ్రాశాడు. కృష్ణకు పాతాళగంగ అని కూడా పేరు.

శ్రీశైలక్షేత్రం ప్రస్తుతమాంధ్రదేశములోని కర్నూలు జిల్లా పరిధిలోవుంది. శ్రీశైలాన్ని దర్శించిన వారిలో పౌరాణికులు, అగస్త్యుడు, లోపాముద్రలు ముఖ్యులు - తరువాత 7వ శతాబ్దిలో ఆదిశంకరాచార్యులు. వారు చాలాకాలం యిక్కడ ఒక గుహలో తపస్సు చేశారట. ఆ గుహను యాత్రికులు నేటికీ దర్శిస్తుంటారు. దానికి ఆదిశంకరుల తపస్సు చేసిన పాలధారల చోటని చూపుతారు. అది తన్మయంపజేసే మనోహర దృశ్యం. చుట్టూ ఆకాశగంగలా దుమికే సెలయేళ్లు, ఏండ్లవయస్సును గర్భంలో దాల్చుకున్న మహావృక్షాలు, వృద్ధవృక్షాలు అపరమునులవలె దర్శనమిస్తాయి. ఇది తప్పకుండా చూడతగిన స్థలం. ఇక్కడి అదిష్ఠాన దేవుడు శ్రీగిరిమల్లికార్జునుడు. అధి దేవత శ్రీభ్రమరాంబికాదేవి. అష్టాదశ శక్తి పీఠాల్లో భ్రామరీ శక్తిపీఠం భ్రమరాంబ. దేవియొక్క ఉనికి భ్రమరధ్వనివలె వినిపిస్తుంది. మల్లికార్జున మహాలింగానికి ఎవరైనా అభిషేకం చేయవచ్చు. ఇది మహాక్షేత్రం తీర్థరాజము. ఈ క్షేత్ర అభివృద్ధికి చోళులు, కాకతీయులు కృషిచేయగా,

సర్వోన్నత అభివృద్ధికి కారణం విజయనగర ప్రభువులైన, హరిహరరాయలు, బుక్కరాయలు, అచ్యుత, నరసింహదేవరాయలు, కాగా వీరందరికంటె అత్యంత భక్తి ప్రపత్తులతో సేవించి, మందిరాలు, గోపురాలు, విశ్రాంతి మండపాలను కట్టించినవాడు శ్రీకృష్ణదేవరాయలు. ఇప్పటికీ రాయలు కట్టించిన గోపురం మనకు స్వాగతం చెబుతుంది. ఇది ఆరాధ్యులకు నిలయం – కర్నాటక మనకు సమీపరాష్ట్రం – అక్కడి నుంచి వేలాది కన్నడ శివభక్తులు గుంపులు గుంపులుగా నడిచి వస్తారు – శివదీక్షాపరాయణులు ముఖ్యంగా, ఉగాది, శివరాత్రి పర్వదినాలలో కృష్ణాపగా తోయమాలికలందు క్రుంకులిడ సభక్తి పూర్వకంగా వచ్చి అర్చిస్తారు. ఇది వీరశైవభక్తులకు నిలయం. 11,12 శతాబ్దాలకాలంలో వీరశైవులు, శివుని యెదుట తలలు తెగకోసుకొని శరీరాలు సమర్పించుకున్న ఉదంతాలు వింటాం. కాని కాలక్రమేణ ఆ ఆత్మార్పణలు తగ్గిపోయి. సాధు భక్తి తత్వాలకు నిలయమయింది. మల్లికాపూలచేత అర్జునుడు అర్చించడం వల్ల మల్లికార్జునుడైనాడని ఒకకథ. అర్జున వృక్షాన్ని మద్దిచెట్టు అంటారు. చుట్టూ అర్జునవృక్షాలు బాగా పెరిగి అరణ్యంగా వుండేదట – ఆ చెట్ల నడుమ వెలసిన గిరి దేవుడు ఈ మల్లికార్జున గిరివల్లభుడు – ఈ స్వామిపైన ఎందరో కన్నడ, తెలుగు శివభక్తులు కవితలు కావ్యాలు వ్రాశారు. కన్నడులు దేవరనామాలు, తెలుగువారు పాటలు కావ్యాలు వ్రాశారు. మన తెలుగు కవితావల్లభుడు, వినుకొండ ఆస్థాన కవి శ్రీశైలమల్లికార్జునుని పాదాబ్జ విధేయుడు. శ్రీనాథుడు ఎన్నో విధాల ప్రశంసించాడు. ఇతడు వ్రాసిన శివరాత్రి మాహాత్మ్యంలోని భక్తుల కథలు, ఘట్టాలు శ్రీశైలానికి సంబంధించినవే. కృష్ణకు పాతాళగంగయను పేరు అప్పటికే వున్నట్లు తెలుస్తుంది – శ్రీశైల పర్వతప్రాంతమందు కనిపించు ప్రతి గండశిలయందు శివుడు నివసిస్తాడని, ప్రతిశిల ఒక లింగరూపమని వర్ణించాడు. శ్రీశైల శిఖరం చూస్తే పునర్జన్మ వుండదనే సూక్తిని శ్రీనాథుడు కూడ యిక్కడ వక్కాణించాడు.



**"శిఖరమీక్షించు నంతన**
**చేరునట్టి ముక్తి; జంతువులకు**
**జీవములు దొరంగ;**
**చచ్చినపుడుకాని మోక్షంబులేని**
**కాశి కరుగంగ నేటికి;** అంటాడు –

చచ్చిన తరువాత కదా మోక్షం కలిగేది – దాని కోసం కాశికెందుకు వెళ్లడం – ఈ శ్రీశైలంలో అల్లంత దూరానగల నంది విగ్రహం ద్వారా శ్రీశైలశిఖరం చూస్తేచాలు ముక్తి కలుగుతుందని అంటారు. ఇప్పటికీ యాత్రికులు, అలానే చేస్తారు – శక్తి పీఠాలలో ఒకటిగా ప్రసిద్ధి చెందిన ఈ క్షేత్రాధి దేవత, జగన్మాత పార్వతి భ్రమరాంబికా రూపాన స్వయంభువుగా వెలిసింది.

శ్రీశైలాదిపర్వతాల దర్శనం ముక్తికి కారణం జన్మజన్మాల జ్ఞానాజ్ఞానాల దుష్టపాపహరణం, కాబట్టి యాత్రికులు ఎక్కువ సంఖ్యలో వస్తారు. ఈ క్షేత్రం మహామంత్రసిద్ధులకు సిద్ధ భూమి. అష్టాంగయోగులు, ఖండయోగులు, అఖండయోగులు, అవధూతలు, గుహలలో నివసించే తపోశక్తి సంపన్నులు నిరంతరం స్వామి సన్నిధిలో వుంటారు. దైవీశక్తులకు కేంద్రం. యోగులకు ఆవాస భూమి. తలను భూమిపై పెట్టి, కాళ్లుపైకి తిప్పి, రోజులకొద్దీ తపస్సులో వుండే మహాతపోశక్తి సంపన్నులు యిక్కడ కన్పిస్తారు.

ఇది గొప్ప ఔషధక్షేత్రం. అనేక రకాల ఔషధమొక్కలు వృక్షాలు లభిస్తాయి. ఎవరికీ దొరకని, సంజీవని మొక్క, ఎర్ర కలమంద, యీ గుట్టల, లోయలలో వుంటాయట – అడవి పండ్లు ఇరికి, మధూలిక, వెలగ, అడవి మామిడి, నల్లవావిలి వంటి అపురూప మొక్కల కోసం, పరిశోధకులు వస్తారు. మద్ది (అర్జున) వృక్షాలు, వెదురు, దేవదారు, వృక్షాలు ఎక్కువ. మాలతీ, జాజి, మల్లి పొదపత్రి వంటి తీగెల మొక్కలు, తెల్లవిసర మొక్కలు లభిస్తాయి.

శ్రీశైలం వచ్చిన వాళ్లు యిక్కడి ఆనకట్టను చూడకుండా ఉండరు. కృష్ణానదిపై కట్టిన యీ డాం వద్ద విద్యుదుత్పాదక కేంద్రం వుంది. ఆంధ్రప్రదేశ్‌కు యిక్కడి నుండి విద్యుత్తు సరఫరా అవుతుంది – కృష్ణానదిపైన నాగార్జునసాగర్ 'డాం' కట్టారు. అక్కడి నుంచి కూడ విద్యుత్తు సరఫరా అవుతుంది. సాగర్ ఎడమ, కుడి కాల్వల ద్వారా సాగునీరు, త్రాగునీరు సరఫరా అవుతుంది. కృష్ణానదీ సౌందర్యాన్ని వీక్షించడానికి, నాగార్జున సాగర్‌వద్ద పెద్ద పెద్ద ఓడలు, యంత్రపడవలున్నాయి.

శ్రీశైలం దర్శనం ఒక పవిత్ర యజ్ఞం వంటిది. ఆది శంకరుల తపస్సు చేసినచోటు "పంచధార"లను తప్పకుండా చూడాల్సిందే. చాలా దూరంలో గుహలు. జలపాతాలున్నాయి. అక్కడికి పోయే మార్గాలు అంత సవ్యంగాలేవు. కనుక ఎవరూ సాహసించరు.

హైద్రాబాద్ నుండి, కర్నూలు నుండి గాని, తిరుపతి, శ్రీకాళహస్తి నుండి గాని ఆర్.టి.సి. బస్సులలో లేదా ప్రయివేట్ బస్సులలో శ్రీశైలక్షేత్రానికి వెళ్లవచ్చు శివదర్శనం, అమ్మవారి దర్శనం చేసికోవచ్చు.